# వి ష యా లు

## ఎన్. ఆర్. చందూర్ ఇతర పుస్తకాలు

జీవితం
నవచైనా
చెట్లు
ఆరు కథలు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
ప్రతి గురువారం
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
శిక్ష
అంతేనా
కాఫీ మానెయ్యడం
పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం

ఆఖరు కోరిక
ఎక్కడిక కమలా ?
నాసుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినిమాకి
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతాఫలాలు
భాష
పూసలమేడ
శివరావు
కలదో లేదో

# అందాల దీవి

అందాల దీవి అనదగిన మాన్‌హట్టాన్ దీవిలోని న్యూయార్క్ నగరంలో జన్మించడం, నాకే కాదు - ఏ కుర్రవానికైనా అపూర్వవరం వంటిది.

న్యూయార్క్ పట్టణం ఒక సుందరప్రదేశం. నల్లరాయి పరచిన రోడ్లూ, ఎర్ర యిటుకలయిళ్ళూ, లేసుతెరలూ, రబ్బరు చెట్లూ గల ఈ న్యూయార్క్, బార్ రూములతో, అనాథశిశు శరణాలయాలతో, గర్భదారిద్ర్యం మహదైశ్వర్యం, చెరోవైపున గల వింత పట్నం. ఫిఫ్త్ ఎవెన్యూలో గుర్రపుబగ్గీలూ, గుర్రాలతో లాగబడే కార్లూవుండేవి. పెద్దపెద్ద జోళ్ళువేసుకుని, పొడుగాటి కొరడాలతో గుర్రపు బళ్ళని తోలేవారు ఆ నాటి కోచ్‌మెన్. నడివీధిలో వస్తువులమ్మేవాళ్ళ కేకలు, ఒక లయలో వినిపించేవి. పొడుగాటి గడ్డాలతో పురుషులూ, గుండీలు గల జోళ్లతో స్త్రీలూ, కార్ఖానాలో పనిచేసే పిల్లలూ, ఆ నాడు ఎక్కడపడితే అక్కడ కనిపించేవారు. దడదడ శబ్దం చేసుకుంటూ పడమటినుంచి వచ్చే రైలుబళ్ళు పశు సంపదనిపట్టుకొచ్చి పడేసేవి. ఇక ఓడలు, దేశదేశాలనుంచి వింతవింత వస్తువులని తీసుకొచ్చేవి. ముఖ్యంగా నీటి రేవు (River - front) నిరంతరం నూతన జీవంతో కలకల్లాడేవి. అది

పద్దెనిమిదివందలతొంభై - పంథొమ్మిదో శతాబ్దం ముగియబోతున్న సమయం.

కాలపురుషుడు పాత బట్టల్ని వొదిలేశాడు. అప్పుడినే విడు గత్తిపుట్టున్నాడు. అందుచేత, ప్రతిరంగంలోనూ మార్పు అనేది సహజవాంఛితమైపోయింది. సంఘాన్ని శతాబ్దాలుగా మానవ జీవితమూ, ఆచార వ్యవహారాలూ, ఆలోచనావిధానమూ కొత్తరూపు తీసుకున్నాయి. విక్టోరియానిజమ్ (అనగా విక్టోరియా మహారాణి పరిపాలన పూర్తి అయేవరకూ వున్న జీవనవృక్షం) సడలిపోయి, ఏదో కొత్త పుంతలవైపుగా మానవుడు పరుగులెత్తుతున్నాడు. నేను కళ్ళు తెరిచేనాటికి నాకు కనిపించిన ప్రపంచం విద్యుత్కాంతులతో తేజరిల్లుతోంది. న్యూయార్క్ నగరవీధుల్లో దేశదేశాల మనుషులూ కనపడేవారు. అన్ని దేశాలవారూ, అన్ని జాతులవారూ, అన్ని రంగులవారూ ఆ నాడు ఎంతో సామరస్యంతో ఐకమత్యంతో జీవించేవారు. ఐరోపియనులూ, ప్రాచ్యఖండవాసులూ, నీగ్రోలూ, రెడ్‌యిండియన్‌లూ, జిప్సీలూ అను విభేదం లేదు - యీ కలగాపులగం నుంచే అమెరికన్‌జాతి పుట్టుకొచ్చిందంటే కాని పుష్పపమొందింది.

వివిధదేశాలవారూ వివిధజాతులవారూ అక్కడ వుండటం వల్ల వివిధమైన వృత్తులకి అవకాశమంటూ ఏర్పడింది. దూర తీరాలనుంచివచ్చి, మాన్‌హట్టాన్ దీవిలో స్థిరపడిపోయిన యీ మనుషులు, తాము తమతమదేశాల్లో సాగించిన వృత్తి వ్యాపారాలనే, యిక్కడా అవలంబించేవారు. ఆహారపదార్థాలమ్మే అంగళ్లూ, రొట్టెలు తయారుచేసే బేకరీలూ వంటవే కాకుండా, అందమైన

కొవ్వొత్తులు తయారుచేసేవారు; అపురూపమైన కంబళ్లు నేసేవారు. ఇక, చైనా జపాన్ దేశాలనుంచి వచ్చినవారు చక్కటి బీరువాలూ కర్రసామాగ్రి తయారుచేసేవారు. హాలెండునుంచి వజ్రవైఢూర్యాలు కోసేవారూ, ఫ్రాన్సు బెల్జియమ్ దేశాలనుంచి అందమైన లేసులు అల్లే నేర్పుగలవారూ, స్పెయిన్‌నుంచి ఖరీదైన చుట్టల తయారీలో ప్రజ్ఞావంతులూ - యీ విధంగా తమవృత్తి విద్యలలో అపారఖ్యాతి నార్జించిన మనుషులు యీ అందాల దీవిలో ఉంటూండేవారు. ఆ నాటి మాన్ హట్టాన్ ఒక చిన్న ప్రపంచం అనుకోండి.

అటువంటి చక్కటి ప్రపంచంలో జన్మించాడు ఈ రచయిత. పుట్టిన నాటినుంచీ తనకి సన్నిహితమైన ఆ ప్రపంచాన్ని యీ రచయిత ప్రేమిస్తూనే వున్నాడు. నేను ఆ పట్నానికి చెందిన వాణ్ణి - ఆ పట్నంవాడి. ఆ పట్నంవాడి అయిన కారణాన, ఎక్కడికిపడితే అక్కడికి, నాయిష్టంవచ్చినట్లు తిరగవచ్చు. చిన్నప్పుడు అదేపని చేసేవాణ్ణి. న్యూయార్క్‌లోని మారు మూలలన్నీ సంచరించివచ్చేవాణ్ని. యీ మహాపట్నంలో నాకు తెలియని భాగమంటూ వుండకూడదని నా పట్టుదల.

"పిల్లల్ని ఎత్తుకుపోతార్రా!" అని పెద్దవాళ్ళు భయపెట్టేవారు. నిజానికి ఆ రోజుల్లో పిల్లల్ని, ఓడల్లోదాచేసి, ఎత్తుకుపోయేవారుకూడా. అయినప్పటికీ నేను గంటల తరబడి నీటి రేవులో పచార్లుచేసేవాడిని. ఆ తెరచాపకొయ్యలూ, ఆ పెద్దపెద్దతాళ్ళూ నీలి ఆకాశం, తళతళ్లాడే నీటి కాంతీ, యీ బాలకుని మనసులో సంభ్రమాశ్చర్యాలకి కారణభూతమయేవి. ఆ తెర చాపలూ,

యినపగొలుసులూ చూసిన కొద్దీ, యింకా చూడాలనిపించేది. మా రేవులో ఆగేవి అన్నీ వోడలు మాత్రమేకాదు, మహాసము ద్రంలో ప్రయాణం చెయ్యగల స్టీమర్లూ, విహారార్థం వుపయోగపడే నౌకలూ (Yachts), తీరానమాత్రం ప్రయాణంచేసే పడవలూ, పెద్ద పడవలవెంట నడిచే చిన్న పడవలూ యిలా - రకరకాలైనవి అక్కడ లంగరువేసుకు నిలిచేవి. ప్రతి పడవకీ ఒక చరిత్ర వుంది కదా! స్టీమర్లెప్పుడూ, మాకు తెలియని దూరపు ఓడ రేవులనుంచి వస్తూండేవి. యూరప్, దక్షిణ అమెరికా, చైనా, జపాన్, ఆఫ్రికా, ఆస్ట్రేలియా మొదలైన ప్రదేశాలనుంచి, మా అందాలదీవికి రక రకాల సరుకులువుచ్చుకు వింతవింత దుస్తులతో నావికులు దిగు తూండేవారు. వాటర్ ఫ్రెంటులో మలయనులూ, చైనీయులూ, ఆఫ్రికన్లూ, నీగ్రోలూ వగైరా జాతులవారు తమ దేశీయదుస్తు లలో దర్జాగా కనపడుతూండేవారు.

బైట దేశాలనుంచివచ్చే వోడలు వీక్షించడం నా కార్యక్రమా వళిలో ఒకభాగం మాత్రమే. ఆ మాదిరి సరదాలు యింకా చాలా వున్నాయి. మాన్ హట్టాన్ దీవిలోని నలభై రెండవ వీధిదగ్గిర, నాలుగువైపులనుంచి వచ్చే రైలుమార్గాలు కలుసుకునేవి. అక్కడ నుల్చుంటే ఎన్నిరైళ్ళు చూడవచ్చో!! పడమటనుంచి వచ్చేరైళ్లు, పసిఫిక్ తీరంనుంచి వచ్చేరైళ్ళు, ఎన్నిరైళ్ళో చెప్పలేను - అదొక కన్నుల పండుగ.

పార్క్ ఎవెన్యూలో రైలు బద్దీలకి దగ్గిరగా నిలబడి, ధనా ధనాశబ్దం చేసుకుంటూ పరుగెత్తే ఆ రైళ్లని చూడటం, ఏ కుర్ర

వానికి సరదాగాఉండదు ? ఆ రమణీయదృశ్యంనుంచి దృష్టి మరల్చుకోలేకపోతాడు. ముఖ్యంగా, రివాల్వింగ్ ప్లాట్ఫారమ్ మీద రైలుయింజను నిలబడ్డాక, ఆ ప్లాట్ఫారమ్ని ఒక వైపునుంచి మరొకవైపుకి గుర్రాలుతిప్పడం చూడవలసిందేగాని చెప్పలేను. ఆ అద్భుతం చూడటానికి నే నొక్కణ్ణేకాదు, నాతోపాటు నావయసు వాళ్ళు చాలామంది, నాకు సాయంవుండేవారు. ఆ ఆవిరీ, ఆ పొగా, ఆ చక్రాలూ, మమ్మల్ని ఆశ్చర్యంలో ముంచెత్తేవి. పార్క్ ఎవెన్యూ అంతా పొగగొట్టాలతో ఫాక్టరీలతో నిండిపోతున్నదనిగానీ, శుభ్రమైన యిళ్లకి బదులు చిన్నిచిన్నివాటాలు రూపొందుతున్నా యనిగాని, యింటికప్పులమీద నల్లటిమసి దట్టంగా అంటుకుంటో దని కానీ మేము బాధపడేవాళ్ళం కాదు. ఆ రైళ్ల రాకపోకలు చూడటం మాకు ఎంత సంతోషమో !! ఆ నాటి పార్క్ ఎవెన్యూ మాపాలిట ఒక ఆనందమందిరం.

ఎప్పుడూ, నేను ఓడలుచూస్తూనూ, రైళ్ళుచూస్తూనూ కాలంగడిపేవాడి ననుకోకండి. నేను చూడవలసినవీ తెలుకోవ వలసినవీ యింకా చాలావున్నాయి. అప్పుడప్పుడు పట్నం దిగువకి వెళ్తూండేవాడిని. అక్కడ వివిధదేశాలవారు, వారివారి వలసలు ఏర్పరచుకున్నారు. ఇటాలియనులూ, చైనీయులూ, ఆఫ్రికనులూ, టర్కులూ, సిరియన్లూ, హంగేరియన్లూ, ఫ్రెంచివారూ, నీగ్రోలూ, జర్మన్లూ, స్పానిష్వారూ, ఎవరికి వారు ప్రత్యేకంగా, తమతమ ప్రత్యేక విభాగాల్లో వుంటూండేవారు. దేనికది పేరుపేరున జిల్లాగా పిలవబడుతూండేది - అంటే పేటలు. అక్కడికి వెళితే కొత్త భాషలు వినిపించేవి; కొత్తమొహాలు కనిపించేవి. అప్పటి కింకా

ఎవరూ తమ సంప్రదాయదుస్తుల్ని విడనాడలేదు. ఆయా పేటల్లోని దుకాణాల్లో వారి దేశీయుల కిష్టమైన వస్తువులూ ఆహారపదార్థాలూ అమ్ముతూండేవారు.

అందాలదీవికి ఒక కొసని పూర్వకాలపు భవంతులుండేవి. అమెరికా విప్లవంలో పాల్గొన్న సేనాధిపతులవి అవి. ఆ పెద్దపెద్ద భవనాలుచూస్తుంటే, ఏదో చెప్పలేని ఆనందం కలిగేది. మా వూళ్లో ఒక వీధివుంది - అక్కడ కాఫీగింజలు మటుకే అమ్ముతారు. మరొక వీధిలో చొప్పతాళ్ళు, ఓడ సామాగ్రి అమ్ముతారు. మరొక చోట వస్త్రాలుమాత్రమే. యింకొకచోట నూనెలు - యీ ప్రకారం కొన్నికొన్నివీధులు, కొన్నికొన్ని వస్తువులకని ప్రత్యేకింపబడ్డాయి. నా చిన్నతనంలో ఏ వీధి ఎందుకు ప్రశస్తో యిట్టే చెప్పగలిగే వాడిని.

నేను కొనేదేమీ లేకపోయినా, అప్పుడప్పుడు టోకు మార్కెట్‌లు చూడటానికి వెళ్ళేవాడిని. బళ్లతో కాయగూరలు తీసుకొచ్చి, బండీ యింత అని అమ్మేసేవారు. అదే విధంగా చేపలూను. పడమటనుంచి పట్టుకొచ్చిన పశువులని ఫస్ట్ ఎవెన్యూ మీదుగా, కసాయి గృహాలకి తీసుకెళ్ళేవారు. అన్నిటికంటె, యిరవై నాలుగోనంబరు వీధిలోని ప్రత్యేకబజారులో నేను ఎక్కువకాలం గడిపేవాడిని. అది గుర్రాల మార్కెట్.

గుర్రాలని అక్కడ, వారానికి చాలా దఫాలు, వేలం వేస్తూండేవారు. రకరకాల గుర్రాలని పట్టుకొచ్చేవారు. కొన్ని బగ్గీ

గుఱ్ఱాలయితే, కొన్ని స్వారీగుఱ్ఱాలు. కొన్ని భాగ్యవంతులయింట పెరిగినవయితే, మరి కొన్ని కష్టంచేసి రోజులు వెళ్ళబుచ్చినవి. కాని చాలా గుఱ్ఱాలు బక్కచిక్కవున్నట్లే కనిపించేవి. ఒక్కొక్కప్పుడు యీవేలం పాటలోకి ఐరిష్‌గుఱ్ఱాలూ, అరేబియాగుఱ్ఱాలు కూడా రావడం కద్దు.

అమ్మకానికని ప్రదర్శించిన గుఱ్ఱాలని, చక్కగా డ్రస్‌చేసుకున్న రౌతులు యిటూఅటూ తిప్పుతూండేవారు. ఆ తిప్పడం ఎందుకంటే, గుఱ్ఱం ఎటువంటిదో కొనుగోలుదారికి తెలిసేందుకు! గుఱ్ఱం యీ కొసనించి ఆ కొసకి తిప్పబడుతున్నపుడు, ఆవరణకి బైట నిలబడ్డ మనుషులు, ఆ అశ్వానికిగల గుణగణాదులు చర్చించేవారు. ఒక్కొక్కపుడు కొరడాలు ఛెళ్ళుమనిపించి, ఆ గుఱ్ఱాలు ఏప్రకారం ప్రవర్తించేదీ కూడా పరిశీలించేవారు. అటువంటిచోట నిలబడి, వారు మాట్లాడుకునేది శ్రద్ధగావినే నాలాటి కుఱ్ఱవాడు, గుఱ్ఱాలగురించి క్షుణ్ణంగా తెలుసుకోగలడు.

అదే యిరవైనాలుగో నెంబరువీధిలో గుఱ్ఱపుశాలలు వరసగా వుండేవి. అక్కడే కమ్మరికొలిమి, జీనులు కళ్ళాలూ అమ్మేకొట్లూ మొదలైనవి ఉండేవి. ముదురురంగుతో తళతళ్లాడే కొరడాలూ, స్వారీచేస్తున్నపుడు వేసుకునేజోళ్ళూ, కళ్ళెం, కళ్ళెపుతాళ్ళూ, గుఱ్ఱపుసంచీ, గుఱ్ఱానికకప్పే కంబళీలూ, తత్సంబంధమైన సమస్తపరికరాలూ ఆ మార్కెట్‌లో లభ్యమయేవి. ఈ షాపుల ముందు అందంగా పెయింట్ చెయ్యబడిన చెక్కగుఱ్ఱాలు, ప్రకటనార్థం నిలబెట్టేవారు. అసలు గుఱ్ఱాలకంటే, ఈ చెక్కగుఱ్ఱాలు

ఎంతో బాగుండేవి. 'అలాటి దొకటి నాకుంటేనా!' అని, అవి చూసి నపుడల్లా అనుకునేవాణ్ణి.

మాన్ హట్టాన్‌లోని మరొక్క విషయం మీకు చెప్పాలి - అదేమిటంటే, సెంట్రల్ పార్క్. యీ సెంట్రల్ పార్క్ మధ్యని ఒక విశాలమైన చెరువువుంది. వేసవికాలం అయితే, యీ చెరువులో నౌకావిహారంచేయవచ్చు. సీతాకాలంలో యీ చెరువు మంచు ముద్ద అయిపోతుంది కాబట్టి స్కేటింగ్‌కి (Skating) వీలుగా ఉంటుంది. చెరువుమాటకేంగాని, సెంట్రల్ పార్క్‌లో ముఖ్యమైనది, అక్కడున్న జంతు ప్రదర్శనశాల. సింహాలూ, పెద్ద పులులూ, ఏనుగులూ, హిపపోటమస్‌లూ, ఒంటెలూ, బర్రెలూ, ఎలుగుబంట్లూ, తోడేళ్ళూ, వీటితో 'జూ' కలకల్లాడుతూండేది. అన్నిటినీ మించినవి కోతులు - వాటిదగ్గిరకూచుంటే గంటలు నిముషాలైపోయేవి.

ఆనాటి న్యూయార్క్‌లో ఎటువైపుకివెళ్లినా హాయిగా కాలక్షేపం అయేది. నగరజీవనమెంతో చైతన్యవంతంగావుండేది. వీధులనిండా మనుషులూ, సైకిళ్ళు, తోపుడుబళ్ళు, పెట్టెబళ్ళు, విక్టోరియాలు, గుర్రాలులాగే బస్సులు, అద్దెబళ్ళూను. ఎక్కడికక్కడ కుప్ప వాళ్లు (Sweepers) గుర్రపుపెంట ఎత్తి, పరిశుభ్రం చేస్తూండేవారు. గుర్రాలు ఎక్కువ కాబట్టి వాళ్ళకీ పని ఎక్కువగాఉండేది. ఏమైతేనేం, వీధులెప్పుడూ గుర్రపుపెంట వాసనతో ఏదో తమాషాగా వుండేవి. యీ గుర్రపుపెంటకోసం వేలాది సోమరిపిచ్చుకలు కిచకిచలాడుతూ అల్లరిచేసేవి.

ఆనాటి న్యూయార్క్ వీధులు ఎప్పుడూ హడావిడిగావుండేవి. తప్పిపోయిన గుఱ్ఱం వీధులవెంట పరిగెత్తడమో, దొంగతనమో, వీధికొట్లాటో, యివేవీ కాకపోతే ఎక్కడో యిల్లు అగ్నిప్రీతి అవడమో - ఏదో ఒకటి వుంటూండేది. యిళ్లకి నిప్పు అంటుకున్నప్పుడు, ఫైర్ యింజనులు పరుగెత్తడం చూడాల్సిందే! నల్లరాతి నేలమీద, గుఱ్ఱపుడెక్కలకి యినుము తగలడంతో, ఆరాపిడినుంచి వెలువడే, నిప్పురవ్వలుచూడటం, మాలాటి కుఱ్ఱకారుకి ఎంత సంతోషమో చెప్పలేను. ఆ నిప్పురవ్వలు మా కళ్లకి రత్నాల్లా అగపడేవి. ఫైర్‌యింజను యీలవేసి, గంటలుమోగిస్తూ, గబగబాపరుగెత్తేసరికి, చుట్టుపట్లనున్న పిల్లలమందరం వీధిలోకివచ్చి, దాని వెనక పరుగెత్తేవాళ్ళం. యిల్లు అంటుకున్నపుడు పై అంతస్తుకి నిచ్చెనలువెయ్యడం, కింద వలపరిచి, పైనవున్న వారిని వలలోకి దూకమనడం, ఆ హడావుడీ ఆ ఖంగారూ, ఆ ఏడుపులూ, ఆ ఏడుపుల్లో ఆనందబాష్పాలూ అవన్నీచూడాలే గాని యిప్పుడు నేనేం చెప్పేది! ఒక్క మాటమాత్రం నిజం. మాది అందాలదీవి. అందుకు సంశయం లేదు.

వీటన్నిటితోపాటు, మా తాతగారికి థర్డ్ ఎవెన్యూలోని యాభైరెండోవీధిలో, ఒక చుట్టలషాపువుండటం, నా అదృష్టమని చెప్పాలి. కిందషాపూ, పైన మేమూ వుండేవారం. ఈ షాపు ఒక విధంగా నాకు నాలుగు రోడ్లకూడలివంటిది. ఫైర్‌స్టేషనూ, పోలీసు స్టేషనూ మాకు కనుచూపుమేరలోవుండేవి. రెండు వీధులవతలనే మా స్కూలు! అన్నీ అందుబాటుగావుండేవి. మా తాతగారిషాపు ఐరిష్ ప్రజలుండే ప్రాంతానవుండేది. ఐరిష్‌వారి మధ్య బ్రతకడమంటే చాలా సరదాగా వుంటుంది.

మా చుట్టల షాపులోకి ప్రతిదినమూ రకరకాల మనుషులు వస్తూండేవారు. నేను మా తాతగారికి, నాచేతనయిన సాయం జేస్తూ, పక్కన నిలబడేవాడిని ఎప్పుడూ.

నీలం బట్టలు ధరించి ధగధగలాడే యిత్తడి బొత్తాములతో వచ్చే పోలీసు జవానులబేరం జాస్తి మాకు. వీరితోపాటు డిటెక్టివ్‌లూ ఫైర్ మెనూకూడా వస్తూండేవారు. చుట్టలకీ సమిలేపొగాకుకీ నశ్యానికీ, మా తాతగారిషాపు ఆ చుట్టుపట్ల పేరు గడించుకుంది. వొచ్చిన పోలీసుజవానులు మా తాతయ్యతో, తాముచేసిన సాహస కార్యాలు పూసగుచ్చినట్లు చెపుతూండేవారు. జూదపుకొట్టు పశ పరచుకోడం, దొంగనాణాలుపట్టుకోడం, యిటువంటివి పోలీసు వాళ్ళుచెబితే, విషాదభరితమూ, కరుణరసపూరితమూ అయిన గాథలతో మమ్మల్ని ద్రవింపచేసేవారు ఫైర్‌మెన్! ధగధగలాడే మంటల మధ్యనుంచి, చంటిపిల్లల్నీ, స్త్రీలనీ, గుర్రాలనీ, ఎలా రక్షించినదీ వాళ్ళు చెపుతూంటే కళ్లలో నీరు నిలిచేది.

ఫైర్‌మెనూ, పోలీసుజవాన్లూ మాత్రమే మా షాపుకి వచ్చేవారనుకోకండి. మా కాతాదారుల్లో యింకా చాలామందివున్నారు. మిసెస్ లియరీకి డబ్బీలోని ముక్కుపొడుం అయిపోయేదాకా, ఆ సంగతే జ్ఞాపకం వచ్చేదికాదు - అది రెండురోజుల కొకసారి జరిగే ఉపద్రవం. ఇక ఫిడేళ్ళు తయారుచేసే ఎడాల్ఫ్‌కి చుట్టలెప్పుడూ సరిపడేవికాదు. మిస్టర్ హాడ్లీ పైప్-పొగాకుకోసం వచ్చేవాడు. యాక్టర్‌నని చెప్పుకునే మిస్టర్ క్యాఫ్ ఖరీదైన పొడుగు చుట్టలు కావాలనే వాడు.

మిసెస్ లియరీ కలుపుగోరు మనిషి. ఆమె లేతనీలపు కళ్లలో కొంచెం తళతళవుందిగాని, నోటికిమాత్రం విశ్రాంతి అంటూ లేదు. ఎప్పుడూ కీళ్ల నెప్పులనేది. కాని మున్నూట అరవైరోజులూ సూర్యోదయంకాక పూర్వమేలేచి ప్రార్థనలు పూర్తిచేసుకువచ్చేది. వేసవికాలం, సీతాకాలం అను తేడాలేకుండా, తన నల్లటి డ్రస్ మీద గోధుమవన్నె శాలువా కప్పుకునేది. కొపెన్‌హాగన్‌నుంచి వచ్చిన ముక్కు పొడుమంటే ఆమెకి మహాప్రీతి. అవున్నుముక్కుపొడుమూ రెండురోజులు కూడా వచ్చేదికాదు.

ఫిడేళ్ళు తయారుచేసే ఎడాల్ఫ్‌కి యంత్రాలూ, మార్పూ, సైన్సూ, నాగరికతా - యిటువంటి వాటిమీద కించిత్ కూడా నమ్మకంలేదు. ఫిడేళ్ల తయారీకి మల్లేనే, ఈ ప్రపంచాన్ని కూడా బాగుచెయ్యలేమని అతని వుద్దేశం. బిస్మార్క్ అంతవాడు పుట్టలేదనీ, పుట్టబోడనీ, కెయిజర్‌ప్రభువు ఆ బిస్మార్కుకి అన్నివిధాలా యోగ్యుడయిన వారసుడనీ ఎడాల్ఫ్ నిశ్చితాభిప్రాయం.

మిస్టర్ హాడ్లీవున్నాడే, ఆయన యిందుకు పూర్తిగా వ్యతిరేకం. ఏదోమార్పు రావాలనీ, భవిష్యత్ ఏదో బ్రహ్మాండంగావుంటుందనీ, మిస్టర్ హాడ్లీ ఉద్దేశం. ప్రతి విషయంమీదా హాడ్లీ తన స్వంత అభిప్రాయం వెలిబుచ్చేవాడు. పదిమందీ అనేమాట పాటించేవాడు కాదు. తాతయ్యకి అతని అభిప్రాయాలు వింటుంటే ఒక్కొక్కపుడు వొళ్లుమండేది; కాని, ఆ తరువాత మాటల సందర్భంలో మిస్టర్ హాడ్లీది స్వతంత్రమయిన మేధస్సని ('బుర్రవుందని') ఎంతో గౌరవపూర్వకంగా పేర్కొనేవాడు.

మిస్టర్ క్వాఫ్ ఒకప్పుడు షేక్స్పియర్ నాటకాల్లో వేషం వేసేవాడుట. ఆ తర్వాత చర్చి రీడింగ్స్ (Church Rcadings) లో ప్రత్యేక కృషి సలిపాడు. ఏమైనా అతను మాట్లాడుతున్నపుడు, స్టేజిమీద 'పోర్షన్' వొప్పజెబుతున్నట్లుంటుందేగాని మనతో సంభాషిస్తున్నట్లుండదు. క్వాఫ్ ఎప్పుడూ పుస్తకాలూ, నాటకాలూ, నటన, ఆ ప్రపంచంలో జీవించేవాడు.

మా చుట్టలషాపుకి వచ్చే విభిన్న వ్యక్తులలో పై నలుగురూ నమూనాలు మాత్రమే సుమండీ!

మా షాపుకి వీధిముంగిట ఒక 'నల్లమనిషి' నిలబడి వుండేవాడు. నిజంగా మనిషి అనుకుంటారేమో, మనిషి కాదు - చెక్క బొమ్మ! ఒకచెయ్యి చాపి నుల్చునివున్న ఆ 'నల్లమనిషి' చేతిలో ఒక చుట్టలకట్టవుండేది. రంగురంగుల యీకల్తో తయారుచేసిన ఒకటోపీ ధరించేవా డతను. అతను వేసుకున్నబట్టలు కొట్టొచ్చే రంగులోవుండేవి. ప్రతి వసంతకాలంలోనూ మా తాతయ్య కొత్త రంగులు వేసేవాడు ఆ బొమ్మకి. చాలా సంవత్సరాలు నేను మా తాతయ్యకి ఆ కార్యక్రమంలో ఎసిస్టెంటుగా పనిచేశాను. కొంచెం పెద్దయాక ఆ కార్యభారం పూర్తిగా నామీదనే పడింది.

చెక్కబొమ్మకి రంగుపూయడం ఏమంత కష్టం అనుకుంటారేమో! అల్లా అనుకోకండి. మొట్టమొదట వాతావరణం గురించి నమ్మకం కుదిరినమీదట, ఏవి రంగులు వెయ్యడమా అనే విషయమై ఒక నిశ్చయానికి రావాలి. ఫలానారంగు ఫలానందుకు

అని నిశ్చయించుకోడం చాలాకష్టం సుమండి. యీ ఏడు మా 'నల్లమనిషి' పసుపు పచ్చచొక్కా తొడుక్కునివుంటే, పై సంవత్స రానికది ఆకుపచ్చగానో నారింజగానో మారితీరాలి. చొక్కాకివలెనే లాగూరంగూ టోపీరంగూకూడా మార్చాలి. యీ మార్పుడ మనేది మనకి తేలికగా లభ్యమయేరంగులని బట్టివుంటుంది. 'నల్లమనిషి' టోపీకి మటుకు ధగధగలాడే రంగురంగుల యీకలు విధిగావుంటాయి. అవి ఎన్నివుంటే అంత అందం. లాగూచొక్కా టోపీ వీటిరంగు మారేదేగాని, ముఖమూ చేతిలోని చుట్టలకట్టా మటుకు నల్లటి కాయనలుపులోవుండేవి. బైట యీ చెక్కబొమ్మ కాపలా కాస్తూండగా, లోపల ఓ చిన్న నీగ్రోకుర్రాడు (నిజంగా కుర్రాడుకాదు, లోహపుబొమ్మ) కాతాదారులను నవ్వుతూ పలక రించేవాడు. ఆ లోహపుబొమ్మ నోటిలో ఎల్లవేళలా సిగరెట్టుఉండేది. ఆ సిగరెట్‌లోనుంచి 'గాస్ జెట్' (Gas Jet) వచ్చి, కాతాదారుచుట్టని వెలిగించేది.బొమ్మకి ఇరుపక్కలా రెండుపాత్రలు. ఒకదానిలో చిన్న చిన్న పేళ్ళూ (అగ్గిపుల్లలవంటివి), మరొకదానిలో యిసకాఉండేవి. చిన్న పేడుపుచ్చుకుని, బొమ్మ నోటిదగ్గిరవుంచితే, ఆ పేడుముక్క వెలిగేది. చుట్ట ముట్టించుకున్నాక ఆ పేడుని యిసకతొట్టెలో పడేసేవారు.

నీగ్రోబాయ్‌కి ఎదురుగా బల్లమీద, వివిధదేశాలనుంచివచ్చిన చుట్టల పాకెట్లువుండేవి. వీటికి వెనకగా ఏడెనిమిది నశ్యపుజాడీలు. ముక్కుపొడుంలో కూడా హాలెండు దానికీ, డెన్మార్కు దానికీ, ఐర్లెండు దానికీ, సరుకు విలువలోనూ ధరలోనూ తేడావుండేది. ఒక చిన్నత్రాసూ, చిన్నిచిన్ని కాయితపుసంచులూ నస్యపుజాడీలకి దగ్గిరగాఉండేవి. అదంతా ఒక ప్రపంచం లెద్దురూ!

తాతయ్యకి ఈ పొగాకు వ్యాపారం క్షుణ్ణంగాతెలుసు. దేని కెంతవిలవో చూసీచూడగానే చెప్పెయ్యగలిగేవాడు. ముఖ్యంగా నమిలేపొగాకుకి ఆ రోజుల్లో మంచి గిరాకీవుండేది. అయిదుసెంట్ల పాకెట్లూ పదిసెంట్ల పాకెట్లూ అని అమ్ముతూండేవాడు మా కొట్లో. అలా అని మా దెప్పుడూ సెంట్లమీద వ్యాపారమేనని అనుకోకండి. అప్పుడప్పుడు లెగ్జింగ్టన్ ఎవెన్యూనుంచి డాక్టర్ లాంబర్ట్ అనే ఆయనవచ్చి, ఒక్కొక్కటి రెండున్నర డాలర్లుచొప్పున విలువచేసే చుట్టలపెట్టెలు కొంటూండేవాడు.

వీటన్నిటితోపాటు మేము సిగరెట్లుకూడా షాపులోవుంచక తప్పిందికాదు. సిగరెట్లంటే మా తాతయ్యకి ఎంతకోపమో చెప్ప లేను. "ఈ సిగరెట్ పీకలొచ్చి పొగాకుక్కుండే గౌరవాన్ని పాడు చేశాయి" అనేవాడు. "ఎందుకూ కొరగాని సోమరిపోతులు కాల్చాలి ఆ సిగరెట్లు. గౌరవనీయు లెవరూ కాల్చరు!" మా తాతయ్య కంఠంలో, యీ సిగరెట్లు కాల్చే వారందరూ చివరికి నాశనమైపోతారు సుమా, అనే వార్నింగ్ వినిపించేది.

కాని, సిగరెట్ తయారీదారులు యిటువంటి కుండేళ్ళ బెదిరింపులకా జడిసేది? రంగురంగుల పోస్టర్లు అచ్చువేయించి, ప్రతి పొగాకు షాపులోనూ పెట్టించారు. సిగరెట్టు పెట్టెలలో ప్రఖ్యాత తారల అర్ధనగ్నచిత్రాలువుంచి, ఆ విధంగా యువకులని, తమవస్తువు చెలామణీ అయ్యేందుకుగాను, ఆకర్షించేవారు. ఈ అర్ధ నగ్నచిత్రాలు పోగుచెయ్యడం కొందరు యువకులకి వ్యాపకం అయిపోయింది. ఒకేబొమ్మ తమదగ్గిర రెండు కాపీలుంటే, ఒక

కాపీ అది లేనివారికిచ్చి, తమ దగ్గరలేని తారబొమ్మని పుచ్చు కుంటూండేవారు. ఒక ఏడాది తరువాత ఒక ఏడాది, నెమ్మది నెమ్మదిగా సిగరెట్లు బహుళ వ్యాప్తిలోకివచ్చాయి. నమిలేపొగాకూ, నస్యమూ వెనకపడిపోయాయి. స్త్రీలుకూడా సిగరెట్లు కాల్చడం మొదలుపెట్టారు. కాని ఎందుకనో, సిగరెట్లు నీతి బాహ్యమయిన వనే ధోరణిలోనే ఉండేది ప్రజాభిప్రాయం. విక్టోరియా (గుర్రపు షాట్లు)లో వెళ్తూ సిగరెట్ కాల్చిందన్న నేరానికిగాను, సెంట్రల్ పార్క్ దగ్గిర ఒకస్త్రీని అరెస్టుచేశారు కూడాను. ఎంత ప్రాకులాడినా సిగరెట్‌కి పాపం, గౌరవస్థానం లభించలేదు.

సరే - మా తాతయ్య చుట్టల షాపుదగ్గిరకువద్దాం. చుట్టల వ్యాపారంతోపాటు, దినపత్రికలకి ప్రకటనలు అందచెయ్యడం అను చిన్న 'సైడ్ బిజినెస్' కూడా ప్రారంభించాడు మా తాతయ్య, యిదేమంత కష్టమైన పనికాదు. కాసిని తెల్లకాయితం ముక్కలూ, నాలుగైదుకలాలూ, బ్లాటింగ్‌పేపరూ, ఒక సిరాబుడ్డీ వుంటేచాలు.

వ్యాపారం చిన్నదైనప్పటికీ, యిది మా జీవితాలలోకి నూతనోత్సాహం తీసుకొచ్చింది. మాకు 'ఎడ్వర్టయిజింగ్ ఏజెన్సీ' వుండటంవల్ల, చుట్టుపక్కల ఏమి జరుగుతున్నదీ, నిముషంలోకి తెలిసిపోయేది. ఎవరికైనా కొత్త వుద్యోగం కావలసివచ్చినా, ఎవరేనా పని మనిషికోసం బాధపడుతున్నా, ఎవరి యింట్లో నేనా పియానో అమ్మకానికున్నా, మొట్టమొదట మాకు తెలిసేది. తప్పి పోయిన కుర్రవాని గురించీ, పారిపోయిన కుక్కగురించీ, తస్కరింపబడ్డ గుర్రంగురించీ మా చెవులోపడ్డాకనే, లోకానికితెలిసేది.

మా తాతయ్య వొక్కటే రూలు పెట్టాడు. ఇటువంటి ప్రకటనలు యివ్వడానికి ఎవరేనావస్తే, వాళ్ళని ఏ ప్రశ్నలూ వెయ్యకుండా, వాళ్ళిచ్చే ప్రకటనా, అందుకయే పైకమూ చల్లగా పుచ్చుకోమని.

కొందరు తమ ప్రకటనలు తాము రాసుకొచ్చేవారు. మరి కొందరు తాతయ్యని రాసిపెట్టమనేవారు. ఇతరులకి సహాయం చెయ్యడమంటే, తాతయ్యకి మహసరదా. రెండు మూడు మాటలు తగ్గించి ప్రకటనకయ్యే మొత్తంలో, పావలో అర్థో తగ్గింపచూసే వాడు. తాతయ్య ఎప్పుడూ సన్నటిపాళీతో అక్షరాలు విడివిడిగా రాసేవాడు. కాని, ఎటొచ్చీ ఆ పాళీకాయితంమీద నడుస్తున్నపుడు బరబరలాడేది. సిరాబుడ్డిలో ముంచినపుడు, ఆపాళీ అడుగునున్న మడ్డి పైకితెచ్చేది. సిరామడ్డి అంటుకున్నపుడు తాతయ్య తక్షణం ఆ పాళీని తలకి రాసేసుకునేవాడు. తాతయ్య తెల్లటితల ఒక్కొక్క వారం సిరాతో నల్లబడేది. ఎంతమేర నల్లబడిందో ఆ నలుపుని బట్టి, ఆవారపు వ్యాపారం అంచనావేసేవారం అమ్మమ్మా నేనూను.

అనేకమంది అనేక సమస్యలతో మా దగ్గర కొచ్చేవారు. నాకూ మా తాతయ్యకీ మా పరిసరాల జరుగుతున్న సమస్తం, మేము ఎక్కడికీ కదలకుండానే తెలిసేది. ఒకసారి ఒక యువకుడు హడావుడిగా షాపులోకివచ్చి, తాతయ్యతో యిలా అన్నాడు. "నా భార్యచేసే అప్పులకి నేనెంతమాత్రం బాధ్యుణ్ణికాదు. ఆమె యిల్లు వదిలిపెట్టి వెళ్ళిపోయింది. పర్సనల్‌కింద రెండులైనుల్లో వెయ్యమనండి. ఆమెకోసం అంతకంటె ఎక్కువ ఖర్చుపెట్టడం కూడా దండగ."

పారిపోయిన భర్తలు, వదిలివేయబడ్డ భార్యలు, తప్పి పోయిన పిల్లలు, వితంతువులు - యిలా ఎన్ని ప్రకటనలు మా చేతులమీదుగా వెళ్ళాయో! వివిధజీవితాల్లోని విషాదఘట్టాలూ, వాతివారి కన్నీటబిందువులు మాకెంతో సన్నిహితంగా తెలుసు. ఆ క్షోభితుల ప్రతిమాటా ఎంతో శ్రద్ధగా ఆలకించేవాణ్ణి. వారి హృదయావేదన ద్వారా నేనెన్నో అపూర్వవిషయాలు తెలుసు కున్నాను. మా చుట్టలషాపు నా జీవితాని కొక విశ్వవిద్యాలయం. అక్కడే నేను విద్యా వినయములు నేర్చుకున్నాను. అదే నాపాలిట ఎకాడమీ. అక్కడికొచ్చిన సమస్తాన్నీ 'స్పాంజి'వలె స్వీకరించాను. పీడించేపుస్తకాలూ, బాధించే అధ్యాపకులూలేని కళాశాలద్వారా పట్టభద్రుడనయాను.

ప్రతిరోజూ రాత్రి ఎనిమిది గంటలకి ప్రకటనలూ వాటి తాలూకు పైకం ఒక కవర్లో పెట్టుకు, కోట్లూ హాట్లూ ధరించి, పొగాకుషాపు అమ్మమ్మకి అప్పజెప్పి నేనూ తాతయ్యావార్తావీధికి (Newspaper Row) బయలుదేరేవారం. ప్రయాణం చాలా బాగుండేది. మూడో ఎవెన్యూలోని ఒక వీధిదాట, అటునుంచి వుత్తరదిక్కుగా నడిచి, అక్కడ రెండు అంతస్తులు ఎక్కితే సరి, ఎలివేటెడ్‌స్టేషన్ కనిపించేది. నేను రెండేసిమెట్లు ఒక్కొక్క తఫా ఎక్కేవాడిని కాని, తాతయ్య ఒక్కొక్కమెట్టే పగరుస్తూ ఎక్కే వాడు. పైనున్న ఎత్తు 'ప్లాట్‌ఫారమ్' మీదకి స్టీముబండివచ్చేది.

తాతయ్య టికట్ కొనేందుకువెళ్లగా, నేను మెట్లఎగువని నిలబడేవాడిని. ఆ రోజుల్లో మా యిద్దరికీకలిపి ఒక్క టిక్కెట్టు చాలు. ఎందుచేత ననగా, అప్పట్లో ఏడేళ్లలోపు పిల్లలకి టికట్లు పుచ్చుకునేవారు కాదు. నాకు ఏడేళ్ళే అని బుకాయించ డానికి వీలైనంతకాలమూ, తాతయ్య నాకని వేరే టికట్టుకొనలేదు. ఆ తరువాత రెండు టికట్లుకొనే వాడనుకోండి. టికట్టుకొని తీసు కొచ్చాక, అది నాచేతికిచ్చేవాడు. నేనది దర్జాగా చేతబుచ్చుకొని, మేము రైలుదిగాక, టికట్లు పడవెయ్యవలసిన పెట్టెలో, పడేసే వాడిని. ఒక్కొక్క నాడు మేమువెళ్ళి వెళ్లగానే, రైలుపచ్చేసేది. ఒక్కొక్కపుడు కొంచెం అలస్యమయేది.

ఆ స్టీము యింజనూ, డబడబలాడె పెట్టెలూ యీ నాటి రైళ్లకి మల్లేవుండే వనుకున్నారా ? ఎబ్బే, అల్లాకాదు. యింజన్ కుండే రాగి బాయిలర్ ధగధగలాడేవి. చుట్టూతాపోలెడన్ని యిత్తడిగొట్టాలు కనిపించేవి. ఆ స్టీము యింజన్ని యింజనీరు నడుపుతూండేవాడు. అతనే యింజనీరూ ఫైర్‌మెనూ కూడా. ఒక్కొక్క స్టేషనులో ఆ యింజనీరు, ప్లాట్‌ఫారమ్ చివరినున్న రాకసిబొగ్గు రెండు మూడుబుట్టల పాళం పట్టుకెళ్లి, యింజనులోని ఫైర్‌బాక్స్‌లో పడేస్తూండేవాడు. ఆ పని చెయ్యడ మయ్యాక, యింజనుచేత యీలవేయించి, బండీని స్టార్ట్‌చేసేవాడు. ఆ యింజను, పాపం, పది పన్నెండు సారులుదగ్గి, రొప్పి, ఆ పైన వేగం అందుకునేది. మాకొట్టునుంచి వార్తావీధికి అరగంటప్రయాణం. యీ అరగంటలోనూ ఎంతటి సజీవప్రపంచం కనిపించేదో !

పట్నందిగువకి వస్తున్నపుడురైలు అనేక పేటలలో ఆగేది. యాభైమూడో వీధిలో అయిరిష్‌వారు ఎక్కేవారు. పధ్నాలుగోవీధిలో జర్మనులు. ఎనిమిదో వీధిలో హంగేరియన్‌లు. గ్రాంట్‌స్ట్రీటులో యూదులు. ఛాతమ్ చౌరస్తాలో చైనీయులూ, యిటాలియనులూ ఆ రైలులో ప్రయాణం చేస్తున్నపుడు వివిధభాషలు వినిపించేవి. రైలుపెట్టెలో కూచొని కిటికీగుండా చూస్తుంటే, రైలు బదీలకి పక్కగా లేచిన ఎత్తయిన యిళ్ళూ, ఆ యిళ్ళలో వారిజీవితం, మురికీ, యిరుకుగదుల్లోమనుషులు నిద్రపోవడం, అల్లరి చిల్లరగా పిల్లలు వీధుల్లో గెంతడం, దుమ్ముపట్టిన రబ్బరుచెట్లూ, కిటికీల్లోంచి తొంగిచూసే స్థూలకాయులైన స్త్రీలు – అదంతా ఒక మొరటు ప్రపంచం. ఆఖరికి 'బ్రూక్లిన్ బ్రిడ్జిస్టేషన్' జేరుకొనేవారం. వార్తాపత్రికల ఆఫీసులు అన్నీ ఆ స్టేషనుకి దగ్గిరే! రైలు దిగీదిగగానే నేనూ తాతయ్యా గబగబా న్యూస్‌పేపరు ఆఫీసుకి వెళ్లేవారం. వూళ్ళో జరిగినవి బైట జరుగుతున్నవీ తెలిపేందుకు వార్తాపత్రిక లొక్కటే ముఖ్యసాధనాలు అప్పుడు. ప్రతివాళ్లూ పేపరు చదివేవారు. అనేక రకాలైన పత్రికలు ప్రచురిత మవుతుండేవి. ఆనాడు వార్తా పత్రిక ప్రజల జీవనాడివంటిది. అటువంటి ఉత్కృష్టజగత్తులోకి నాకూ తాతయ్యకీ ప్రవేశార్హత లభించిందని నేనెంతో పొంగి పోతుండేవాడిని. మిగతా ప్రజలకి తెల్లవారితేగాని తెలియనివార్తలు మాకు రాత్రివేళకే తెలిసేవి.

తాతయ్య తన నిత్య వ్యవహారం చూసుకొనేందుకు ఆఫీసులోకి వెళ్తే నేను యీ గదులోంచి ఆ గదిలోకి, ఆ గదిలోంచి యీ గదిలోకీ, ప్రతిదీ ఎంతో ఆశగాచూస్తూ తిరిగేవాడిని. ఆ లోకమే

వేరు. కాని, ఎంచేతనో ప్రారంభం నుంచీ నాకు ఆ లోకంమీద ఎంతో యిష్టం.

నేను ఏగదిలోకివెళ్ళానన్నే ప్రమేయంలేదు. ప్రతిగదీ జీవనోద్వేగంతో బిలబిల్లాడేది. చుట్టపొగతోనిండిన గదిలో కోట్లు తీసేసుకు చొక్కాల్తో వున్నవారు, టేబుల్ముందు కూచుని, ఏవేవో గబగబా రాసేస్తూండేవారు. కొందరు టెలిగ్రాఫ్ యంత్రాల దగ్గిరా మరికొందరు టైపుమిషన్లదగ్గిరా పనిచేస్తుండేవారు. మరికొందరు, నల్లపెన్సిలుతో పతాకశీర్షికలు (Headlines) రాస్తూండేవారు. అన్నిటికంటే నాకా పెద్దక్షరాలు బాగుండేవి. అంచేత ఆ పెద్దక్షరాలు రాసేవారిని పెద్దవాళ్ళుగా మనసులో భావించేవాడిని. మిగతా వాళ్ళంపరూ వార్తాపత్రికలోని చిన్నక్షరాలు రాసేవాళ్ళు.

మరోరూమ్లో లినోటైపు యంత్రాలువుండేవి. సీసంముద్దలు ద్రావకంగా కరగడం, ఆ ద్రావకంనుంచి లినోటైపు యంత్రాల ద్వారా అక్షరాలు సమకూడటం, ఆ అద్భుతాన్ని చూసినకొద్దీ, ఇంకా చూడాలనిపించేది. అది నా కళ్ళకి మాజిక్లా కనిపించేది. యింకొకగదిలో 'స్టీరియో'లు వుండేవి. మేటరంతా స్టీరియో తియ్యబడి బ్రహ్మాండమయిన అచ్చుయంత్రాల్లోకి పంపబడేది. ఈ వుక్కురాక్షసులు పెద్దపెద్ద కాగితపు చుట్టలని స్వాహాచేసేస్తూ, ఆ తెల్లకాగితం మీద చక్కగా అక్షరాలు ముద్రించిమడిచి, కత్తిరించి, లెక్కబెట్టి, పేపరుకుర్రాళ్ళు అమ్ముకునేందుకు తయారుగా అంతా సిద్ధంచేసి బయటికి వెళ్ళగక్కేవి.

వార్తావీధి ఎల్లవేళలా నవజీవనంతో తొణికిస లాడేది. ఆ హడావుడీ, ఆ తొందరా నాకుతెలిసినంతలో ఎక్కడా కనపడేది కాదు. అసలక్కడ గాలేవేరు. ఆ గాలికి సీసపు మంటలూ, కర్పూర తైలం, కాయితం, చుట్టపొగా, వీటన్నిటితో కూడిన ప్రత్యేక పరిమళముండేది. నా చిన్నతనపుమనసులో అదొక ప్రత్యేకవాసనగా నిల్చిపోయింది. విద్యుచ్ఛక్తిలోని పరిమళమది కాబోలని భావించే వాడిని.

మేము నివశించేచోట కోల్‌గాస్ వుపయోగించేవారం. గాస్‌కి దానివాసనఅంటూ వేరేవుంది. ఇక్కడ యీవార్తాపత్రిక ఆఫీసుల్లో ఎలెక్ట్రిక్ దీపాలూ, టెలిగ్రాఫ్ పరికరాలూ వున్నాయి. అంచేత యీగాలికిగల పరిమళం విద్యుచ్ఛక్తిది అని నా చిన్నబుర్రలో నాటుకుపోయింది. అప్పటికింకా విద్యుచ్ఛక్తి మాకుకొత్త. విద్యుత్ పరికరాలు వున్నచోట జీవితమింత వేగంతో పరుగెత్తుంది కాబోలు అనుకునేవాడిని.

ప్రతిరోజూనన్నుచూస్తూవుండటంచేత, కొందరు నన్ను పల్కరించసాగారు. వారు నన్ను పెద్దచేసి పల్కరించేసరికి నాకెంతో ఆనందమయేది. పెద్దవాళ్ళు వారేమయినా అడిగితే సమాధానం చెప్పాలిగదా, చెప్పబోయేసరికి మాటలు తడబడేవి. చిన్నప్పటి నుంచీ నాకొంకంచెం నత్తి.

"ఏ అబ్బాయీ...ఎక్కడినుంచివచ్చావ్? బ్రూక్లిన్‌నుంచా?"

నేను చిరునవ్వు నవ్వేవాడిని. ఎందుకంటే, అదొక 'జోక్' అని నాకుతెలుసు. నన్ను చూసి నేను బ్రూక్లిన్ వాడినని ఎలా అనుకో

గలరూ? అందుచేత తమాషాకి అడుగుతున్నారని తెలుసుకు
"లేదుసార్ - పట్నంఎగువ (Uptown) నుంచి వచ్చాను."

"ఎగువ అనగా?"

"యాభై రెండో వీధి."

"ప్రతిరాత్రీ యిక్కడికి వస్తుంటావా?"

"అవును, సార్! మా తాతయ్యకి ఎడ్వర్టయిజ్‌మెంటు ఏజన్సీవుంది. ఆయనతో నేనూ వస్తూంటాను."

"నీ కెన్నేళ్ళు?"

"ఏడు."

"స్కూలుకెళ్తున్నావా ?"

"వెళ్తున్నాను, సార్, యాభై ఒకటో వీధిలో పద్దెనిమిదో నెంబరు పబ్లిక్ స్కూలుకి"

"నీకు స్కూలుకెళ్ళడం యిష్టమేనా?"

"అంతయిష్టం లేదు, సార్! అందుకనే నిరుడు నన్ను ఫెయిల్ చేశారు."

"స్కూల్లో ఏంనేర్చుకుంటున్నావ్?"

"అన్నీను. లెక్కలూ, స్పెల్లింగ్, జాగ్రఫీ, చూచివ్రాత."

"అన్నిటికంటే నీకేదిష్టం."

"చూచివ్రాత."

"ఏదీ, యీపెన్నుపుచ్చుకు, నీ పేరు రాయి, చూస్తాను."

నేను ఆయన చేతులోంచి పెన్నుపుచ్చుకు, పెద్దక్షరాలతో, నాపేరు రాశాను. ఆయన నేనురాసిన అక్షరాలవంక పరిశీలనగా

చూసి, "నీ మొదటిపేరు స్పానిష్ పేరులా వుంది. రెండోది రష్యన్ పేరులా వుంది. మీవాళ్ళుగాని స్పెయిన్ నుంచివచ్చారా?" అని అడిగాడు.

'లేదని' తల వూపాను.

"అయితే రష్యానుంచి వచ్చివుంటారు."

"అవును, సార్!"

"ఎంత కాలమయింది?"

"తెలియదు, సార్, మాముత్తాతా ముత్తవ్వ - తాతయ్యని వెంటపెట్టుకొచ్చారుట."

"మీముత్తాతా ముత్తవ్వా యింకా బ్రతికున్నారా?"

"మాముత్తవ్వ చనిపోయింది. కాని, ముత్తాత బతికేవున్నాడు.

"ఎక్కడున్నాడు?"

"హాస్పటల్‌లో వున్నాడు. ఆయనకెప్పుడూ జబ్బే. ఏదేనా ఆదివారమప్పుడు చూట్టానికి వెళ్తూంటాము."

"బాగా ముసలివాడన్నమాట?"

"అవును, సార్! ఆయన చాలా పెద్దవాడు. శాంతాక్లాజ్‌కి మల్లే తెల్లటిగడ్డం వుంటుంది. ఆయనదగ్గిర బంగారపు వాచీవుంది. ఆ వాచీకి ఒకగొలుసూ, తిప్పేందుకు ఒక 'కీ' కూడా వున్నాయి. ఆయనదగ్గిర ఓ పిస్టల్‌కూడావుంది, సార్. ఆడుకొనే పిష్టలుకాదు, నిజమైన పిస్టల్. ఎప్పుడూ తలకిందపెట్టుకుంటాడు. నేనువెళ్ళినపుడల్లా, ఆ పిస్టల్‌గురించి అడుగుతుంటాను. ఒక్కొక్కపుడు అది చూపిస్తూంటాడు. దానిలో గుళ్ళులేవు. మా ముత్తాత చాలా పెద్దవాడు. చేతులు పుట్టినే వొణుకుతాయి."

"మీ తాతయ్య నిన్ను తరుచూ యిక్కడికి తీసుకొస్తూం టాడా?"

"నేను ప్రతిరాత్రీ తాతయ్యవెంట వస్తూంటాను, సార్."

"మీ తాతయ్యకి నువ్వంటే యిష్టమన్నమాట."

"చాలా చాలా యిష్టం"

"అయితే నువ్వు మీ తాతయ్యా అమ్మమ్మ దగ్గిర వుంటు న్నావా?"

"అవును."

"మీ అమ్మా నాన్నా ఎక్కడున్నారు?"

"విడాకు లిచ్చుకు విడిపోయారు."

"మీ అమ్మను అప్పుడప్పుడు చూడవా?"

"చూడకేం, చూస్తాను. కానీ, ఆమె కెప్పుడూ తీరికవుండదు."

"ఏం జేస్తాం దేమిటి?"

"ఆవిడొక లాయర్! ఎప్పుడూ కోర్టులతో - కోర్టు వ్యవహా రాలతో మునిగితేలుతూ వుంటుంది."

"అలాగా - న్యూయార్కు స్టేటులో స్త్రీ న్యాయ వాదు లు ఎక్కువమంది లేరే!"

"అవును. బార్‌లోకి ఎడ్మిట్ అయిన స్త్రీలలో మా అమ్మ రెండవదట."

"మీ అమ్మ చాలా సమర్థురాలై వుండాలి."

"అవును, సార్. ఆమె ఫొటో ఆ మధ్య వార్తాపత్రిక లన్ని టిలో పడిందిగా!"

నేను పేరురాసిన కాయితం వంక ఆయన మరొకసారి పరి శీలనగా చూశాడు.

"అవును, జ్ఞాపకం వస్తోంది. ఆమె నిరుటి సంవత్సరమే న్యాయవాదివృత్తిలో ప్రవేశించింది కదూ! అవును, ఆమె ఫోటో పత్రికలన్నిటిలో పడింది."

"ఆవిడే, సార్" అన్నాను.

"అయితే మీ నాన్న ఎక్కడా?"

"ఆయనెక్కడో దూరంగా మరొక స్టేటులోవుంటున్నాడు. ఎప్పుడోగాని న్యూయార్క్ రాడు."

మా తాతయ్య యింతలో హాలులోకివచ్చాడు. ఆయన పని పూర్తిచేసుకువచ్చినట్లున్నాడు. నేను మాట్లాడుతున్నాయనకి గబ గబా గుడ్‌బైచెప్పి, తాతయ్యాదగ్గరకు చేరుకున్నాను.

"అక్కడేం చేస్తున్నావ్?" అని తాతయ్య అడిగాడు.

"ఆయనతో మాట్లాడుతున్నాను."

"ఆయ నెవరో తెలుసా?"

"తెలియదు."

"ఆయనపేరు మిస్టర్ స్టీవెన్సు. యీ పత్రిక ప్రధాన సంపాదకుల్లో ఒకడు."

స్టీవెన్సంతవాడు ఏడేళ్ళ కుర్రవానితో, అంతసేపు మాట్లా డటం, మా తాతయ్యాకి ఎంతో సంతోష కారణమయింది. ఆ కుర్ర వాడు తన మనుమడైనపుడు మరీ సంతోషం గదా!

ఆ సంవత్సరపు వసంతకాలంలో పడవ ఎక్కడమూ జనపదాలు చూడటమూ అన్నది మొట్టమొదటిసారిగా నా జీవితంలో

జరిగింది. నా చిన్న ప్రపంచం కొంచెం కొంచెంగా పెరుగుతోంది. మా ముత్తాత మరణంతో పడవ ప్రయాణం, జనపదదర్శనం సంభవమయాయి.

ముత్తాత చనిపోయాడు. ఉత్తరక్రియలు జరిపేందుకుగాను తాతయ్యా, అమ్మమ్మా, నేనూ మిగతా బంధువులూ అందరం బయలుదేరాము. నల్ల గుర్రంకట్టిన మొదటిబండీలో ముత్తాత 'శవపేటిక' వుంచారు. శవపేటిక వెనకనున్న బండీలో నేనూ, తాతయ్యా అమ్మమ్మా కూచున్నాము. మా వెనక మరోరెండు బళ్ళున్నాయి. వాటినిండా బంధువర్గం. థర్డ్ ఎవెన్యూనుంచి బయలుదేరిన యీ ప్రొసెషన్ (ఊరేగింపు) వొక్కొక్క పేటా, వొక్కొక్క మైలూ దాటుతూ వూరు చివరకుచేరుకుంది. అమ్మమ్మ దారి పొడుగునా ఏడుస్తూనేవుంది. కాని నాకుమాత్ర మీ ప్రయాణం బలే హుషారుగా వుంది.

గుర్రపుబండీలో కిటికీపక్కగా కూచుని, బయట కనిపించే దంతాచూసి ఆనందించసాగాను. అది వసంతకాలపు టుదయం. రోడ్లమీద చాలామంది మనుషులు యిటూఅటూ తిరుగుతున్నారు. స్త్రీలూ పురుషులూ బాట పక్కన నిలబడి, ఏవో మాట్లాడుకుంటు న్నారు. పిల్లలు కేరింతాలు కొడుతున్నారు. దారిలో చచ్చి పోయిన గుర్రాలు రెండు కనిపించాయి. వాటిని కసాయిగృహానికి తీసుకునిపోయేవాళ్ళు యింకా రాలేదు. మా బళ్ళు కొంతదూరం నడిచాక రోడ్డుపక్కగా, అంకెలువేసిన మైలురాళ్లు కనిపించాయి. బోస్టన్‌నగరం అక్కడికి ఎన్నిమైళ్ళో ఆ రాళ్లమీదరాసివుంది.

కాస్త పొద్దెక్కేక, సూర్యకిరణాల వెచ్చదనంతో వీధి వాస నలు వెనకపడ్డాయి. ఆ బండిలోకూచున్న నాకు, లోకమంతా ఒక పరిమళం తరువాత మరొక పరిమళంగా కనిపించసాగింది. 'ఓల్డుబ్రూయరీ' దాటి సిటీహాలుదాటి మాన్‌హట్టన్ దీవికి ఒక కొసనివున్న బవులింగ్‌గ్రీన్ అను ప్రదేశం చేరుకున్నాము. యిక్కడ మా బళ్లని 'ఫెర్రీ'లో ఎక్కించి రేవు అవతలగట్టుకి చేరవెయ్యాలి. నే నింతవరకూ అనేకపడవలూ, అనేకవోడలూ, తెరచాపలూ మొద లైనవి చూశానుగాని నీటిమీద ప్రయాణంచెయ్యడం అదే మొదటి సారి. బండిలోనించి దిగి బయటకొచ్చి, చుట్టూవున్న లోకమంతా చూడాలని నా తపన. తాతయ్య మంచివాడు కాబట్టి నన్ను దిగ నిచ్చి చెయ్యి పుచ్చుకుతీసుకెళ్ళి, ఆ యింజనూ, ఆ యింజనుపని చెయ్యడం, పెద్దపెద్దచక్రాలు నీటిని వెనక్కిచిమ్మడం, అవన్నీ చూపించాడు. ఆ నీటి బుడగలుచూస్తే 'సోడావాటరు' జ్ఞాపక మొచ్చింది. హార్బరు మాకు దూరంగా కనిపిస్తోంది. న్యూయార్క్ నగరాన్ని కాపాడే 'స్టాట్యూ ఆఫ్ లిబర్టీ' పొగమంచుపైనుంచి మమ్మల్ని పలకరిస్తోంది.

నీటిమీద తేలుతూ ప్రయాణంచెయ్యడం, నా వయసు బాల కునికి ఒక అపూర్వ అనుభవం. నేలమీద పొడిగాలికీ, నీటిమీది చల్లగాలికి గలతేడా అనుభవంమీదగాని ఎలా తెలుస్తుంది? అవ తల వడ్డుకు చేరుకున్నాక, మేము బళ్లలోకి ఎక్కి కూచోవాలంటే, నాకు దిగులేసింది.

మళ్ళీ రోడ్డుమీద కొచ్చాక, మా ఊరేగింపు సిల్వర్‌లేక్‌లోని 'సిమెటరీ' (శ్మశానం) వైపుగా ప్రయాణం సాగించింది. ఇక్కడి

రోడ్లు పట్నపురోడ్లవలె లేవు. గతుకులెక్కువ. గతుకుల్తోపాటు దుమ్ముకూడా ఎక్కువ. చెట్టూచేమా పొలం పుట్రాతోబాటు పస రికమేస్తూన్న ఆవులూ గుర్రాలూ కనపడ్డాయి. పూరపిచ్చుకలు గాక వేరే రకాలపక్షుల కిలకిలారవాలు వినడం, నాకు అదే మొదటిసారి.

మేము చేరుకున్న ప్రదేశాన్ని స్టేటన్‌దీవి (Staten Island) అంటారు. యిక్కడ రోడ్లు, నల్లరాయిపరిచినవీ కావు; రోడ్డు కిరు పక్కలా కాలిబాటలూలేవు. ఇళ్ళు న్యూయార్క్‌లోకివలె, వొకదాని మీదఒకటికాక దూరదూరంగావున్నాయి. ఇవి ఎర్ర యిటుకతో నిర్మించిన యిళ్ళుకావు - కలపతోకట్టినవి. అన్ని పట్టణాలూ న్యూయార్క్‌వలెనే వుంటాయనీ ప్రపంచమంతా యిట్లాటి పట్ట ణాలువుంటాయనీ, మధ్యమధ్య కొంత ఖాళీస్థలంవుంటుందనీ నా భావన. ఇటువంటి సువిశాలమైన గ్రామాలూ జనపదాలూ వుండగలవని నా కేనాడూ తట్టలేదు. ఈ స్టేటన్‌దీవి యావత్తూ విస్తృతమైన 'సెంట్రల్ పార్క్'వలె ఉంది.

మరొక మైలు ఆ రోడ్డుమీద ప్రయాణం చేసినమీదట, ప్రపంచంలో న్యూయార్కువంటి యిరుకు పట్టణాల్తోపాటు, యీ మాదిరి చక్కటి జనపదాలు (Country) కూడావుండటం ఎంతైనా అవసరం, అని నా చిన్న బుర్రకితోచింది.

సిల్వర్‌లేక్ సిమెటరీ చేరుకున్నాక, గుర్రపుబళ్లలోవున్న వాళ్లందరందిగి, ఒక చిన్నగొయ్యిచుట్టూ చేరాము. మా ముత్తాత

శవపేటికని ఆ గోతులోవుంచి పైన మన్నుకప్పారు. గొయ్యంటె చూడ్డానికి నాకు బాగూలేదుగాని, ముత్తాతని అక్కడ వుంచడం కంటే చెయ్యగలిగిందేముందని అనిపించింది. 'పుట్టినవారు గిట్టక మానరు' అని తాతయ్య ఏదో తత్వంచెప్పాడు. అందరు మనుషులూ చివరికి యిట్లానే అవుతారుట.

ముత్తాత శవపేటికను ఆ గోతిలో ప్రవేశపెడుతున్నపుడు మేమందరమూ శ్రద్ధాంజలిఘటిస్తూ వినమ్రులమై తలలొంచుకు సమాధిచుట్టూ నిలబడ్డాము. ఆ పని అయిపోయాక, ఏదో బరువు తీరినట్లయింది. చనిపోయినాయన దేవలోకానికి వెళ్ళిపోయాడు. బతికున్నవాళ్ళం, మళ్ళీ మనుషుల్లో పడ్డాం.

నేను ఆరోజు 'సిమెటరీ'లో కొత్తవి అనేకంచూశాను. నడిచి వెళ్ళేందుకు మెత్తగావుండే పసరికా, యిష్టమొచ్చినట్లు కొయ్యడానికి వీలయిన అడవిపువ్వులూ, ఒక ఫారమ్‌హౌసూ, వరలనుయ్యీ, ద్రాక్షతీగే మొదలైనవి కనిపించాయి. ప్రతిదీ చూపించి అదేమిటని తాతయ్యా నడిగేవాడిని; అన్నిటికంటే 'నుయ్యి' నా కెంతో బావుంది.

నూతి అంచున నిలబడి లోపలికిచూస్తే, నల్లని చీకటికనపడింది. ఆ చీకటికి దిగువన నీళ్లుంటాయుట. గిలకమీదనుంచి బక్కెట్‌వేసి, తాడు తిప్పితే బక్కెటుతో నీళ్లు పైకివస్తాయుట. చేద నీటిలో మునగగానే, యిక్కడ మనకి తెలుస్తుందిట. మొదటి బక్కెటు నీళ్ళు పైకివచ్చినపుడు, నా ఆనందం చెప్పతరంకాదు.

పైపుతిప్పుతే నీళ్ళు రావడమేగాని - యీ ప్రకారం భూమిలోనించి నీరువస్తుందని నాకు తెలుస్తేనా? ఆ నూతి నీళ్లు అమృతంలా వున్నాయి. బంధువు లందరికీ - మీరు తాగండి, మీరు తాగండి - అని గ్లాసులవారీగా యిచ్చాను. ఏమీలేదు - వాళ్ళు తాగడం అయిపోయాక, మళ్ళీ మరోచేద తోడవచ్చునుగదా అని సరదా! అలా ఆ రోజున ఎన్నిచేదల నీళ్లుతోడానో లెక్కలేదు.

గుర్రపుబగ్గీఎక్కి, మళ్ళీ యింటివైపుగా ప్రయాణమవుతున్నామని వినేసరికి, నాకు దిగులుపుట్టుకొచ్చింది. యీ 'స్టేటన్ అయిలాండ్'లో వుండిపోతే ఎంత బాగుంటుందో - అని అనిపించింది. మళ్ళీ ఫెర్రీదాటి అస్తమిస్తున్న సూర్యకాంతిలో న్యూయార్క్ నగరదృశ్యాన్నిచూసి, యింటికి వచ్చేస్తున్నాము. నేను వుండవల్సింది న్యూయార్క్‌లో, జనపదాలలో చీకటిపడ్డాక వుండటం మంచిదికాదు, అర్ధరాత్రివేళకూడా పట్నంలో ధైర్యంగా వుంటుంది - అని నాకు నేను సమాధానం చెప్పుకున్నాను; ఎప్పుడూ పట్నంలోవుంటూ, అప్పుడప్పుడు యీపల్లె ప్రాంతాలకి వస్తే బాగుంటుంది!

నా మనోభావాలు అమ్మమ్మకీ తాతయ్యకీ చెప్పేసరికి, 'అదే రైటు' అన్నారు. మేము నెమ్మది నెమ్మదిగా ఇల్లు చేరుకునేప్పటికి చీకటిపడింది.

ఆ తరువాత ప్రతి వసంతకాలంలోనూ అమ్మమ్మా నేనూ స్టేటన్‌దీవికి 'పిక్‌నిక్'గా వెళ్తూండేవారం. యీ పిక్నిక్‌కి వెళ్తున్న

పుడు ప్రత్యేకబళ్లలో కాక మామూలు స్ట్రీట్ కార్లలో ప్రయాణం చేసి, అందరితోపాటు వెళ్ళేవారం. పొద్దుట బయలుదేరుతున్నపుడు కేకులూ పళ్ళూ తినడానికీ, అక్కడ నాటేందుకుగాను పూల విత్తనాలూపుచ్చుకు బయలుదేరేది అమ్మమ్మ.

ప్రతి సంవత్సరం మేమక్కడ రకరకాలైన మొక్కలు నాటేవారం. కొన్ని పువ్వులుపూసి పుష్పించేవి; కొన్ని ఏపుగా ఎదిగేవి. అమ్మమ్మ ప్రతిసారీ యింకా యిక్కడ పదకొండుగురికి స్థలంవుంది అనేది. అంటే ఏమిటో నా కంతగా తెలిసేదికాదు.

ఆ మొదటి సంవత్సరాలలో అమ్మమ్మా నేనూ కష్టపడి కుదుళ్ళు తవ్వేవాళ్లం. ఆ మన్నూ, ఆ మట్టివాసనా ఎంతో పరిమళభరితంగావుండేవి. మాచేతనయినట్లుగా మొక్కలువేసేవారం. నాకు తెలిసినదీ, నేను పెంచినదీ అదొక్కటే పూలతోట.

నా చిన్నతనం ప్రశాంతదశలో గడిచిందని చెప్పవచ్చు. ఎంచేతనంటే, అప్పటికి సివిల్ వార్ అయిపోయి ముప్పైసంవత్సరాలు గడిచింది. సివిల్ వార్ కాలంనాటి యుద్ధపుగాయాలన్నీ మానుబట్టి, మనుషులుకోలుకుని, మళ్ళీ యథాప్రకార శాంతియుతజీవనానికి అలవాటుపడ్డారు. ఎప్పుడూ యిలా ప్రశాంతంగానేవుంటుంది గాని, మరొకవిధంగా వుండగలదనుకునేందుకు నాకు అవకాశం కనబడలేదు.

నేను 1890 లో జన్మించాను. 98 నాటికి ఎనిమిదేళ్లవాడిని. అప్పుడు దూరాన, ఏ ప్రాంతాన్నో జరిగిన ఒక సంఘటనవల్ల, న్యూయార్కులోని మా అందరి జీవితాలూ తలకిందయినాయి. ఆసంఘటన, ఆఖరికి మా పిల్లల మనోదృక్పథాన్నికూడా పూర్తిగా మార్చేసింది.

1898 ఫిబ్రవరి 15 వ తేదీన అమెరికాయుద్ధనౌక 'మైనీ'ని (Maine) క్యూబాదీవిలోని హవానా హార్బరులో ఫిరంగులతో కాల్చి ముంచేశారని వార్తలొచ్చాయి. యీవిషయం వినీవినగానే న్యూయార్కునగరం అట్టుడికినట్లు వుడికిపోయింది. పత్రికలమ్మే కుర్రవాళ్ళు అదేపనిగా వార్తాపత్రికలు అమ్ముతున్నారు. పెద్దపెద్ద అక్షరాల్తో పత్రికల్లోని పతాకశీర్షికలు భయోత్పాతం గొలుపుతున్నాయి. ప్రతిఒక్కరూ ఆశ్చర్యపోయారు. "ఎవరో శత్రువు అన్నిటికీతెగించి మాయుద్ధనౌకను ముంచేశాడన్నమాట" అనుకున్నారు అమెరికనులందరూ. మనదేశపు యుద్ధనౌకను మరొక దేశం ముంచేసిందంటే యుద్ధానికి ఆహ్వానమేకదా ! ఎవరినోట విన్నా 'యుద్ధం - యుద్ధం' అను పలుకులే.

మా చుట్టలకొట్లో కొచ్చేవారందరూ, యీ విషమించిన పరిస్థితులు - దారుణపరిణామాలకి దారితీయగలవని ఏకాభిప్రాయాన్ని వెలుబుచ్చేవారు.

"ఇది తడిగుడ్డల్తో గొంతుకొయ్యడంలావుంది. యుద్ధంకోసం ఆ స్పెయిన్‌వాళ్ళు కాసుకునివుంటే, మనవాళ్ళేనా తక్కువతిన్నది!

బాగా బుద్ధిచెపుతారు,” అని అంది మిసెస్ లియరీ, మరికొంచెం ముక్కుపొడుం ఘాటుగా పీలుస్తూ.

“ఈ నాడు అమెరికాఅంటే మాటలా? ఏడుకోట్ల యాభై లక్షలమందివున్నారు. మనిషిబలమే కాకుండా మనకున్న యంత్ర బలం అపారమైనది. ముందువెనకలు చూసుకోకుండా వాళ్ళు అనవసరంగా కయ్యానికి కాలు దువ్వుతున్నారు” అన్నాడు తాతయ్య.

మా షాపుకొచ్చే పోలీసుజవాన్లూ, ఫైర్ మెనూ, మిగతా కాతాదార్లూ అందరూ ‘స్పెయిన్ తెలివి తక్కువపనిచేసింది’ అన్నారు.

ఈ గందరగోళంలో నాకు అర్థంగాని విషయమొక్కటే. యుద్ధం వస్తోందని సంతోషించడానికి బదులు, పెద్దవాళ్లందరూ అకారణంగా ఖంగారుపడట మెందుకో నాకు తెలియలేదు. నేను పుట్టినప్పటినుంచీ యిప్పటిదాకా, యుద్ధమనేది ఎలావుంటుందో చూసిఎరగను. యుద్ధమన్నదివుంటేనే గొప్పపనులు చెయ్యడానికీ, కీర్తి సంపాయించడానికీ అవకాశమేర్పడుతుందని నావుద్దేశం. యిల్లంటుకున్నపుడు ఫైర్‌యింజన్ల వెంట పరుగెత్తడం, ప్రమాదాలు జరిగినచోట నేనుకూడా హాజరవడం - వాటితో యుద్ధం కూడ యిదేమాదిరిగా యింకొంచెం పెద్దతరహాలో జరుగుతుందనే భావనఏర్పడింది. యుద్ధ ప్రారంభంకోసం ఎంతో ఆదుర్దాగా ఎదురుచూసిన మనుష్యుల్లో నే నొకణ్ణి. ఆ రోజు మధ్యాహ్నమే నేను నిశ్చయం చేసుకున్నాను - యీ యుద్ధ నిర్వహణలో తగు పాత్ర వహించాలని.

ఆ రోజు రాత్రి తాతయ్యా నేనూ, ప్రతినిత్యంకంటే కొంచెం ముందుగా బయలుదేరాము వార్తా వీధికి. తాజావార్తలు తెలుసుకోవాలని, యిద్దరికీ తొందరే!

మేము వార్తావీధి ప్రవేశించేసరికి పరిస్థితులన్నీ కొత్తగా వున్నాయి. ప్రతి పత్రికాఫీసు ముందూ పెద్దపెద్దబోర్డులు వేలాడదీశారు. ఆఫీసుబయట గుంపులు గుంపులుగా మనుషులు నిలబడివున్నారు. 'స్పెషల్ ఎడిషన్' బయటకిరాగానే పట్నంలోని నలుమూలలకీ ఆ పత్రికకాపీలు జేరవేసేందుకు బళ్ళు వరసన నిలబడ్డాయి. ఇక, ఆఫీసులోపలి సంగతిచెప్పనే అక్కర్లేదు. ఏ వొక్కరూ నడవడంలేదు. అందరూ పరుగులెత్తుతున్నారు. టెలిగ్రాఫిక్‌గదుల్లోని యంత్రాలు అనుక్షణం టకటకమంటున్నాయి. పేపర్లబొత్తులు పుచ్చుకుని ఆఫీసు కుర్రాళ్ళు ఒక గదిలోంచి మరొకగదిలోకి వాయువేగాన వురుకుతున్నారు. నేను నెమ్మదిగా 'ఆస్కార్' అనే ఒక తెలిసినాయన దగ్గిరజేరి, అయనని చెవులో అడిగాను. "నిజమేనా?" అని

"అవునురా, అబ్బాయ్! వాళ్ళు మన యుద్ధనౌకని ముంచేశారు."

"అయితే, యిక యుద్ధమన్న మాటేగా?"

"ఘంటాపథంగా చెప్పవచ్చు. యుద్ధమే - సంశయంలేదు. రానున్న యుద్ధాన్ని ఎవరూ ఆపలేరు" అన్నాడు ఆస్కార్.

నేను అంతవరకే తెలుసుకోదల్చుకున్నాను. టెలిగ్రాఫ్ యంత్రం దగ్గిరపనిచేసే అస్కారే యుద్ధం ఖచ్చితంగా వస్తుందని అన్నమీదట అందులో సందేహమేముంది? నిశ్చయంగా యుద్ధమే!

ఎందుకైనా మంచిదని మిస్టర్‌స్టీవెన్సువుండే గదిలోకి వెళ్ళాను. ఆయన టేబుల్ దగ్గిరకూచుని గబగబా రాసుకుంటు న్నాడు. నేనక్కడికిరావడం కూడా ఆయన గమనించలేదు. ఆ ఆఫీసులో ఆరోజున ఒకచోటనుంచి మరోచోటకి వెర్రిగా పరుగెత్తా రంటే నమ్మండి. ఒక కుర్రవాడు ప్రతిటేబుల్ దగ్గిరకీవచ్చి, వెచ్చటికాఫీ అడిగినప్పుడల్లా అందిస్తున్నాడు.

ఆరోజు చాలా పెద్దఅక్షరాలు, బాగా నల్లగావుండే సిరాతో, మొదటిపేజీలమీద ముద్రించారు. ప్రత్యేక సంచికలు గంట గంటకీ వెలువడుతూండేవి. పత్రికలమ్మే కుర్రవాళ్ళు 'యింకా కాపీలుకావాలి. యింకా కాపీలుకావాలి' అని ఒకటేగొడవ. ఆ రోజున మా అందాలదీవిలో ఏ మూలచూసినా ఒక్కటే కేకవిన పడింది. "ప్రత్యేకసంచిక, ప్రత్యేకసంచిక. మెయినీ యుద్ధనౌక మునిగిపోవడం. యుద్ధం, యుద్ధం. రెండువందల యాభైమంది మరణం. ప్రత్యేకసంచిక, ప్రత్యేకసంచిక" - గంటగంటకీ వెలువడ్డ ఆ ప్రత్యేకసంచికలు నిముషాలమీద అమ్ముడైపోయేవి.

తాతయ్యా నేనూ ఒక ఆఫీసు తరువాత ఒకఆఫీసు ప్రకారం, అన్ని ఆఫీసులకీవెళ్ళాం. మరొక ఆఫీసులో అస్కార్‌కి

మళ్లీనే తెలిసినాయన దగ్గిరకెళ్ళి "ఏమిటీ యుద్ధం మాట - నిజ మేనా?" అని అడిగాడీ అష్టవర్షబాలకుడు.

"లేదబ్బాయ్! యిదంతా యుద్ధమేఘం. అన్నిమేఘాలూ వర్షించవు" అన్నా డతను.

నాకెంతో నిరుత్సాహంకలిగింది. ఆరాత్రి రైల్లో యింటి కొస్తున్నపుడు తాతయ్యా నడిగాను: "ఏం తాతయ్యా, యింకా యుద్ధం ప్రారంభం కాలేదా?"

"లేదు. యింకా ప్రారంభంకాలేదు. స్పెయిన్‌తో యుద్ధం రాగల సూచనలు కనపడుతున్నాయి. యుద్ధాన్ని ఆపలే మేమో కూడా. మన ప్రెసిడెంటూ, కాంగ్రెస్‌సభా ఏ ప్రకారం నిర్ణయిస్తే ఆ ప్రకారం జరుగుతుంది. ప్రెసిడెంటుపూనుకుని, యుద్ధప్రమా దాన్ని నివారించవచ్చుకూడా. ఏమైనా యిప్పట్లో చెప్పలేం. కొన్నాళ్ళు ఆగి చూడాలి" అన్నాడు తాతయ్యా ఏదో దిగులుగా మొహంపెట్టి.

నాకిదేమీ నచ్చలేదు. యుద్ధమొస్తే ఎంత బాగుంటుంది? దిగులుపడ్డందేనికో! టెలిగ్రాఫ్ యంత్రంమీద నిరంతరం వేళ్ళు వుంచి, లోకవార్తలు తెలుసుకునే ఆస్కార్‌చెప్పిందే, రైటయి వుంటుంది. నేను నిజంగా అదృష్టవంతుణ్ణి. ఆవిరియంత్రాలూ, అగ్నిమాపకదళాలూగల అందాలదీవిలో జన్మించడమే కాకుండా, ఒక యుద్ధాన్ని చూడబోతున్నాను. యిది వుత్తిత్తి యుద్ధంకాదు.

నిజమైనయుద్ధం, స్పెయిన్‌దేశంతో యుద్ధం. నేను యుద్ధభూమి లోకివెళ్ళి, శత్రువులని చావాచితకా తన్ని, వోడించి మరీ యింటికొస్తాను. మా తాతయ్యే యుద్ధానికి వెళ్లక్కర్లేదు. ఆయన ఎలావెళ్తాడూ, ఆయన పెద్దవాడు. ఆయనవెళ్తే మా చుట్టలషాపు మాటేమిటి, మా ఖాతాదార్లు ఏమవుతారు - యీ ప్రకటనలూ అవీ ఎవరుచూస్తారు?

ఆలోచించిన కొద్దీ యుద్ధభూమికివెళ్లగల అనుభవం నాకు వున్నట్లుతోచింది. మా పట్నంలోని అన్నివీధులూ నాకుతెలుసు. అల్లరి మూకలనుంచి తప్పించుకోడం నాకుతెలుసు. నేనురాసే వాక్యాల్లో స్పెల్లింగ్ తప్పులు అప్పుడప్పుడువున్నా - మాట్లాడే టప్పుడు నత్తివల్ల తడబడ్డా, నాది ముత్యాలకోవవంటి దస్తూరీ! పెద్దపెద్దకూడికలూ తీసివేతలూ చెయ్యగలను; హెచ్చువేతల్లోకూడా ఎప్పుడోగాని తప్పులురావు. ఇక నానత్తి విషయమంటారా? అంత బ్రహ్మాండమయిన యుద్ధంలో నత్తి యింకా వుంటుందంటారా? యిట్టే ఎగిరిపోతుంది. ప్రతిసేనలోనూ చిన్నచిన్నపనులు చేసి పెట్టే కుర్రాళ్ళు, ఎంతేనా అవసరమవుతారు. అమెరికన్ సివిల్ వార్‌లో నావయసు పిల్లలే 'డ్రమ్మరుబాయిస్'గా పనిచేశారుట. వాళ్లుచెయ్యగా లేనిది, నే నెందుకు చెయ్యలేను? బాండ్‌మోగిం చడం ఏమంత కష్టమైన పని.

మర్నాడు సాయంత్రం స్కూలునుంచి యింటికివెళ్లడం ఆలస్యమయింది. ఇంటికివెళ్ళగానే అన్నాను: "ఇవ్వాళ ఎందుకు ఆలస్యమయిందోతెలుసా? మార్చింగ్" అన్నాను గర్వంగా.

"మార్చింగా?" అని ఆశ్చర్యపోతూ అడిగాడు తాతయ్య.

"అవును, మాస్కూలు ఆవరణలో మార్చింగ్ ప్రారంభించాము. మేమందరమూ 'కాడెట్సు'మి. నేను చిన్నవాడినని మొదట నన్ను వాళ్ళు చేరనివ్వలేదు. టామీకంటే, బాబీకంటే నేను పొడవని వాదించాను. వాళ్ళు కాదన్నారు. ముగ్గుర్నీ వరసన నిలబెట్టి చూడమన్నాను. నేనే కొంచెంపొడవు. కాడెట్స్ అందరూ నుల్చుంటే వాళ్లవరసలో నేను మూడవ వాడిగావచ్చాను."

"అయితే నిన్నుకూడా 'మార్చ్' చెయ్యనిచ్చారా?"

"లేదు. చెయ్యనివ్వలేదు. నాకు యూనిఫారమ్ లేదు కాబట్టి, యీ బట్టల్తో కంపెనీలో (దళం)వుంటే, మొత్తంకంపెనీ అందంచెడిపోతుంది అన్నారు. అది నిజమేగాని, దళం అందం చెడ్డా, మీసరసనికాకపోయినా, మీ వెంటనేనా మార్చిచేస్తానన్నాను. లెఫ్ట్ రైట్, ఫార్వర్డ్‌మార్చ్, హాల్టు యిలాటివన్నీ నేనూ చేశాను."

"నువ్వింకా చాలా చిన్నవాడివి" అంది అమ్మమ్మ.

"కాడెట్‌గా జేరేందుకు నీకు వయస్సులేనిదే!" అన్నాడు తాతయ్య.

"అవతల యుద్ధం ముంచుకొస్తుంటే వయసూ గియసూ ఏమిటి ? యుద్ధానికి పిన్నా పెద్దా అనుతేడావుందా ? జేబులోంచి

కాయితంతీసి, తాతయ్యకి యిచ్చాను. "కూపర్ మార్కెట్‌లోవున్న బ్రౌనింగ్ కంపెనీలో మా కాడెట్లకి పనికొచ్చే యూనిఫారమ్‌లు తయారుచేసి అమ్ముతారు. నా కొకటి తెప్పించిపెట్టు."

తాతయ్య చీటీ చేతపుచ్చుకుని, "చిన్నపిల్లలకి అక్కడ యూనిఫారమ్‌లు వుండవే" అన్నాడు.

"వుంటాయి. మా స్కూలుపిల్లలు తెచ్చుకున్నారు. టామీ కంటె బాబీకంటే నేను పెద్దవాడిని. వాళ్లకిదొరికినప్పుడు నా కెందుకు దొరకవ్?"

"సరే" అన్నాడు తాతయ్య.

"రేపు నేను స్కూలునించి తొందరగావస్తాను. కూపర్ మార్కెట్‌కివెళ్ళి యూనిఫారమ్ కొనుక్కుందాం. 'పి. యస్. పద్దెనిమిది కాడెట్స్' అంటే వాళ్లకి తెలుస్తుంది. ధగధగలాడే బొత్తాములతో నీలంకోటూ, తెల్లచారగల నీలంపట్లాం, బ్రౌన్ కలర్‌లో టోపీ - యివన్నీ వాళ్లకితెలుసు, తాతయ్యా! ఏమైనా నేనుకూడా వెంటవుంటాగా."

ఆ విధంగా నేను హవానా హార్బరులో మెయినీ యుద్ధనౌక మునిగిపోయిన మొదటివారంలోనే 'కాడెట్ కోరు'లో చేరిపోయాను.

ప్రతిరోజూ మధ్యాహ్నం మూడుగంటలకి స్కూలుపాఠాలు అయిపోయాక కాడెట్‌లందరూ సమావేశమై మార్చింగ్ ప్రారంభించేవారు.

వాతావరణం బాగావుంటే ఆటస్థలంలోనూ, లేకపోతే స్కూలు వరండాలలోనూ మా 'మార్చింగ్' జరుగుతూండేది. మొట్టమొదట మాకంపెనీలో పధ్నాలుగురే వుండేవారు. వార్తాపత్రికలు యుద్ధానికి సంబంధించిన అట్టహాసం ఎక్కువచేస్తున్న కొద్దీ, మా బలం యిరవైరెండుదాకా పెరిగింది. మా స్కూలు ఆటస్థలమూ, అక్కడి వరండాలూ చూసిచూసి విసుగెత్తేదాకా అక్కడ మార్చింగ్‌చేసి, యింక అది భరించలేక, మరొక సువిశాలమైన ప్రదేశంలో, కవాతుప్రదర్శన ప్రారంభించడానికి సమయం వచ్చిందని, మాలో మేము నిశ్చయించుకున్నాము. ఎంచేతనంటే, మా స్కూల్లోని గోడలూ తలుపులూ ఎక్కడికక్కడ అడ్డంవచ్చి, కవాతుప్రదర్శనని అందంగా సాగనియ్యక యిబ్బంది పెడుతూండేవి. 'మార్చ్' అని రెండడుగులు వేశేవాళ్లమో లేదొ 'హాల్ట్' అని ఆగి, ఎబౌటుఫేస్ (About Face), అని వెనక్కి తిరగవలసి వచ్చేది.

మా కెప్టెన్‌పేరు రీన్‌హార్టు (Reinhardt). అతనికొక తోలు పటకా కత్తికూడావుండేవి. అతను మాకు నాయకుడు. ఆ నాయ

కుని ఆజ్ఞలు పాలించడానికి, మేము ఎల్లవేళలా సంసిద్ధులం. ఒక రోజు మధ్యాహ్నం మా నాయకుడు మా దండునంతటినీ, ఏభై ఒకటో వీధిలోకి తీసుకెళ్ళాడు. మా స్కూలు ఆవరణకంటే యిక్కడ మార్చ్‌చెయ్యడం మా అందరికీ సంతోషంగావుంది. కాని మా సంతోషం కొద్ది నిముషాలేదక్కింది. వీధినిండా గుర్రపుబళ్ళు పోగవడంతో బారులుతీర్చినడిచే మా ప్రదర్శనకి అటంకం కలిగింది. యిది పనికాదనుకొని మా కెప్టెన్ - మమ్మల్ని పార్క్ ఎవెన్యూవైపుగా నడిపించాడు. పార్క్ ఎవెన్యూలో కావలసినంత స్థలంవుంది. కానీ అక్కడ పియానోకంపెనీలమోత, రైలు యింజనుల కూతలూ భరింపరానివిగావున్నాయి. ఆ శబ్దాలు ఎంత తీవ్రమంటే, మా కెప్టన్‌యిచ్చే ఆజ్ఞలు మాకు వినిపించేవికాదు. పార్క్ ఎవెన్యూలో రౌడీలుంటారని మా పెద్దవాళ్ళు అంటూండేవారు. కాని మాది యిరవై యిద్దరితోకూడిన సేన కాబట్టి అటువంటి కబుర్లేవీ మమ్మల్ని భయపెట్టలేకపోయాయి. సివిల్‌వార్ నడిపించిన మహానాయకులులా మేము లెఫ్ట్ - రైట్ అనుకుంటూ ప్రదర్శన చేయసాగాము.

మొదటిరోజు చలి తీరాక, యింక ప్రతిదినమూ మా కెప్టెన్ మమ్మల్ని పియానో ఫాక్టరీవైపుగానే నడిపిస్తూండేవాడు. ఈ ప్రదేశమంతా మా ప్రదర్శనకి కొత్త స్థలంగా చేకూరింది. ఇలావుండగా కెప్టెన్ రీన్‌హర్టు ఎప్పుడూ మనకుతెలిసినచోటే వుండిపోడమేమిటి? - యిక, 'ఫారెన్ టెరిటరీ'లో ప్రవేశించవలసిన టైము వచ్చింది అని అనుకుని, మమ్మల్ని పియానో ఫాక్టరీనుంచి కర్రవంతెన వైపుగా నడిపించాడు. ఆ కర్రవంతెన మధ్యకివచ్చి

బారులు తీర్చి నిలబడ్డాం. వంతెన కిందనుంచి రైళ్లువెడతాయి. మే మక్కడ నిల్చునివుండగా ఒక రైలింజను ఆవిరినీ పొగనీ విరజిమ్ముతూ వొంతెన కిందనుంచివెళ్ళింది. తత్ఫలితంగా మా కంపెనీ అంతా నల్లటిపొగలో యిరుక్కుంది.

కత్తి పైకితీస్తూ మా కెప్టెన్ "హాల్ట్" అన్నాడు. ఆ పొగలో మాకు అతనిమాటలు వినిపించాయేగాని, మొహం కనిపించలేదు.

అతని అజ్ఞప్రకారం, మేము తక్కున ఆగిపోయాము. మాకు తెలిసిన ప్రపంచం ఏదో అంత్యదశకివచ్చినట్లు అయింది.

"ఎక్కడి వాళ్లక్కడ భద్రంగా నిలబడండి" అని రీన్‌హార్టు బిగ్గరగా అరిచాడు.

అతను కనపడ్డంలేదు. కాని కంఠం వినిపిస్తోంది. నాయకుని కంఠం వినిపించడం, మా సైనికులందరికీ నూతన ధైర్యాన్ని సమకూర్చింది. కాసేపు అయాక పొగా ఆవిరీ గాలిలో కలసి పోయాయి. వంతెనమధ్య యిరవై యిద్దరు వీరపుంగవులు యుద్ధం వల్ల నల్లబడ్డ దుస్తులతో నిలబడివున్నారు.

ఇప్పటికి మాకు యుద్ధమంటూ ఒకటి కనబడింది. కెప్టెన్ రీన్‌హార్టూ అతని ముఖ్యవుద్యోగులు యిద్దరూ, వంతెన అంచుకి వెళ్ళి, వుత్తరాన్నించిగాని, దక్షిణాన్నించిగాని ఏవైనా రైళ్లువస్తున్నా యేమో చూశారు. చాలాసేపు కళ్ళు కాయలు కాసేటట్లు చూసిన

మీదట, ఒకరైలు కనబడింది. తక్షణం మేము వంతెన మధ్య లోని మా స్వస్థానాలు దగ్గిర నిలబడి, శత్రువుతాకిడిని ఎదుర్కొ నేందుకు సర్వసంసిద్ధుల మయేము.

పటకాలోంచి కత్తితీస్తూ "అదిగోవస్తోంది. సైనికులారా, సిద్ధముకండు. మీమీ స్థానములలో ధైర్యముగా నిలబడుడు" అని బిగ్గరగా అరిచేవాడు కెప్టెన్ రీన్‌హార్టు. సుశిక్షితులమైన సైనికులం కాబట్టి, ఆజ్ఞవిన్న తడవుగా మామా స్థానాల్లో నుల్చునేవారం. పెద్ద చప్పుడుచేసుకుంటూ, వంతెనని దూరంనుంచే కుదిపేస్తూ, బ్రహ్మ రాక్షసిలావచ్చేది యింజను. ఆ యింజను వంతెన అడుక్కివెళ్లడ మేమిటీ, ఆవిరీ పొగా మా చుట్టూ ఆవరించడమేమిటీ, - ఒకే నిముషాన జరిగేవి. ఆ పొగలో మేము ధైర్యంగా నిలబడి, పొగ గాలిలో కలిసిపోయాక అందరం ఒకరితో ఒకరం మా ధైర్య సాహసాల గురించి చెప్పుకుంటూ, మళ్ళీ యింజను రావడంకోసం ఎదురుచూసేవారము.

ఆ సాయింత్రం నేను యింటికెళ్ళగానే, తాతయ్య నన్ను చూసి "ఏమిటి, నీమొహం అలా మసిబొగ్గులా వుంది. ఎక్కడి కెళ్ళావ్?" అని అడిగాడు.

"యుద్ధానికి తర్ఫీదు (Batlle Practice)" అన్నాను.

స్కూలు ఆవరణనుంచి పార్కుఎవెన్యూ, పార్కుఎవెన్యూ నుంచి కర్రవంతెనా, కర్ర వంతెనమీద శత్రువుతో పోరాడటం,

యివన్నీకూడా కొన్నాళ్ళయేసరికి విసుగనిపించేవి. తన సైనికుల లోని అశాంతిని గమనించిన కెప్టన్, వీరవిహారార్థం నూతన ప్రదేశాలు ఏమిటా అని ఆలోచించసాగాడు. ఒక రోజున మమ్మల్ని కర్రవంతెన నుంచి కమ్మరి కొలుములదాకా తీసుకెళ్ళాడు. ఆ కొలుముల్లో ఎర్రటి యినుముని, వాళ్ళు నాడాలుగా (గుర్రాలకి) చెయ్యడం చూసేవారం. ఆ నాడాలు చేస్తున్నపుడొచ్చే ధ్వనికి మా చెవులు గింగురు మనేవి. కమ్మరుల సుత్తి దెబ్బల్తో, రీన్‌హార్ట్ మాకు 'ఎడ్వాన్సు' అను ఆజ్ఞ యిచ్చేవాడు. అప్పుడు మేము నిప్పురవ్వలు చిందుతున్న యిరుకు సందుల్లోంచి ధైర్యంగా ముందుకు నడిచేసే వారం.

ఇదంతా **1898** లో మాట. ఆ సంవత్సరం మొదటి నెలల్లో మేము యుద్ధానికి కావలసిన తర్ఫీదు ఎన్నోవిధాల పొందాము.

ఆ ప్రకారం సుమారు రెండునెలలు గడిచింది. యింకా యుద్ధం ప్రారంభం కాకపోవడంతో మాకు చాలా విచారం వేసింది. ఏమిటి, ప్రెసిడెంటు చిట్టచివరికి యుద్ధం లేకుండా చెయ్యదలచు కున్నాడా? మా దేశంకోసం పోరాడగల ఆనందం మాకు దక్క నివ్వకుండా చెయ్యదలచుకున్నాడా? అంతపెద్ద వోడని ముంచేసి, అటువంటి అపచారము చేసిన స్పెయిన్‌ని శిక్షించకుండా వదిలి పెట్టెయ్యడమేనా?

మేము విషాదభారంతో కుంగిపోతున్న సమయాన, ఆనంద భానుడు వుదయించాడు. అమెరికా కాంగ్రెస్ యుద్ధప్రకటన

చేసింది. యుద్ధం ప్రారంభమయిందని వినగానే పట్టణమంతటి లోనూ నూతనోత్సాహం కనపడింది. ప్రతిచోటా పతాకాలు ఎగర వేశారు. ప్రతివారూ యింటికొచ్చాక, గంటలతరబడి, ఎడతెరిపి లేకుండా మాట్లాడేవారు. రాత్రి ఎనిమిదీ అవగానే మూడు వీధుల అవతలకికూడా, పత్రికలు అమ్మే కుర్రవాళ్ల అరుపులు వినబడేవి. "ప్రత్యేకసంచిక, ప్రత్యేకసంచిక. యుద్ధవార్తలన్నీ చదివి తెలుసు కోండి. యుద్ధవార్తలన్నీ చదివి తెలుసుకోండి" అని అరిచేవారు. ఆ కుర్రవాళ్లు ఎప్పుడొస్తారా అని ఎదురు చూస్తున్నట్లుండేవారు యిళ్లలో వారు, పత్రికకొన్నాక, వాదించుకునేందుకూ, మాట్లాడు కునేందుకూ తరగనివిషయాలువుండేవి. ఆ రాత్రంతా మాట్లాడు కునేవారు, తెల్లారికూడా అవే విషయాలు మాట్లాడుకునేవారు. అమెరికా యుద్ధంలో ప్రవేశించడంతో, మా పట్నానికి జీవకళ వచ్చిందంటే నమ్మండి.

యుద్ధ ప్రారంభంతో మా 'మార్చింగ్' పార్కుఎవెన్యూ, కర్రవంతెసలతో అగక, మాకు తెలిసిన చుట్టుపక్కల ప్రదేశా లన్నిటికిసాగింది. ప్రతిరోజూ మైళ్ళు తరబడి, పట్నపువీధుల గుండా 'మార్చి'చేసేవారం. అప్పుడప్పుడు మాకు సివిల్‌వార్ యోధులపటాలమో, గ్రాండ్ ఆర్మీ పంక్తో ఎదురుఅయ్యేది. ఎటొచ్చీ, వారు పెద్దవారు, మేము చిన్నవాళ్లం. కాని మా యిద్దరి లక్ష్యం ఒకటే! యిలావుండగా ఒకరోజున ప్రెసిడెంటు, వాలం టీర్లుకావాలని ప్రకటనచేశాడు. ఆ ప్రకటనకోసమే మేము యిన్నాళ్లబట్టీ ఎదురుచూస్తున్నాం. కాని మేము ముందడుగు వెయ్యక పూర్వమే, న్యూయార్కునగరానికి వెనక పోలీసుకమీష

నరుగా పనిచేసిన 'థియోడరు రూజ్‌వెల్టు' డకోటారాష్ట్రంలో, రఫ్‌రైడర్సు అను పటాలాన్ని తయారుచేయిస్తున్నాడనే వార్త వెలువడింది. రఫ్‌రైడర్సు అంటే కవ్‌బాయిస్ (Cowboys) అన్న మాట. 'కవుబాయిస్' సహజంగా అన్నిటికీ తెగించినవారు. ఆ తెగింపుకితోడు, లాంగ్ అయిలాండ్‌లోనూ ఫిఫ్త్ ఎవెన్యూలోనూ నివసించే కోటీశ్వరుల ధనసహాయంకూడా వారికి మద్దత్తుగావుందా, యింక వారిని వోడించగలవారు యీ పృధ్విలోవుండరని మా నమ్మకం. 'పి. యస్. పద్దెనిమిది'లోని కాడెట్‌లందరం యీ శుభవార్తవినగానే, పాపం, స్పెయిన్ పని అయిపోయింది - అనుకున్నాం. అసలు యీ 'కవుబాయిస్'కి ఎదురునిలబడి పోరాడగలవారు ఎవరున్నారు? వారి సాహసానికితోడు ధనలక్ష్మికూడా వున్న మీదట, యింకేమన్నావుందా? ఆ రఫ్ రైడర్సులో మమ్మల్ని కూడా చేర్చుకుంటే ఎంత బాగుండునోకదా - అనుకున్నాము. మాలో ఒక్కరికీ గుర్రపుస్వారీకూడా చేతకాదు. కొందరం అప్పుడప్పుడు గుర్రాలమీదకూచున్నాం గానీ 'స్టిరప్స్' కాళ్లకి అందేవి కాదు.

ఏమైనా మేము మా 'మార్చింగ్' మట్టుకు మానలేదు. ముందు 'రఫ్‌రైడర్సు'వెళ్తారు - ఆ తరవాత కొన్నాళ్లకైనా మాకు ఛాన్సు రాకపోతుందా అని, మా నమ్మకం. క్యూబాదీవిని రక్షించడంలో మేమూ మాకు చేతనైన సహాయం చేసితీరుతాం.

ఇంకా ఎన్నాళ్లకి మేము పెద్దవాళ్లమవుతాం, యింకా ఎప్పటికి మా వంతువస్తుందీ, అని చాలా విచారపడసాగాము. కెప్టెన్

రీన్‌హార్టు యీ విషాదపరిస్థితికి తట్టుకోలేకపోయాడు. ఒక రోజు నన్ను రహస్యంగాపిలిచి, మూడో ఎవెన్యూలోవున్న రెక్రూటింగ్ ఆఫీసుగురించి చెప్పాడు.

"మనిద్దరం వెళ్లాం. యివ్వాళ వర్షం పడేటట్లువుంది. అంచేత మధ్యాహ్నం మార్చింగ్‌లేదు," అన్నాడు రీన్‌హార్టు. నేను ఆకాశంవైపుచూశాను. సూర్యుడు వుజ్వలంగా ప్రకాశిస్తున్నాడు. మచ్చుకికూడా మబ్బుతునకలేదు. మరి, రీన్‌హార్టు వర్షం పడుతుందంటాడేమిటి ? - అనుకున్నాను. యేమైనా, అతను కెప్టెన్, నేను ప్రయివేటుని. అంచేత, అతని ఆజ్ఞ శిరసావహించవలసిందే.

"అలాగే వెళ్దాము" అన్నాను.

"స్కూలు అయాక" అన్నాడతను.

"మరి, మిగతావాళ్ల మాటో ?"

"అదే యిక్కడున్న పరమరహస్యం. నువ్వూ నేనూ ముందు జాయిన్‌అవుదాం. ఆ పైన మిగతావాళ్లని తీసుకునేందుకు, మనిద్దరం అక్కడుంటాం గనక మార్గం ఆలోచిద్దాం. కంపెనీ అంతా కట్టకట్టుకు అక్కడికివెళితే యేవొక్కరినీ చేర్చుకోరు. అందర్నీ పొమ్మంటారు."

రీన్‌హార్టు చెప్పేమాటలు సబబుగానే తోచాయి.

స్కూల్లో కూచున్నామన్న మాటేగాని మూడుగంటల బెల్లు ఎప్పుడుకొడ్తారా అని రీన్‌హార్టూ నేనూ ఎదురుచూశాం. 'బెల్' అయాక, అట స్థలంలోకివచ్చి, రీన్‌హార్టు తన ఆఫీసర్లలో వొకడితో అన్నాడు. 'ఇవ్వాళ మార్చింగ్ లేదని చెప్పువాళ్లకి. వర్షం పడవచ్చు.'

ఆ మాట చెప్పడమయాక నేనూ రీన్‌హార్టూ మూడో ఎవెన్యూ వైపు గబగబా నడిచాము.

"ఆ ఆఫీసు యిక్కడుందని నీకుతెలుసా?" అని అడిగాను.

"నాకుతెలుసు - యీ ప్రాంతాలేవుందిట. ఒక కాళీషాపుకి పక్కగావుందిట."

చివరి కెలాగైతేనేం, ఆ రెక్రూటింగ్ అఫీసుదగ్గరకొచ్చాం. అది ఒక ఖాళీషాపులావుంది. బయట పోస్టర్లు అతికించబడి వున్నాయి. లోపల ఎవరో నలుగురైదుగురు మనుషులు యిటూ అటూ తిరుగుతున్నారు. ఒకటేబుల్ ముందు సార్జెంటుకూచున్నాడు. పెద్దమీసాలూ అతనూ, ఎవరితోనో మాట్లాడుతున్నాడు. అతను మాట్లాడటమయిపోయాక, మేము లోనికివెళ్ళి శాల్యూట్ చేశాము. మా వంక అతను పరిశీలనగాచూసి, కుర్చీలోంచి కొంచెము ముందుకువొంగి "మీరెవరు?" అని అడిగాడు.

"'పి. యస్. పద్ధెనిమిది కాడెట్సుమి,' సార్" అన్నాడు రీన్‌హార్టు.

అటువంటప్పుడు మాట్లాడబోయానంటే, నాకు విపరీతంగా నత్తి వస్తుంది. అవునన్నట్లుగా నేనూ తలవూపాను.

"మీకేం కావాలిక్కడ ?"

"క్యూబాకి వెళ్లేందుకు సేనలో జేరుదామనివచ్చాము" అన్నాడు రీన్‌హార్టు.

"సేనలోనా? మీరా !"

"అవును, సార్."

"మీ వయసెంత ?"

రీన్‌హార్టు వెంటనే సమాధానంచెప్పలేదు. "నేను తొమ్మిది లోకివచ్చాను, సార్" అన్నాను. ఎనిమిదికి ఒక ఏడు కలిపి చెప్పడం, ఎందుకేనామంచిదని తొమ్మిదని చెప్పేశాను.

సార్జెంటు ఒకసారి బుర్రగోక్కుని "మీ కేమాదిరి యూని ఫారమ్స్ వున్నాయి?" అని అడిగాడు.

మాకు యేం సమాధానం చెప్పాలో తోచలేదు.

"ఆ టోపీ యిటివ్వండి చూస్తాను."

నేను నా టోపీ తీసియిచ్చాను.

"గ్రాండ్ ఆర్మీ టోపీలావుందే!"

"కాదు. 'పి. యస్. పద్దెనిమిది కాడెట్ల'ది. న్యూయార్కు లోని ప్రతివాళ్లకీ తెలుసానంగతి," అని రీన్‌హార్టు ధైర్యంగా చెప్పాడు.

"అయితే యిప్పుడు మీరు క్యూబా వెళ్తారన్నమాట."

మేము ఆ అభిప్రాయంతోనే అక్కడికొచ్చామన్నట్లు చిరునవ్వుతో తలలూపాము.

"క్యూబావెళ్ళి యేం చేస్తారు?"

"శత్రువుతో పోరాడుతాం" అన్నాడు రీన్‌హార్టు. నేనూ అదే పని చెయ్యదలచుకున్నానని, రీన్‌హార్టుతో యేకీభవించినట్లు తల వూపాను.

సార్జెంటు మావంక పరిశీలనగాచూసి, ఆలోచిస్తున్నట్లుగా మొహంపెట్టి, "మీ రక్కడికెళ్ళి ఏం చెయ్యగలరూ?" అని అడిగాడు.

"ఓ, మేము బాండ్ వాయించగలం. ఆఫీసర్లకి మంచినీళ్ళు అందించగలం. కాఫీ మొదలైనవి వాళ్ళకి కావలసినపుడు పట్టుకెళ్ళి యివ్వగలం. చాలా చెయ్యగలం."

"మీరు బాకా వూదగలరూ ?"

"వూదలేం, సార్" అన్నాడు రీన్‌హార్టు.

"కాని, వుత్తరాలు మేము ఒక కాంప్‌నుంచి మరో కాంప్‌కి తీసుకెళ్ళగలం. మేము చాలావేగంగా పరుగెత్తగలం. ఒకసారి ప్రయత్నించి చూడండి. మనం వేగంగా పరుగెత్తగలం కదూ, రీన్‌హార్టు" అన్నాను.

"అవును, మాలా పరుగెట్టగలవాళ్లు, మా స్కూల్లో ఎవరూ లేరు," అన్నాడు రీన్‌హార్టు.

అక్కడితో మా సంభాషణ ఆగిపోయింది. సార్జెంటుచెప్పే తీర్పుకోసం మేము ఎదురుచూస్తున్నాం. మా దీనవదనాలలోకి ఒక్కసారి చూశాడతను.

"మీ రింకా చాలా చిన్నవాళ్ళు" అన్నాడు సార్జెంటు.
"చిన్నవాళ్లం కాదు," అన్నాడు రీన్‌హార్టు.
"ఇంటికి వెళ్లండి."

"అవేమిటి మేము క్యూబా వెళ్దామనుకుంటుంటే ?" అన్నాను నేను.

"పై సంవత్సరం రండి" అన్నాడు సార్జెంటు.

"అబ్బే, అదెట్లా? రఫ్‌రైడర్స్ యీ ఏడాది శత్రువులందరినీ సఫా చేసేస్తారు. మాకు పై ఏడాదికి యేం మిగిల్తుంది? - యేం మిగలదు."

"మీరు చిన్నపిల్లలు - యింటికివెళ్లండి. నేను చెబుతున్నాను, యింక యింటికివెళ్ళండి."

ఇంక అది ఆఖరితీర్పు. ఆ తీర్పు కింక తిరుగులేదు. మా ప్రయత్నమంతా వృథా అయిపోయింది. బరువైన హృదయాలతో మూడవ ఎవెన్యూవైపుగా నడుచుకుంటూవచ్చాము. ఇలా రెక్రూటింగ్ ఆఫీసుకువెళ్లినట్లుగా, ఎక్కడా పొక్కనియ్యకూడదని మాలో మేము ఖరారునామా చేసుకున్నాం. ఈ అప్రదిష్టకి లోపల లోపల కుమిలి ఏడవాలి గాని పైకి చెప్పుకోటం కూడానా!

ప్రతి పుదయం తొమ్మిదిగంటలకి, అమెరికా పతాకాన్ని కామన్ హాల్లోకితీసుకొచ్చి, పతాకవందనం చేస్తూండేవారు స్కూల్లో. మా ప్రిన్సిపాల్ డాక్టర్ కెయిరాన్ వేదిక ఎక్కాక, పియానో వాయిద్యం ప్రారంభమయేది. ఆ పైన మే మందరం బారులుగా హాలులోకివచ్చి, పతాకానికి మా విధేయత తెలియబరుస్తూండే వారం.

ప్రతిరోజూ డాక్టర్ కెయిరాన్ బైబిల్ గ్రంథంనుంచి కొంత భాగం చదివి మాకు వినిపించేవారు. ఆయనకంఠమూ ఆ ఉచ్చా

రణా విన సొంపుగావుండేవి. బైబిల్ చదవడానికి అటువంటి వుదాత్తస్వరమూ, ఆ మాదిరి గంభీరకంఠమూ వుండాలి. నిత్య కృత్యంలో మాట్లాడేమాటల తీరువేరు; యీ బైబిల్ చదువుతున్న పుడు కంఠంలో కనపడే హుందాతనంవేరు. యీ పాతకథలు, తమ మహోన్నతభావాలతో నాకెంతో నూతనోత్సాహాన్నికల్గిస్తూ, జీవితంపట్ల ఆశ చిగురింపచేసేవి. ప్రేమతోపాటు కాఠిన్యతా, దయతోపాటు పగా, జంటగాఉండేవి. అక్కడక్కడ 'మాజిక్' లేకపోలేదు. అయినప్పటికీ అది, నాకెంతో సమంజసంగా కన పడేది. జోనాపాత్ర తిమింగిలపు పొట్టమీదకూచుని ప్రయాణం చెయ్యడం, డేనియల్ సింహాలకొట్లో ప్రవేశించడం - యివి నామన సుకి ఎంతో ఆహ్లాదం యిస్తూండేవి. ఆరాన్ తన చేతికర్ర కింద పడెయ్యగానే, అది పాముగా మారిపొయ్యిందంటే, మహ ఆశ్చ ర్యంగావుండేది.

నేను మా దొడ్లో చాలాసార్లు, చేతికర్రని ఆ ప్రకారంపారేసి, అది ఏ రూపం తీసుకుంటుందోనని, ఆతురతతోకనిపెట్టి చూస్తూండే వాడిని. అది ఏమీ అయ్యేదికాదు. కర్రకర్రలాగానే వుండి పోయేది. ఉండదగిన అద్భుతశక్తి నాలో లోపించిందని బాధపడే వాడిని. కాని, కాసేపుఅయాక పడేసిన కర్రముక్కలన్నీ పాము లైతే ప్రమాదం కాదా - అని నన్ను నేను తృప్తిపరుచుకునే వాడిని.

ఆ తరువాత జోసఫ్ తన సోదరులచేత బానిసగా అమ్మబడి, అతను అతిశక్తివంతుడవడం, చివరికి ఆ సోదరులే అతనివద్దకి

క్షమాభిక్ష కోరిరావడం - ఆ కథ నాకు బాగుండేది. ఉప్పుస్తంభంలా ఒకస్త్రీ అయిపోడం, జాకబ్ ఆకాశానికి నిచ్చెనవెయ్యడం, బాలకుడు వుండేలుబద్దతో బ్రహ్మరాక్షసిని చంపడం, శాంప్సన్ తన భుజబలంతో దేవాలయాన్నికూల్చడం, యివన్నీ నామనసుకి అపరిమిత ఆనందాన్నికలగజేసేవి. డాక్టర్ కెయిరాన్ బైబిల్ కథలు చదివి చెపుతున్నపుడు, నే నేదో అద్భుతలోకంలోకివెళ్ళి పోయేవాడిని - ఆ కథలో నేనూ ఒక భాగస్తుడనై ఆనందించే వాడిని.

ధగ ధగ లాడే గుండీలతో నీలం యూనిఫారమ్ ధరించిన నేను, ప్రపంచంలోని దుష్టత్వాన్ని నాశనంచేసేందుకు, పోరాడిన పూర్వకాలపు యోధాగ్రేసరుడిలా భావించుకునే వాడిని. బైబిల్ క్లాస్ అయిపోయిందంటే నా కెంతో దిగులుగావుండేది. మిగతా క్లాసుల్లో లెక్కలూ స్పెల్లింగేగా! మన మేధస్సు మరీ గొప్పదైతే తప్ప, వాటిని ఎదుర్కోడం కష్టం. ప్రతివాళ్ళూ భూగోళంకూడా చదవాలిట. ఆ పెద్దపెద్ద మాపులు ముందేసుకు, యే యే వూళ్ళు ఎక్కడున్నాయో చూపించాలిట. అంత చీకాకైనది అదేగాని మరొకటిలేదు.

సుఖంగా యీ అందాలదీవిలో బతుకుతున్న మేము, ఎక్కడో దూరానవున్న ఆ ప్రదేశాలగురించి తెలుసుకోడందేనికి? బ్రెజిల్ లో యే పదార్థాలు వుత్పత్తిఅవుతేనేం, ఎవడికికావాలి? ఫ్రాన్సులోని ద్రాక్షరసాల గురించి యిప్పుడు ఎవరు అడగొచ్చారు? అక్కడ మన 'మెయినీ' నౌక సముద్రంలో మునిగిపోగా, ఆ విషయమాలోచించక యివన్నీ ఎందుకు?

కాని, అమాంత్రం మా దృక్పథంమారింది. మా అందాల దీవేగాక యిటువంటి దీవులు చాలావున్నాయనీ, ప్రతిదీవికి దాని ప్రాముఖ్యతవుందనీ బోధపడింది. ఇంతవరకూ మాపులంటే విసుక్కున్న మేము, మాపుని యింకొంచెం జాగ్రత్తగా చూడటం మొదలుపెట్టాం. యుద్ధవార్తతో మా దృక్పథమే మారిపోయింది.

మొట్టమొదట మేము క్యూబా ఎక్కడవుందో తెలుసుకుందామనుకున్నాం. క్యూబాకూడా మాద్వీపంవంటిదేననీ, మాద్వీపంకంటే చాలా పెద్దదనీ, తెలిసేటప్పటికి ఎంతో ఆశ్చర్యం వేసింది. ప్రపంచపటం తీసుకుని అది ఎక్కడవుందో వెతికాం. క్యూబాలో మనుషులు ఏవిధంగా నివశిస్తున్నదీ, వారు ఏ ఏ సరుకులు వుత్పత్తి చేస్తున్నదీ కూడా తెలుసుకున్నాం.

మా క్లాసురూమ్‌లో యూరప్, ఆసియా, ఆఫ్రికా, అమెరికా పటాలతోపాటు ప్రపంచపటంకూడా వుంది. వీటిని బ్లాకుబోర్డులకి వేలాడతీసేవారు. మేము ప్రశ్నలు మొదలుపెట్టామంటే టీచరుని ఆ ప్రపంచ పటంనుంచి కదలనిచ్చేవారంకాదు. క్యూబాతోపాటు అనేక ప్రదేశాల గురించి వార్తలు వచ్చేవి. ఆ ప్రదేశాలన్నీ ఎక్కడవున్నాయో తెలుసుకోవాలని మా కుతూహలం.

మొట్టమొదట మేము ఫిలిప్పీన్‌లు ఎక్కడవున్నదీ తెలుసుకోవాలి. ఎంచేతనంటే, ఫిలిప్పీన్ ప్రెసిడెంటు మా నౌకాధికారి

అయిన కమడోర్‌డ్యూయీకి, తక్షణం మెనిలా రమ్మనమనీ, వచ్చి స్పెయిన్ వారి వోడలని ముక్కముక్కలు చెయ్యమనీ కబురంపించాడు. స్పెయిన్ వోడలని ముక్కముక్కలుగా చెయ్యడం చాలా మంచిపని. కాని, ఆ కార్యకలాపం ఎక్కడ జరిగేదీ తెలుసుకోవాలని మా ఆదుర్దా.

ఆ తరువాత హవాయీదీవులు ఎక్కడున్నాయో కూడ మేము తెలుసుకోవాలి. ఎంచేతనంటే, అక్కడి వారితో ఏదో వొప్పందంమీద, ఆ దీవులకి మా అమెరికా సేనలు వెళ్లేందుకుగాను ఏర్పాట్లు అయ్యాయిట.

వీటితోపాటు పెనామా కాలువ ఎక్కడుందోకూడా మేము తెలుసుకోవాలి. దానిగురించి పత్రికల్లో రోజూ ఏమిటేమిటో అనుకుంటున్నారు.

మాపులో వుత్తర దక్షిణ అమెరికాలని కలిపే ఆ స్వల్ప భూభాగం కనిపించీ కనిపించనట్లుగా వుంటుంది. అలాటిచోట కాలవ తవ్వడం అంటే, నాలాటివాడు పారా గునపం పట్టుకుంటే, అదెంతపని, అన్నట్టుగా వుంటుంది. కాని, మా జాగ్రఫీ టీచరు ఫ్రెంచి ప్రభుత్వం చాలా సంవత్సరాలనుంచీ యీ కాలవ తవ్వేందుకు శ్రమపడుతోందనీ, అందుకుగాను చాలా ధనం వ్యయం చేశారనీ, ఆ అడవులు నరికి 'ఎల్లోఫీవర్' నెదుర్కొని, పని పూర్తి చెయ్యడం ఎంతకీ అవడంలేదనీ చెప్పసాగారు. ఇప్పుడు ఆ ఫిలిప్పీన్ ప్రెసిడెంటు వున్నాడే ఆయన, ఫ్రెంచివారి సహాయంతో యీ కాలవ

నిర్మాణానికి మరికొంచెం గట్టిగా కృషిచేస్తే బాగుంటుందని అంటున్నాట్ట.

ఎప్పటికప్పుడు, మేము ప్రపంచ పటాన్ని పరిశీలిస్తూవుండే వారం. ఆ పటంలో మాకు చాలా ప్రదేశాలు, ఎర్ర రంగులో అగు పడేవి. కెనడా, ఆస్ట్రేలియా, ఇండియా, ఆఫ్రికాలో కొంతభాగం, బ్రిటీష్‌దీవులూ, ఆసియాలో అక్కడక్కడ, దక్షిణ అమెరికా యివన్నీ ఎర్ర రంగుతో వుండేవి. ఇదంతా కలిపి బ్రిటిష్ సామ్రాజ్య మట. అవును, మరి అయిదు ఖండాల్లోనూ యింత ప్రదేశ మున్నప్పుడు యీ మహాసామ్రాజ్యంలో, రవి అస్తమించడమంటూ, ఎలా వుంటుంది? యీ ప్రదేశాన్నంతా విక్టోరియామహారాణి పరిపాలించేది. ఆవిడ అప్పటికే చాలాపెద్దది. ఆమె వయసు ఎనభై సంవత్సరాలు. ఆమెకి ఎంత సామ్రాజ్యం వుందో! ఎంత నౌకా దళం, ఎన్ని సేనలు!! మేము చాలా చిన్నవాళ్ళమేగా ఆ లెక్కన! ఆనాడు ఎవరేనా నాతో, "యీ మహాసామ్రాజ్యం కరిగి పోవడం నువ్వు చూస్తావురా, అబ్బాయ్" అని అంటే, అతనొక పిచ్చివాడని భావించి వుందును. ఆనాడు ప్రపంచంలో బ్రిటిష్ సామ్రాజ్యమంత సుస్థిరంగా మరొకటి ఏమీలేదు. ప్రపంచపటంలో మా స్టేట్స్ (America) దెంత, మేమెంత? ఇంగ్లీషువారికి యింత సామ్రాజ్యం వుండటమేమిటి, మనకి ఏమీలేకపోడమేమిటి? - అని నాకు అప్పట్లో అసూయ కలిగినమాట నిజమే.

మా టీచరుని బ్రిటిష్ సామ్రాజ్యం గురించి, మాకు తోచినన్ని ప్రశ్నలువేసి, చివరికి క్యూబాదగ్గిరకొచ్చి, ఫిలిప్పీన్సుదాటి, పచ్చగా

వున్న ఆ మైదానమేమిటి? - అని అడిగేవారం. యిక్కడ మాకు తెలిసిన పట్టణమొకటి వుంది. దానిపేరు పెకింగ్. ఈ పట్టణం గురించికూడా మాకు అమాంత్రం వార్తలు రాసాగాయి. పెకింగ్‌లో ఏదో అలజడి ప్రారంభమయిందట. ఇన్నాళ్లబట్టీలేనిది వారికి, అమాంత్రం విదేశీయులమీద ద్వేషం పుట్టుకొచ్చి, పెకింగ్‌లో నివసిస్తున్న అమెరికనులనీ, యూరపియనులనీ, — 'మిమ్మల్ని ఏంచేస్తామో చూసుకోండి' అని బెదిరించడం మొదలుపెట్టారట. ఇవన్నీ మేము వార్తాపత్రికలో చదివేవారం. అనాడు న్యూయార్క్ నిండా ఎన్నికథలనుకున్నారు??

చైనీయులు మాకుమల్లే వుండరు కనుక, వారు దుర్మార్గులై వుండాలి అనుకునేందుకు, మాకు ఆట్టేసేపు పట్టలేదు. వారు పసుపుపచ్చ రంగులో వుంటారు. కళ్ళేమో అదోలా వుంటాయి. పిలకలు! ఇక వారి స్త్రీలు తమాషా దుస్తులు వేసుకుంటారు. మొగవాళ్ళయినా మాకుమల్లే శుభ్రమైన బట్టలు ధరించరు. ఎవరూ నెక్‌టైలు కట్టుకోరు. అందరూ నల్లమందు పొగ పీలుస్తారుట. ఏమైనా, వారిగురించి మాకు సదభిప్రాయముండేది కాదు. అటువంటి మనుషులు, ఎంతకేనా తగుదురని యిట్టే నమ్మేశాం.

క్లాసురూమ్‌లో కూచుని, ఆసియామాపులో చైనా చూస్తున్నప్పుడు, విన్నకథలన్నీ గుర్తుకొచ్చి, ఆశ్చర్యపోయేవాళ్లం. ఆ ప్రాచ్యదేశాన్ని 'షూషీ' (Szu-Hsi) అనే మహారాణి పరిపాలిస్తోందట. ఆమె వయసు అరవైఅయిదు సంవత్సరాలు. ఎంత ఆశ్చర్యం!

ఎందులోనూ పోలికలేని యిద్దరు స్త్రీలు, ఇద్దరు మహారాణులు, యీ భూప్రపంచంలోని రెండు మహాసామ్రాజ్యాలని పరిపాలిస్తూండటం! ఎంతటి చారిత్రక వింత యిది!! అట్లాంటిక్ పసిఫిక్ మహాసముద్రాలు, నన్ను యీ యిద్దరు మహారాణులనుంచీ వేరు చేసి, ఒక చిన్నచోట వుండనీయడం నిజంగా నా అదృష్టమే అనుకున్నాను.

ప్రపంచపటం మా అందరికీ కొత్త అందాలతో కనిపించసాగింది. అమెరికన్‌ల దృష్టి దూరతీరాలమీద పడింది. హాయిగా సుఖంగా బ్రతుకుతున్న న్యూయార్కు ప్రజలకి లోకచరిత్ర తెలుసుకోవలెననే ఆదుర్దా పుట్టుకొచ్చింది. ఆ రోజుల్లో అట్లాసులు ఎంత విపరీతంగా అమ్మకమయేవనుకున్నారూ? యూరప్, ఆసియా యీ రెండూ మాకు దూరంగావున్న ఖండాలని, మొట్ట మొదటిగాతెలిసింది మాలో చాలామందికి.

ఆ మాపువంక చూసినకొద్దీ యీ దేశాలు యింత వంకర టింకరగా ఎందుకు సృజింపబడ్డాయా అని ఆశ్చర్యంకలిగేది. కాలిఫోర్నియా, ఫ్లారిడా, ఇటలీ, స్పెయిన్, స్కాండినేవియా, మలయా, యిండియా, కొరియా, వుత్తర అమెరికా, దక్షిణ అమెరికా, అలాస్కా, యివన్నీ యేదో పైనుంచి వేలాడుతున్నట్లుగా కనిపించేవి. దిగువకివచ్చిన కొద్దీ ప్రపంచపటంలోని దేశాలన్నీ ఎందుకిలా వేలాడేవో, నాకు ఆ నాటికీ యీ నాటికీ అర్థంకాని విషయాల్లో ఒకటి.

ప్రపంచ పటంలో మరొక వింతసంగతి. అక్కడక్కడ నల్ల మార్కులు కనపడేవి. మధ్య ఆఫ్రికాలో ఎక్కువగానూ, దక్షిణ అమెరికాలోనూ, మధ్య ఆసియాలోనూ అక్కడక్కడా, టిబెట్టూ, నైలు అమెజాన్ నదులుపుట్టిన ప్రదేశాలూ, మధ్య పెర్సియా, పడమటి మంగోలియా, వీటన్నిచోట్లా నల్లనిగీతలుండేవి. అంటే అవి యింకా పరిశోధింపబడని ప్రదేశాలన్నమాట. ప్రపంచంలోని యీ ప్రదేశాలన్నీ నేను పెద్దయాక వెళ్ళి, పరిశోధించిరావాలి; యీ ప్రదేశాలకివెళ్ళేందుకుగాను యితరత్రా ఎవరైనా ఆలోచిస్తున్నారేమో నాకుతెలియదు. నేను పెద్దయాకవెళ్ళి వాటిని పరిశీలించి, ఒక గొప్ప మహానాయకునిగా, యోధాగ్రేసరునిగా కీర్తిప్రతిష్టలు పొందాలి - అనుకున్నాను.

నేను మా టీచర్లని రకరకాల ప్రశ్నలు వేసేవాడిని. ఒక్కొక్కప్పుడు వారు నా ప్రశ్నలకి నాకు జవాబులు చెప్పలేకపోతూండేవారు. లోకానికి తెలియనవీ, పరిశోధింపబడనివీ అయిన ప్రదేశాల గురించి, నాకీ కుతూహలం అంత మంచిదికాదన్నట్లుగా వారు అభిప్రాయం వెలిబుచ్చేవారు. యీవయసులో స్పెల్లింగూ లెక్కలూ తెలుసుకోక, యివన్నీ ఎందుకీ కుర్రవానికి - అని వారి భావనై ఉంటుంది. మా టీచర్లకి అచ్చక్షరాలమీదా, అచ్చుపుస్తకాల మీదావున్నగౌరవం, యింతా అంతాకాదు. అచ్చులోలేనివి స్కూలు పిల్లలు తెలుసుకోడమెందుకు అని వారివుద్దేశం.

మా టీచర్ల దృక్పథం స్కూలుపిల్లల్లో కొందరి సహజ కుతూహలాన్ని నిక్షేపంగా పోగొట్టిందిగాని, నాలాటివారిని అంతగా పాడు

చెయ్యలేకపోయింది. ఏళ్ళుగడిచిన కొద్దీ నేను ప్రశ్నల సంఖ్యని పెంచి, వాటికి తగిన జవాబులుపొంద ప్రయత్నించేవాడిని. బాల్యం లోని సహజకుతూహలమే, నా జీవితానికి వన్నెచిన్నెలూ, అంద చందాలూ సమకూర్చింది. పాఠశాలలూ వుపాధ్యాయులూచెప్పిన దానికంటె నాసహజకుతూహలంవల్ల నేను అనేక విషయాలు తెలుసుకోగలిగాను.

స్కూల్లో ప్రపంచపటం గురించి చెపుతూంటే, నేను ఆ నల్లవాటిగురించి, క్యూబాలో జరుగుతున్న యుద్ధాలగురించీ ఆలో చిస్తూవుండేవాడిని. థియోడర్ రూజ్‌వెల్టు తన 'రఫ్‌రైడర్స్'తో క్యూబాలో ఘోరయుద్ధం సాగిస్తున్నాడు. న్యూయార్కుపౌరు డయిన రూజ్‌వెల్టుకి యుద్ధవిజయం తథ్యమనే విషయంలో యేవొక్కరికీ సంశయంలేదు. ఇక కమడోర్‌డ్యూయీ, ప్రెసి డెంటు వుత్తరువుప్రకారం యుద్ధనౌకలని, మెనిలా హార్బరులోకి పట్టుకునివెళ్ళి, అక్కడున్న స్పానిష్‌వోడలని, ముక్కముక్కలు చేసేసాడు. ఆ మహాయుద్ధంలో, ఆరుగురంటే ఆరుగురే అమెరి కన్‌లకి, కొద్దిగా గాయాలుతగిలాయట. నన్నడిగితే యుద్ధమనేది, ఆ ప్రకారం నిర్వహించాలి. ఈ విజయవార్తలు మా కందరికీ అమితానందం చేకూర్చాయి. ఒకవారం రోజులు కాకుండానే కమడోర్‌డ్యూయీకి ఎడ్మిరల్ పదవియిచ్చి గౌరవించారు.

అక్కడ క్యూబాలో యుద్ధమే కాకుండా, యిక్కడ న్యూయార్క్‌లో మేమొక ప్రయివేటు యుద్ధాన్ని అనునిత్యమూ చూస్తూవుండేవాళ్లం. ఈ ప్రయివేటుయుద్ధం రెండు ముఖ్యపత్రికల

మధ్య జరుగుతూండేది. మిస్టర్ హీరిస్ట్ (Hearst's Journal) జర్నల్‌కీ, మిస్టర్ పులిట్జర్ (Pulitzer's World) వరల్డ్‌కీ రాత్రిం బగళ్ళూ బ్రహ్మాండమయిన పోరాటం సాగేది. ప్రత్యేక వ్యాసాల్లో, పతాకశీర్షికల్లో, సంపాదకీయాల్లో, సర్క్యులేషన్ సంఖ్యాల్లో, ఒకరి కొకరు తీసిపోకుండా వుండేందుకు, నిరంతరం పోరాడుతూండే వారు. ప్రకటనల ఏజెన్సీగల వ్యక్తి మనమడిని అవడంచేత, యీ మహావైరం, యీ బ్రహ్మాండమయిన యుద్ధం, సన్నిహిత స్థలం నుంచి చూడగల అదృష్టం నాకు లభించింది. ప్రతిసాయింత్రం తాతయ్యా నేనూ ప్రకటనలు అందియ్యడానికి వార్తావీధికి (Park Row) వెళ్లేసరికి, వీధివీధంతా కోలాహలంగా వుండేది. ప్రతిదీ మేము ప్రత్యక్షంగా చూస్తూండేవారం. అన్ని విషయాలూ మాచెవిలో పడేవి. కానీ వరల్డ్ ఆఫీసుకి వెళ్ళినపుడు, మేము జర్నల్ ఆఫీసుకు వెళ్ళామనిగాని, జర్నల్ ఆఫీసుకు వెళ్ళినపుడు వరల్డ్ సంగతిగాని మాటమాత్రంగాకూడా అనేవారం కాదు. ఆమాత్రం తెలివితేటలు లేకపోతే బ్రతకడం ఎలా? రోజురోజుకీ రెండు పత్రికల మధ్యనున్న వైరం దినదినప్రవర్ధమానం కాసా గింది. ఎప్పుడు యిది ఎటువంటి వుపద్రవానికి దారితీస్తుందో అని, అందరూ భయపడుతూండేవారు.

యుద్ధ వార్తలు ప్రకటించడంలో ఒకరికంటే మరొకరు 'డ్రమేటిక్'గా ప్రదర్శించడం ప్రారంభించారు. వార్త సామాన్య మైనదైనా దానికి రంగుపూసి గోరంతలు కొండంతలుగా చేసి, యేదో మహోపద్రవం జరగబోతున్నదన్నట్లుగా, ఆఖరికి సామాన్య వార్తలనికూడా ప్రకటింపసాగారు. ప్రతికక్షులు యేవేవి పతాక

శీర్షికలుగా వేస్తున్నారో తెలుసుకు, ఆ పతాక శీర్షికలని వారికంటే అందంగా యువతలవారు వేయబూనేవారు. ఈ రహస్య సమాచారాలని చేరవేసేందుకు, రెండు ఆఫీసులకీ మధ్య బోలెడంత మంది గూఢచారులు. జర్నల్‌లో పోరాటం అని పడితే, వరల్డ్‌లో 'వుద్రేకపూరితమైన వైరం' అని పడేది. ఒకగంటపోయాక జర్నల్ తీసుకొచ్చే ప్రత్యేక సంచికలో 'మహాయుద్ధమునకు తయారు', అని పతాకశీర్షిక వెలువడేది.

ఈ పెద్దక్షరాలు నాకు సరదా అని మొదట చెప్పానుకదా ! లోపలవన్నీ చదవలేకపోయినా, ఈ పెద్దక్షరాల్లో యేంచెపుతున్నదీ నేను జాగ్రత్తగా గమనిస్తూ వుండేవాడిని. అసలు యీపెద్దక్షరాలు ఎందుకువేస్తారో నాకు తెలుసుకోవాలని సరదాగా వుండేది. ఒక్కొక్కసారి ఆ పెద్దక్షరాలకి, క్రిందనున్న వ్యాసానికీ యేమంత సంబంధమే వుండేదికాదు. అసలు ఈవార్తలన్నీ వీళ్ల ఆఫీసుల్లోనే చాలామటుకు తయారవుతాయని విన్నాను. ఆప్రకారం వార్తలు యింట్లోకూచుని తయారుచెయ్యడం నాకు పెద్దమనిషితరహాగా కనిపించలేదు. వార్తలు తయారు చేసేవారందరూ నాతో బాగా మాట్లాడేవాళ్ళూ మంచివారే అనుకోండి, అది వేరేసంగతి. ఉన్న విషయమేదో చెప్పక, యింత అట్టహాసం ఎందుకుచేస్తారో, నా చిన్నబుర్రకి తెలిసేదికాదు.

పతాకశీర్షికల విషయంలో ఒకరినిమించి మరొకరువుండాలనే పోటీయేకాకుండా, సర్క్యులేషన్ విషయంలోకూడా, యీ పోటీ నానాటికి పెరగసాగింది. ప్రతి పేపరుకీ వాళ్లబళ్ళూ, వాళ్ళ

కుర్రాళ్ళూవుండేవారు. ఒక్కొక్కప్పుడు యిద్దరిబళ్ళూ యేకకాల మందే బయలుదేరి, ఎవరు పట్నపు ఎగువభాగాన్ని ముందుచేరు కోడమా అనే పోటీలో గుర్రాలచేత దౌడుతీయించేవారు. బండీలోని పేపరుకట్టలు అక్కడక్కడ దింపటంతో బండీబరువు తేలికకాగా గుర్రపువేగంపెరిగేది. ప్రతిబండీలో ఒకబండిమనిషీ యిద్దరు కుర్రవాళ్ళూవుండేవారు. ఈ బళ్ళు, తాము ముందు వెళ్ళాలంటే తాము ముందువెళ్ళాలనే హడావుడితో, రోడ్డుమీద ప్రజలకి చక్కటిదృశ్యాలు ప్రదర్శిస్తూండేవి. కొంచెం నిర్మానుష్యంగావున్న ప్రదేశంలో, ఒక బండీలోవారు మరొక బండీలో వారితో తలపడే వారు. యిద్దరూ చావాచితకాకొట్టుకునేవారు. ఈ పోరాటాలూ యీ కొట్టుకోడాలూ రోజూ అలవాటు అయిపోయేవి. ఇదేదో ప్రయి వేటుయుద్ధం, మనకేల - అని పోలీసువారు కలగజేసుకునే వారు కాదు.

ఈ పేపరు బళ్ళమధ్య పోరాటం ఎక్కువై, పరిస్థితులు విషమించడంతో, యిద్దరూ తమబళ్ళ కాపలాకిగాను రౌడీలను యేర్పాటుచెయ్యక తప్పిందికాదు. తమ బండినీ పత్రికలనీ కాపా డేందుకు ఎవరికివారు, రౌడీలనిపెట్టి సంరక్షించుకోసాగారు. రౌడీ లనిపెట్టినంతమాత్రాన యీ యుద్ధం ఆగుతుందా! ఈ రౌడీలూ ఆ రౌడీలూ యిద్దరూ బుర్రలు బాదుకునేవారు. అందుకని గాయ పడ్డ వారికోసమని రెండు ఆఫీసుల్లోనూ అడుగుభాగాన మంచాలూ అవీవేసి, డాక్లర్లని ఎల్లవేళలా వుంచుతూండేవారు.

ఆ వసంతకాలమంతా మే మింకా మార్చిచేస్తూనేవున్నాం.

పార్కుఎవెన్యూదాటి, వంతెనలుదాటి, రైలుపాగదాటి, కమ్మరి కొలుములుదాటి, పట్నవుప్రీధులన్నీ దాటి వస్తూండే వారం. నాకూ రీన్‌హార్టుకీ మధ్య ఒక గుప్తవిషయంవుంది. ఆ రహస్యం మా యిద్దరికేతెలుసు. అప్పుడప్పుడు మేము ఆ విషయమై సంప్రదించుకుంటూండేవారం. సార్జెంటు మమ్మల్ని ఒక యేడాదిపోయాక రమ్మనమన్నాడు. ఏడాదికాలం కనిపెట్టుకుని వుండటమంటే మాటలా!

"నా పుట్టినపండగ యీ సెప్టెంబరులోవస్తుంది. అప్పటికి నే నొక యేడాది పెద్దవాడిని అవుతాను."

"నా పుట్టినపండగ అక్టోబరులో" అన్నాడు రీన్‌హార్టు.

"అంటే, అది ఒక సంవత్సరంక్రింద లెక్కగా?"

"అంతే అనుకుంటా" అన్నాను.

మే మిద్దరం వేసంగి శలవలుఅయాక రెక్రూటింగ్ ఆఫీసరునిచూసి, మే మొక యేడాది పెద్దవాళ్ళమయామని చెపుదామనీ, అనుకున్నదంతా సవ్యంగా జరిగిపోతుందనీ భావించాము.

రీన్‌హార్టు వేసంగి శలవుల్లో 'బాకావూదటం' నేర్చుకుంటా నన్నాడు. ఎందుకంటే, సేనలో చేరినవారికి 'బ్యూగిల్సు' వూదవల సిన అవసరంవుంటుంది. ఆ విద్య ముందే నేర్చుకోడం మంచిది. నేను పరుగెత్తడంలో మరికొంత శిక్షణ పొందుతాను. ఎందుకంటే, 'డిస్పాచి రన్నర్'గా పరుగెత్తగలనేర్పు నాకు వున్నదనే అభిప్రాయం, చాలా కాలంబట్టీ నా మనసులో పాతుకుపోయింది.

ఈ వేసంగి శలవలు ఎలా గడపడమా అనేదే మాకు పెద్ద సమస్య అయిపోయింది.

వార్తా వీధికివెళ్ళినపుడు అప్పుడప్పుడు నాకు తెలిసినవారిని అడుగుతూండేవాణ్ణి. "మిస్టర్, యీ యుద్ధం ఎన్నాళ్ళుంటుందో చెప్పగలరా ?"

"యుద్ధం ఎంతకాలం సాగుతుందనా ?"
"అవును, సార్."

"చెప్పడం చాలాకష్టం, అబ్బాయ్! ముప్పైసంవత్సరాల యుద్ధం గురించి నువ్వు వినలేదూ?"

"వినలేదు, సార్."

"సివిల్‌వారు ఎన్నాళ్ళుబట్టింది ?"

"అదీ సరిగ్గా తెలియదు."

"అయితే చెపుతావిను. పద్దెనిమివందల అరవైఒకటిలో యుద్ధం ప్రారంభమయిందా, అరవైరెండులో యాంకీలు (అమెరికనులు) ముందుకు చొచ్చుకుపోయారు. అరవైమూడులో నీగ్రోలు విముక్తులయారు. అరవైనాలుగులో యుద్ధం పూర్తిఅవడంతో, 'జానీ' విజయగీతం పాడుకుంటూ యింటికి వచ్చాడు. ఎన్నేళ్ళు పట్టిందో చెప్పు."

"నాలుగు సంవత్సరాలు, సార్. నాలుగేళ్లయితే ఫరవా లేదు."

"ఏమిటి ఫరవా ? దేనికి?"

"ఆ - ఏమీలేదు. యుద్ధం నాలుగేళ్ళయినా వుండకపోతే ఏం బాగుంటుంది ? వారు నన్ను వొచ్చేయేడు సేనలోకి తీసుకుంటామన్నారు."

"నిన్నా !"

"అవునండి."

"ఓ, అలాగా !"

స్కూలు తెరిచేదాకా మేము వుండబట్టలేకపోయాము. క్యూబా నుంచి దినదినమూ బ్రహ్మాండమయిన వార్తలు వస్తు న్నాయి. శాంటియాగో హార్బరులో మరికొన్ని స్పానిష్‌నౌకలు మునిగిపోయినట్లు వార్తలువచ్చాయి. ఈ వార్తలూ యీ హడావుడీ వినడంతో రీన్‌హార్టుకీ నాకూ యింకా ఎన్నాళ్ళిక్కడ పడివుండటం అనిపించింది. మళ్ళీ ఒకసారి రెక్రూటింగ్ ఆఫీసుకెళ్ళి మా అదృష్టాలు పరిశీలించుకుందామనిపించింది. కలరావుండలుపెట్టి దాచివుంచిన మా యూనిఫారమ్సు తీసి, వాటి నొకసారి దులిపి ధరించి, మూడవ ఎవెన్యూమీదుగా, నలభైరెండో వీధిలోకివెళ్లాము.

మార్గ మధ్యంలోనే రీన్‌హార్టు అపశకునపు పలుకులు అన్నాడు: "ఆ పెద్దమీసాలతను అక్కడ వుండకపోతే ?"

"ఆ సార్జెంటు వుండకపోతే, మరో సార్జెంటువుంటాడు. అతనితో మాట్లాడుదాం."

"పాతఅతను మనకిచ్చిన వాగ్దానంగురించి కొత్త అతనికి ఎలా తెలుస్తుంది ?"

"తెలియకపోవచ్చు, మనం చెపుదాం."

"మనమాటలు నమ్మకపోవచ్చు. వెనకటి అతనిదగ్గిరనుంచి మనమో కాయితంలాటిది పుచ్చుకుని వుండాల్సింది."

"అమెరికన్‌సేన ఒక మాటయిస్తే, ఆ మాట తప్పుతుంది అనుకోకు. వెనకటి అతను మనకి, అమెరికన్‌సేన తరఫున, వాగ్దానంచేశాడు. ఎబ్బే, మనని సేనలోకి తీసుకోకపోరు" అని ధైర్యంచెప్పాను నేను.

రీన్‌హార్టూ నేనూ యీ కబుర్లు ఆ కబుర్లూ చెప్పుకుంటూనే రెక్రూటింగ్ ఆఫీసు వుండవలసిన చోటుకివచ్చాము. మునుపు ఖాళీగావున్నచోట యిప్పుడేదో దుకాణముంది. లోపలికి వెళ్లి దుకాణాదారుని రెక్రూటింగ్ ఆఫీసు ఏమైందని అడిగాం. తనకి తెలియదన్నాడు. వీధిలోకివచ్చి ఒకపోలీసు జవాన్‌ని అడిగాం.

"అవును, యిక్కడొక రెక్రూటింగ్ ఆఫీసువుండేది. దాన్నిపుడు మూసేసారు. సేనలోకి యింక మనుషులు అక్కర్లేదుట. వాళ్లకి కావలసిన దానికంటే ఎక్కువమంది వాలంటీర్లు సేనలో జేరారుట" అన్నాడు ఆ పోలీసుజవాను.

అది మా పాలిట అశనిపాతమే కదా! కానీ రీన్‌హార్టుకీ నాకూ ఆశలు చావలేదు. రీన్‌హార్టుతో అన్నాను, సివిల్‌వార్ నాలుగేళ్ళు జరిగిందనీ, మరొకయుద్ధమేదో ముఫైఏళ్ళుకూడా జరిగిందనీను. ముఫైఏళ్ళపాటు యుద్ధం జరగడమనేది చారిత్రకసత్యం. అటువంటప్పుడు మేము నిరుత్సాహంపొందుతే ఎలా ?

ఎంతధైర్యం చెప్పుకున్నా మనసు కుదటపడలేదు.

మా స్కూలు యింకో నెలకి తెరుస్తారనగా, అమెరికన్ సేనలని క్యూబానించి మరోచోటకి పంపుతున్నారని వార్తలు వచ్చాయి. మాకు చాలా దిగులేసింది. ఎల్లో ఫీవరూ, సరి అయిన ఆహారపదార్థాలు దొరక్కపోవడం, వీటితో యుద్ధాన్ని ముగించేసి, సంధి పత్రాలమీద సంతకాలు పెట్టారుట. రూజ్‌వెల్టూ అతని రఫ్ రైడర్సూ, ఆ నాటి వీరాగ్రేసరులుగా ఆరాధింపబడ్డారు.

న్యూయార్కులోవున్న మాకు రూజ్‌వెల్టు యింతవాడయాడంటే, ఏమీ ఆశ్చర్యకరంగా తోచలేదు. న్యూయార్కు పోలీసు శాఖలోని ప్రతి వున్నతోద్యోగీ అద్భుత బలసంపన్నుడనీ మహా నాయకుడనీ మా అభిప్రాయం. ఆ అద్భుత బలసంపన్నతకీ మహా నాయకత్వానికీతోడుగా, 'కౌబాయ్' సాహసత్వమూ కోటీశ్వరుల ధనమూ, వున్నపుడు ఏదేనా జయించుకురావచ్చు. న్యూయార్కు పోలీసుశాఖలో శిక్షణపొందిన వారికి ఏ రంగంలో అయినాసరే, జయమేగాని అపజయంవుండదని మా దృఢనమ్మకం. వారు ఎంత తొందరగా విజయాన్ని సాధించారంటే, యుద్ధం ప్రారంభమయిందని అనుకోకపూర్వమే, ఆ యుద్ధం కాస్తా యిట్టే పూర్తిఅయి పోయి కూచుంది.

సెప్టెంబరులో స్కూల్సు తెరిచినమీదట, కాడెట్ లందరమూ సమకూడి మార్చ్ చేశాముగాని ఆ మార్చింగులో జీవంలేదు. మేమందరమూ ఎందుకనో విచారగ్రస్తులమై వున్నాము.

ఆసంవత్సరాంతాన, మా ఆశలు మళ్ళీ చిగురించాయి. ప్రపంచంలో ఎక్కడో మూలమూలల యుద్ధమేఘాలు అవరిస్తున్నా యని వినేసరికి, మాకు ప్రాణం లేచివచ్చినట్లయింది. అమ్మయ్యా! అంతా అయిపోయిందనుకున్నాం. అయిపోలేదుకదా - బతికాం.

**1899** ప్రథమ భాగంలో, ఫిలిప్పీన్ దీవులకి స్వాతంత్ర్యం యిచ్చారు. స్వాతంత్ర్యం యిచ్చాక అక్కడ తిరుగుబాటు చెలరేగింది. ఈ ఫిలిప్పినో విప్లవాన్ని అణిచేందుకుగాను డెభైవేల మంది అమెరికన్ సోల్జర్లు వోడలమీద బయలుదేరుతున్నారని మాకు తెలియవచ్చేసరికి, మాలోని 'యుద్ధకాంక్ష' మరొక్కసారి ప్రజ్వరిల్లింది.

1899లో యీవొక్క సంఘటనేగాక, ప్రపంచాన్ని చెరోవైపు నుంచీ పరిపాలిస్తున్న మహారాణులిద్దరూ, అనేకమైన చిక్కుల్లో యిరుక్కోడం మొదలుపెట్టారు.

విక్టోరియా మహారాణికి దక్షిణ ఆఫ్రికా కొరకరాని సమస్య అయిపోయింది. అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకున్న డచ్‌వారితో పోరాడేందుకుగాను బ్రిటిష్ పటాలాలు పంపవలసి వచ్చిండి. దాన్నే 'బోయర్ యుద్ధం' అంటారు. ఆ బోయర్ యుద్ధంలో మా అమెరికా ఏంతమాత్రం చిక్కుకోలేదనుకోండి, కాని యెక్కడో ఒకచోట యుద్ధం జరుగుతోందంటే, సంతోషపడటం సహజం

కదా! ఈ యుద్ధంలో అయిరిష్‌వారు, తమ సానుభూతి డచ్‌వారి వైపు అన్నట్టుగా, తమ యిళ్ళముంగిట డచ్ పతాకాలు ఎగుర వెయ్యసాగారు.

ఆ రెండవ మహారాణివుందే, చైనాదేశాన్ని పరిపాలించే చక్రవర్తిణి, ఆమెకీ, అమెరికాకీ అసలు పేచీ ప్రారంభమయింది. యీ చైనారాణికి తెల్లవారంటే ఎందుకనో కోపమట. చైనీయులు కాని మిగతా అందరిమీదా కోపమేనట,

చైనారాణికీ మిగతావారికి మధ్య లావాదేవీలు ఏవిధంగా వున్నా, మా వార్తాపత్రికలు మాత్రం వాటికి చిలవలూ పలవలూ కల్పించి, చైనాతో యుద్ధం తప్పదుసుమా అన్నట్టుగా, 'తస్మాత్ జాగ్రత' చెప్పేవి. ప్రతిరోజూ బోయర్ యుద్ధం గురించి, ఫిలిప్పీన్ల గురించీ, చైనాలోని వుద్రిక్త పరిస్తితి గురించీ, ప్రత్యేక సంచికలు వెలువడేవి.

వీధిల్లో, యిళ్లలో, స్కూల్లో ఎక్కడచూసినా హడావుడే. పత్రికా ప్రచురణకి అదొక స్వర్ణయుగం. ఒక్కొక్క ప్రమాదం రావడంతో పత్రికల అదృష్టం పండేది. ఇక మాగ్జయినులలో వెలువడే వ్యాసాల గురించి చెప్పనే అక్కర్లేదు. అంతకి రెండు సంవత్సరాల క్రితం, వెయ్యిడాలర్ల ధరకి ఫిలడల్‌ఫియాలో అమ్మ బడిన, సాటర్ డే యీవినింగ్ పోస్టు అను పత్రిక, ఈసమయంలో బహుళ ప్రచారాన్ని పొందసాగింది. ఈ యుద్ధాలూ, మహారాణు లిద్దరూ ఏకీభవించకపోవడం, - వీటితో పత్రికా ప్రచురణ అన్ని విధాలా లాభదాయకమైన వ్యాపారంగా రూపొందింది.

తమ వ్యాపారం లాభసాటిగా నడిచేందుకు ప్రపంచాన్ని ఎప్పుడూ పంచరంగుల కాంతితో ప్రదర్శించేవారు పత్రికాప్రచురణ కర్తలు. అదొక వుత్సాహపూరితమైన ప్రపంచం. నాయకులకీ మహా నాయకులకీ అనువైన ప్రపంచం.

మేము యుద్ధానికి వెళ్ళగల అవకాశం లభించకపూర్వమే 'విక్టరీ పారేడ్' (జయాన్ని సూచించే కవాతు ప్రదర్శన) ప్రారంభ మయింది. ఆసంగతి రీన్‌హార్ట్ చెప్పాడు నాకు. నేను మొదట్లో నమ్మలేదు కాని, చివరికిఅది నిజమే అయిందీ. ఎడ్మిరల్ డ్యూయీ తన నౌకాసిబ్బందితో, న్యూయార్క్ హార్బరులో ప్రవేశించేటప్పటికి అమెరికా ప్రభుత్వమూ, అమెరికా ప్రజలూ అతనికి ఘనస్వాగత మిచ్చారు.

విక్టరీపారేడ్ జరిగిన రోజున మా 'కాడెట్‌కోరు'ని కూడా వీధులవెంట నడవనిచ్చారు. మేము క్యూబా వెళ్లకపోయినా, అలా నడవనిచ్చినందుకుగాను, ఎంతో సంతోషించాము.

ఎడ్మిరల్ డ్యూయీకి బహూకరించిన వెండికప్పు లాటిది నేనెక్కడా చూడలేదు. అది నాలుగడుగుల ఎత్తుంది. నాలాటి వాడు శుభ్రంగా దానిలో దాక్కోవచ్చు. అంత బ్రహ్మాండమయిన కప్పుని డ్యూయీకి న్యూయార్క్ ప్రజలు సమర్పించారు. ఒక కప్పుతోటే సరికాదు. అతని శిలాప్రతిమ స్థాపించేందుకు కూడా, తగు యేర్పాట్లు చేశారు. ఆ తయారయిన బొమ్మ ఎంత అందంగా వుందో చెప్పలేను.

సెప్టెంబరు మొదటి 'విక్టరీపారేడ్' జరగనుంది. అమెరికా లోని వివిధరాష్ట్రాలలోని వారందరూ న్యూయార్క్ నగరానికి వచ్చారు. ఆ సందర్భంలో న్యూయార్క్ నగరం ఎటువంటి జన సమ్మర్దంతో, ఎట్లావుందో చెప్పలేను. చాలా హొటల్సులో మనిషి ఒక్కంటికి రోజుకి రెండున్నర డాలర్లు చొప్పున పుచ్చుకునేవారు. వాల్ డార్ఫ్, యాస్టర్‌హౌసు మొదలైన పెద్దహొటల్సులో తిండీ గిండీ ఏంలేకుండా ఉండేందుకు వసతి యిచ్చినందుకే రోజుకి రెండున్నర డాలర్లు పుచ్చుకున్నారట. న్యూయార్క్‌లోని అన్ని హొటల్సూ సమయం కనిపెట్టి రేట్లు పెంచేసాయి.

"ఇది దురన్యాయం. చాలామంది విజిటర్సు వస్తారుగదా అని, యీప్రకారం రేట్లు పెంచడం ధర్మంకాదు. అయిదుసెంట్ల వస్తువుకి పదిసెంట్లు పుచ్చుకోడంలా వుంది, యీ వ్యవహారం చూస్తే" అన్నాడు తాతయ్య.

"మనవాళ్ళ సంపాదన రోజుకి రెండు డాలర్లు అయినపుడు, అందులో ఒకటిన్నర డాలర్లు వుండేందుకు యిచ్చి, యింక ఏం తింటాడు?" అని ప్రశ్నించాడు మిస్టర్ హాడ్లే.

"ఎబ్బే, పనివాళ్ళకి యిప్పుడంటే రెండు డాలర్లుగానీ మునుపు ఒకడాలరేగా" అన్నాడు తాతయ్య.

"పరిశ్రమదారులు పనివారికి ఆ ఒక్కడాలరూ యిష్టపడి యిచ్చారనుకోకండి. జీవన ప్రమాణం పెరిగిపోడంతో గత్యంతరం

తోచక, రెండు డాలర్లకి వొప్పుకున్నారు. యింకా కొన్నాళ్ళుపోతే మూడు డాలర్లుకూడా యిస్తారు."

పనివాళ్ళకి మూడు డాలర్లు యివ్వడమంటే తాతయ్యకి దారుణంగా తోచింది. "మనిషికి మూడేసి డాలర్లు యిచ్చి పని చేయించుకోడంకంటే, యూరప్‌నుంచి పనివాళ్ళని తెప్పించుకోడం తేలికేమో !"

"ఇన్నాళ్లబట్టీ మనం చేస్తున్నది అదేగా! అమెరికాలోని వారికి తమ ఆర్థిక సమస్యలూ కార్మిక సమస్యలూ తెలుసుకోగల వివేకం లేనన్నాళ్ళూ యీబాధ తప్పదు" అన్నాడు మిస్టర్ హాడ్లీ.

తాతయ్యకి యీమాదిరి సంభాషణ యిష్టం వుండదు. ఈ ప్రకారం మాటాడటం సోషలిజమనీ, సోషలిజమ్ మనుషులకి మంచిదికాదనీ తాతయ్య అభిప్రాయం.

రూముల ధర ఎంత పెరిగినా, ఆహారవస్తువుల ధర ఎంత పెరిగినా, న్యూయార్క్ నగరానికి రాదలుచుకున్న మనుషుల సంఖ్యమటుకు తగ్గలేదు. ప్రతి సాయింత్రమూ ఫిఫ్త్ ఎవెన్యూ ఏదో సంబరంలా వుండేది. ఫిఫ్త్ ఎవెన్యూలోని గాజు కిటికీల వెనకాల ఎడ్మిరల్ డ్యూయీకి యివ్వనున్న బహుమతులన్నీ ప్రదర్శింపబడి వుండేవి. ఆ బహుమతుల మొత్తాన్నిచూసి, ఎడ్మిరల్ యివన్నీ యింటికి తీసుకెళ్ళేందుకు, రెండుబళ్ళు కావాలి అని నవ్వుకునే వారు మనుషులు.

విజయోత్సవ ప్రదర్శన మరునాడు అనగా, అంతక్రితం రోజున హడ్సన్ నదిలో అత్యద్భుతమైన నౌకాప్రదర్శన జరిగింది. నౌకాదళానికి చెందిన వేరువేరు నౌకలు, బారులుతీర్చి, రేవువైపుగా రాసాగాయి. ఈ ప్రదర్శన ప్రాంగణాన జె. పి. మోర్గన్ విహారనౌకా (Yacht), సర్ థామస్ లిప్టన్ విహారనౌకా వుండి, అవి ముందు దారితీశాయి. ఆ కోటీశ్వరుల సొంతనౌకల వెనక అమెరికన్ యుద్ధ నౌకలయిన అయోవా, యిండియానా, మెసచూసెట్స్, వొరెగాన్, టెక్సాస్, - వీటితో క్రూయిజర్సయిన, న్యూయార్క్, బ్రూక్లిన్ కూడా వున్నాయి. ఈ నౌకలన్నీ ఒక పంక్తిగా నది ఎగువగావచ్చి జెనరల్ గ్రాంటు సమాధికి ఎదురుగా, అద్భుతమయిన వందన సమర్పణచేశాయి. ఒక్కొక్క నౌకా, వందనసమర్పణ చేస్తున్నపుడు మా కాళ్ళకిందనున్న నేల దడదడలాడి, మాకు వొణుకు పుట్టేది. ఇటువంటి నౌకలు ఆ స్పానిష్ బలాన్ని ముక్క ముక్కలుగాచేసి గిరవాటు వేశాయంటే ఆశ్చర్యమేముంది!

మేమందరమూ ఆ దృశ్యాన్ని చూసి, అమితానందం పొందుతున్నాము, అదొక పర్వదినం మాపాలిట. కాని ఆ మధ్యాహ్నం మా చుట్టల షాపులోకి వచ్చిన హడ్లీ మటుకు నిరుత్సాహం వెలిబుచ్చాడు. "అమెరికా యుద్ధదళాన్ని, యీ భాగ్యవంతుల నౌకలు వెంటవుండి ఎందుకు పట్టుకురావాలో?"

"అది గౌరవసూచకం" అన్నాడు మా తాతయ్య.

"భాగ్యవంతులైనంతమాత్రాన, నౌకాదళం, వారిని గౌరవించవలసిన పనిలేదు. అమెరికా నౌకాదళం కోటీశ్వరులదే కాదు,

ప్రజలదికూడా. ఎడ్మిరల్ డ్యూయీ యీ తెలివితక్కువపని చేసి వుండకూడదు. నౌకాదళం ప్రజలది. ఆసంగతి విస్మరించి, కోటీశ్వరులకి ఎక్కువ స్థానమివ్వటం పొరబాటుపని."

మిస్టర్ హాడ్లీకి యీ విషయంలో యెందుకనో చాలా కోపంగా వుంది. ఆరోజున పైపు తెగకాల్చాడు. ఎందుకనో అతనికి ప్రపంచంమీద కోపంగా ఉంది.

మిస్టర్ హాడ్లీలాటివారు ఏ మనుకుంటేనేం, ఆ రాత్రి మా నగరవీధులు జనసందోహంతో, ఆనందోత్సవంలో మునిగిపోయాయి. సముద్రప్రయాణంచేసిచేసివచ్చిన నావికులు, పట్టణంలోకివచ్చి మాతోకలిసిపోయారు. ఆ పాటలూ, ఆ డాన్సులూ, ఆ కేరింతాలూ చెప్పనలవికాదు. కొన్నిచోట్ల కొట్లాటలుకూడా జరిగాయట. జరిగితేనేం గాక అదొక సంతోషసాగరం.

మరుసటిదినం, నేను రోజూకంటె కొంచెం తొందరగాలేచాను. మా కాడెట్లందరం స్కూలు భవనందగ్గిర సమకూడాము. మాకోసమని అలంకరించబడ్డ ఒక బండీలోఎక్కి విజయోత్సవ ప్రదర్శన జరిగేచోటుకి బయలుదేరాము. మా బండీకి బెల్జియమ్ గుర్రాలుకట్టారు. ఆ బెల్జియమ్ గుర్రాలకి ఎరుపూ, తెలుపూ, నీలం రంగు టోపీలు ధరింపజేశారు. మా 'వాగన్'నికూడా ఎరుపూ, తెలుపూ నీలంరంగుల్లో పెయింట్ చేశారు.

ఇంకా వెల్తురెక్కడా రాలేదు. పక్కవీధిల్లోనించి మను షులు గుంపులుగుంపులుగా మెయిన్‌రోడ్లమీదకి వస్తున్నారు. ప్రతి ఒక్కరూ వారివారి యూనిఫారమ్స్ ధరించివున్నవారే. ఆర్మీ యూనిట్లూ, నేవీయూనిట్లూ, సివిల్‌వార్ వెటరన్స్, నేషనల్‌గార్డ్సు సభ్యులూ, నావికాదళం, పబ్లిక్‌పాఠశాలలనుంచీ ప్రయివేటుపాఠ శాలనుంచీవచ్చిన విద్యార్థులూ, వెస్టుపాయింట్ కాడెట్‌లూ, ఇతర మిలటరీపాఠశాలలనుంచివచ్చిన కాడెట్లూ అందరూ ప్రదర్శన స్థలం వైపుగా వెళ్తున్నారు.

మా కెప్టెన్ రీన్‌హార్టు, బండి నడుపుతున్నవారికి, మా బండీని పెద్దవాళ్లకి మరీ దగ్గిరగా కాకుండా, కొంచెం దూరంలోవుంచమని ఆజ్ఞాపించాడు. మాతోపాటు ఏభైఒకటో వీధిలోని కాడెట్సుకూడా తయారయారు, వాళ్లడ్రస్సూ వాళ్లటోపీలు చూడ్డానికి అంత బాగాలేవు.

మా బండీ ఎన్నోగంటలు ప్రయాణం చేసినమీదటగాని డ్యూయీ ఆర్చిని (ఎడ్మిరల్‌డ్యూయీకి గౌరవవందనం సమర్పి స్తున్నప్రదేశం) చేరుకోలేకపోయాం. అప్పటికే మేము బాగా అలిసి పోయాం. తలలు పైకెత్తి ముఖాలు సూటిగావుంచి మాకు చేత నైనంత అందంగా ప్రదర్శన ప్రారంభించాం. మేము గేట్లదగ్గరకు వచ్చేసరికే, అక్కడ ప్రజలు కిక్కిరిసివున్నారు. అక్కడ అనేక మంది పెద్దపెద్దవాళ్లందరూవున్నారు. 'పి. యస్. పద్దెనిమిది' కాడెట్లమయిన మేము ఏదోవిధంగా చొచ్చుకుని లోపలికిప్రవేశించా లనుకున్నాం. పెద్దపెద్ద టోపీలుధరించినవారూ, పెద్దపెద్ద వుద్యో

గులూ చాలామంది ఆ ప్రవేశ స్థలందగ్గిర యిటూఅటూ హడా వుడిగా తిరుగుతున్నారు. అంతమందిలో ఎడ్మిరల్ డ్యూయీ ఎవరో మాకు తెలిసిందికాదు. ఆయనెవరో మాకు తెలియకపోయినా, మమ్మల్ని ఆయన చూసివుంటాడని అనుకున్నాం.

ఈ శుభదినంకోసం, యీ ఆనందసమయంకోసం మేము ఎంత కాలంబట్టో ఎదురుచూశాం. ఆ సువర్ణఘడియ యిట్టే అయి పోయింది. మేము బాగా అలిసిపోయాం. కడుపులో ఆకలిమండి పోతోంది, మమ్మల్ని తీసుకొచ్చిన ఆ గుర్రపుబగ్గీ బయటవుంది గనకగానీ లేకపోతే మేము ఏమైపోదుమో. ఆకలి అలసటతోపాటు కొంచెం విచారంగా కూడావుంది. విక్టరీపేరేడ్ అంటే యుద్ధ పరి సమాప్తి. యుద్ధం అయిపోయిందంటే, యిక ప్రపంచమెప్పుడూ హాయిగా, శాంతియుతంగా జీవిస్తుంది. శాంతికాలంలో మాకు కవాతు ప్రదర్శనకి సావకాశంవుండదుకదా! ఈ మార్చింగూ డ్రస్సులూ మూలపడినట్లే యిక! ఘనకార్యాలు చేదామనుకున్న మమ్మల్ని లోకమేదో మోసగిస్తున్నట్లుగా బాధపడ్డాం, కాని పొర బాటుమాదే. మేము అనుకున్నట్లు, శాంతి కలకాలం నిలవలేదు. యింక మా జన్మలో యుద్ధమే జరగదేమో అనుకున్నాం - అలా కాలేదు. ఆ మహారాణీ ధర్మమా అని, చైనాలో యుద్ధజ్వాల అందు కున్నది.

ఒకరోజున ఆ చైనా మహారాణి, యింతదాకావచ్చినవాళ్ళు చాలు, యిక పెకింగ్‌నగరపుగేటు మూసెయ్యండి - అన్నదిట. ఆ

పలుకులు మాకు మరోవిధంగా అర్ధమయాయి. పెకింగ్‌నగరం లోని తెల్లవాళ్లనందరినీ బోనులోపెట్టేశారు; అక్కడి శ్వేతజాతీయు లందరూ ఎలకల బోనులోకి మల్లే యిరుక్కుపోయారు; ఆ లోపల వున్నవారి నందరినీ సఫా సఫా నరికేస్తారు - అనుకున్నాం.

ఈ దుర్వార్తని మా పత్రికలున్నాయే అవి మాకు ఎంతోరస వంతంగా అందచేశాయి. నిజానికి పెకింగ్‌లో ఏమీ జరుగుతోందో ఎవరికీతెలియదు. కాని యేమి జరగడానికి అవకాశముందో ప్రతి పత్రికా పెద్దక్షరాల్తో ప్రచురించేది. చైనీయులమీద మా ఆగ్రహాన్ని పురిగొల్పడ్డానికి, పాపం, పత్రికలు ఎంతగానో శ్రమించాయి. రోజూ బ్రహ్మాండమయిన పతాకశీర్షికలే. నల్లంచు బోర్డరులూ, ప్రత్యేకసంచికలూను. మేము నీటి అంచునకూచుని, దూకడం ఎప్పుడాఎప్పుడా అని ఎదురుచూస్తున్నాం.

చిట్టచివరికి ఆ వార్త రానేవచ్చింది.

ఒక సంరక్షకసేన (Rescue Party) చైనా వైపుగా వెళ్తోం దన్నారు. ఆ సేనలో రెండువేల అయిదువందలమంది అమెరి కనులూ, మూడువేలమంది బ్రిటిషర్లూ, ఎనిమిదివందలమంది ఫ్రెంచివారూ, ఎనిమిదివేలమంది జపనీయులూ, వున్నారన్నారు. ఈ మొత్తం పార్టీఅంతా తలుపులుమూసేసిన పెకింగ్‌వైపుగావెళ్ళి, అక్కడితలుపులు తెరిపిస్తుందిట. యీ సేనవెళ్ళి లోపలవున్న వాళ్లని ఎలా రక్షించగలదో మా కెంతకీ అర్థమయి చావలేదు. మా చుట్టలకొట్లోకొచ్చిన ప్రతి వొక్కరికీ యీవిషయమ్మై, ఒక్కొక్క అభి ప్రాయంవుండేది.

"చైనావారికి బాక్సింగేమి తెలుసు?" అని అడిగాడు ఒకతను.

మిసెస్ లియరీ అంది: "అబ్బో చైనావారు పరమదుర్మార్గులు. అంత క్రూరులు మరొకరువుండరు. వారి దేశంలోని హింసావిధానంవంటిది, ఆఖరికి ఆ నరకంలోకూడా లేదుట. చూడండి, నే నీనాడు చెప్తున్నాను, యీ సోల్జర్లువెళ్ళి బయట తలుపులదగ్గిర దేవుళ్ళాడుతూవుంటే, చైనీయులు, లోపలున్న తెల్లవాళ్లందరినీ చిత్రవధచేస్తారు. అబ్బో, చైనాగోడఅంటే సామాన్యమైనదనుకున్నారా?"

అనుకున్నంతసేపు పట్టలేదు. బాక్సరువిప్లవం సద్దుమణిగిపోయిందన్నారు. కొద్ది రోజుల్లోనే అంతా చల్లబడిపోయింది. తిరిగీ శాంతియుత పరిస్తితులు ఏర్పడ్డాయి.

నిజానికి పెకింగ్‌లో ఏంజరిగిందో మా కెవరికీతెలియదు. మా వార్తాపత్రికలిచ్చే సంగతులు ఒకదాని కొకటి సందర్భం లేకుండావుండేవి. ఇది అయిపోయిన చాలానెలల తరువాత బఫెలో బిల్ (Buffalo Bill) తన సర్కస్‌తో మా వూరువచ్చేదాకా, మాకా విషయం అర్థం కానేలేదు.

బఫెలో బిల్ అసలుపేరు విలియమ్ ఎఫ్. కోడీ. అతను ఒక తెల్లగుర్రాన్నెక్కి 'ఎరీనా'లోకి రావడంతో సర్కస్ ప్రారంభమయేది. దీన్నిపూర్తిగా సర్కస్ అంటానికికూడా వీలులేదు. వైల్డ్‌వెస్టు షో (Wild West Show). బిల్‌కి చిన్నగడ్డంవుండేది. బక్

స్కిన్ (జంతుచర్మం)తో కుట్టినకోటు వేసుకునేవాడు. పంట్లాము కూడా అటువంటిదే వేసుకునేవాడు. ఈ కోటుకీ పంట్లాముకీ కూడా చివరిని లేసులుండేవి. అతనుచేతిలో టోపీపుచ్చుకు, ఆ తెల్లగుర్రంఎక్కి 'ఎరీనా'లోకి రాగానే ప్రేక్షకులందరూ దడదడ చప్పట్లుకొట్టేవారు. అతనివెనక వింతదుస్తులు ధరించిన రెడ్ యిండియనులూ, విలువిద్యలో నేర్పరులైన 'కవ్‌బాయ్‌సూ' పొట్టిగౌనులు వేసుకునే 'కవ్ గరల్సూ' ఎరీనాలో ప్రవేశించేవారు.

అనేకపాటలూ వివిధప్రదర్శనలూ అయాక, కస్టర్స్ లాస్ట్ ఫైట్ (Custer's Last Fight) అనే ప్రదర్శననికూడా యీ బిల్ చూపుతూండేవాడు. దానిద్వారా బాక్సర్ రెబిలియన్ అనగా ఏమిటో మాకు కొంతలో కొంత బోధపడింది.

ఎరీనాలోనూ మేము కూచున్నచోటా, దీపకాంతిని తగ్గించేవారు. ఎరీనాలో యించుమించు చీకటిగానేవుండేది. సన్నని సంగీతంమటుకు మాకు వినిపింపచేస్తూండేవారు. మళ్ళీ లైట్లువేసి, ప్రదర్శన ప్రారంభించేసరికి, ఎరీనాలో ఒక పెకింగ్‌గోడా, చైనా వారియిళ్ళూ మొదలైనవివుండేవి. ఆ గోడమీద సిల్కువిమాండరిన్‌కోట్లువేసుకున్న పచ్చ సిపాయీలు, యిటూఅటూ కాపలా తిరుగుతూండేవారు. వారిచేతుల్లో గొడ్డళ్ళుండేవి. ఆ సిపాయిల పిలకలు (Pigtails) చాలా పొడవుగావుండేవి. నల్లమందు భాయీలవడంచేత వాళ్ల ముఖాలుకూడా ఏదో భయంకరతతోపిస్తూండేవి. అదృశ్యం కనిపించాక, మళ్ళీ లైట్లు ఆరిపోయేవి. తరువాత

దృశ్యమేమిటా అని మేము ఎంతో ఆదుర్దాతో ఎదురుచూస్తూండే వారము. అది రాత్రివేళ, వుద్యానవనం ఎంతో ప్రశాంతంగావుంది. ఆ అర్ధరాత్రి ప్రశాంతతని, దూరంనుంచి వినబడే యుద్ధ శంఖా రావం భగ్నపరుస్తుంది. ఆ తరువాత బాండ్‌ధ్వనీ, గుర్రపు డెక్కల చప్పుడూ. అనగా అమెరికనులు వస్తున్నారన్నమాట. ఆ శత్రు ప్రదేశంగుండా వెళ్తున్నపుడు ఒకస్కౌటు ముందువెళ్ళిచూస్తాడు. అతను గుర్రందిగి గుర్రాన్ని తనవెంట నడిపించుకుంటూ, వొంగి నడుస్తాడు. ఒకగుర్తు దగ్గిరకొచ్చాక, అతను తల వెనక్కితిప్పి, వెనకనున్న వాళ్లకి రమ్మనమని సౌంజ్ఞచేస్తాడు.

అక్కడితో హాలులోని మ్యూజిక్ పెరుగుతుంది. గుర్రపు డెక్కల చప్పుడు మరింత వినిపిస్తుంది. గోడమీద వున్న చైనా సిపాయిలు దానంతకీ అర్థం తెలియనట్లు ఖంగారుపడుతారు. అసలే మత్తు మనుషులవడంవల్ల యీ ఖంగారులో వారికి పూర్తిగా మతిపోతుంది. పెకింగ్‌నగరంలోని మనుషులు వివేకాన్ని కోల్పో యారనీ, నైతికపతనం అంతవరకూ దిగజారిందనీ, చెప్పేందుకు యిది సూచనట.

అమెరికన్ సోల్జరు యుద్ధరంగంలో ప్రవేశించగానే చైనీ యులు కంగారుపడతారు. ఆ అమెరికన్ సోల్జరు ఒక సిల్కు పతా కాన్ని చేత పుచ్చుకొని, 'స్పాట్‌లైట్' అతనిమీద పడుతూండగా గుర్రంమీద అతివేగంగా వస్తాడు. అమెరికాదేశపు పతాకంమీద కాంతి కేంద్రీకరింపబడటంతో ప్రేక్షక సమూహం దడదడ చప్పట్లు కొట్టి జయనాదాలు చేస్తారు.

అమెరికా పతాకాన్ని చూసినమీదటగాని నల్లమందు భాయీలకి అసలు విషయం బోధపడదు. అప్పుడు చైనీయులు సహాయం కోసమని బొబ్బలుపెడతారు. మతిపోయిన వాళ్ళవలె యిటూ అటూ పరుగులెడతారు. వాళ్ళ ఖంగారుతోపాటు హాలులోని సంగీత వాయిద్యమూ, గుర్రపు డెక్కల చప్పుడూ నిముష నిముషానికీ తీవ్రతరమవుతాయి. నెమ్మదిగా పాక్కుంటూ చైనా గోడవైపుగా వచ్చే అమెరికన్ సోల్జర్లు కనిపిస్తారు. అప్పుడు కాపలా సిపాయిలు యింక యిది పనికాదనుకొని, గొడ్డళ్ళు పారేసి, తుపాకులు చేత పుచ్చుకు, గబగబా పేల్చటం మొదలుపెడతారు.

చటుక్కున మ్యూజిక్ నిల్చిపోతుంది. ఎందుకంటారేమో, ఆ యుద్ధధ్వనులు మనం వినేందుకు! చైనీయుల తుపాకీ పేల్పులకి జవాబుగా అమెరికన్‌లు కూడా పేల్చటం మొదలుపెడతారు. ఒక్కొక్క చైనా సోల్జరు గోడమీదనుంచి వెనక్కి పడిపోతూంటాడు.

హాలులో వారు "మరొకడు పడిపోయాడు," అని చెవుల్లో చెప్పుకు ఆనందిస్తారు.

"అదిగో మరింకొకడు పడిపోయాడు." గోడమీద సిపాయీలు ఒకరొకరుగా వెనక్కి పడటంతో అమెరికన్ పతాకాన్ని ఘనంగా పుచ్చుకు అశ్వికసేన రంగంమీదకి ప్రవేశిస్తుంది. వారు గుర్రాలు దిగి, గోడ ఎక్కడం ప్రారంభిస్తారు. చైనా గోడ ఎక్కడమంటే మాటలా? పైనున్నవాళ్ళు వీరిని అవలీలగా కిందకి తోసేస్తూంటారు.

అమెరికనులు, సర్కస్‌కంపెనీలో పిల్లిమొగ్గలు వేసే వారికి మల్లే, ఒకరి భుజాలమీద ఒకరు పిరమిడ్‌వలె నిలబడిపోతారు. అందరూ అలా నుల్చోడమయాక, ఆ నుంచోడం గోడ ఎత్తు అంతవచ్చాక, అమెరికా పతాకాన్ని, అడుగునుంచి పైకి పంపుతారు. పైనున్న అతని చేతులో అమెరికాపతాకం కనిపించగానే, చైనీయులు వీరిని కాలుస్తారు. అప్పుడు పతాకం కిందబడిపోతుంది. అప్పుడీ కింద బడ్డ పతాకాన్ని మళ్ళీ అతి జాగ్రత్తగా యీ సైనికులపంక్తి మళ్ళీ పైకి తీసుకు వెళ్తుంది. ఆ చేతినించి ఆ చేతికి అందివ్వడంతో అమెరికాపతాకం చైనా గోడంత ఎత్తూ ఎక్కి, అక్కడ దిగ్విజయ సూచకంగా ఎగరడంతో ప్రేక్షకుల వెర్రి సంతోషం మిన్ను ముట్టు తుంది. చెవులు చిల్లులు పడేటట్లు చప్పట్లు కొట్టేస్తారు.

ఈ కరతాళ ధ్వనులవల్ల కాబోలు అమెరికనులకి నూతన ధైర్యం కలుగుతుంది. ఒక వంక పతాకాన్ని నిలబెట్టడానికి ప్రయత్నం జరుగుతూండగా, మిగతా వైపులనుంచి పది పదిహేను గురు అమెరికన్ సోల్జరులా గోడపైకి ఎగబ్రాకుతూంటారు, పచ్చటి సిల్కుకోట్లు వేసుకున్న చైనీయులు. వీరిని నిరోధించడానికి ప్రయ త్నిస్తారు గాని, యీ అమెరికనులలో కొందరు గోడ వెనక్కి దూరి, కోట తలుపులు తెరిచేందుకు ప్రయత్నం చెయ్యబోతారు.

చివరికి కోట తలుపులు తెరవబడుతాయి. కోట తలుపులు తెరుచుకోవడంతో అమెరికా జాతీయగీతంతో బాండ్ వాయిద్యం ప్రారంభమవుతుంది. ఇంగ్లీషు పటాలమూ, ఫ్రెంచి పటాలమూ, జపాన్ పటాలమూ, వారి వారి పతాకాలతో, యుద్ధ భూమిలోకి

ప్రవేశించి, రెండు తఫాలు విజయప్రదర్శన చేస్తారు. ఏ సింహం ద్వారం దగ్గిరైతే అమెరికన్‌పతాకం ఎగురుతోందో, ఆ ద్వారం లోంచి యీ సేనలు పెకింగ్‌నగరంలోకి చొరబడతాయి.

ఆ చివరిదృశ్యం ప్రదర్శిస్తున్నపుడు ప్రేక్షకులలో చెలరేగే, వెర్రి కేకలూ, ఆనందమూ, కరతాళధ్వనులూ, వినలేక చెవులు చిల్లులుపడతాయి. చూస్తున్న వాళ్లందరికీ ఆ బ్రహ్మాండమయిన విజయం తమదేనన్నట్లుగా భావన కలుగుతుంది. బాక్సర్ రెబిలియన్ ఏ విధంగా జరిగిందో, మాకు ప్రత్యక్షంగా చూపెట్టింది యీ వైల్డ్ వెస్టుషో.

నాకు అంతరాంతరంలో చైనా మహారాణీని ఒక్కసారి చూస్తే బాగుండుననిపించింది. కోటానుకోట్ల ప్రజలవూహాజగతిలో నివసించే యీ మహారాణి, యీ విప్లవసమయంలోనైనా, ఆ పెకింగ్ గోడమీద ఒక్కసారి దర్శనమీయకూడదా అని నాకుండేది చెప్పొద్దూ! కాని, మళ్ళీ నాకు నేను సరిపెట్టుకున్నాను. ఒక మహారాణీని యిలా తుపాకీలు పేల్చే చోటికి రప్పించడం, అంత మంచిదికాదు; విక్టోరియా మహారాణి బోయర్ యుద్ధం జరుగుతున్నపుడు దక్షిణాఫ్రికా వెళ్ళింది గనకనా ఈ చైనామహారాణిని పెకింగ్ గోడమీదకి వచ్చి నుంచోమనేందుకు?

బఫెలో బిల్ ప్రదర్శనం బాక్సర్ విప్లవం గురించి మాకు ఎంతో స్పష్టంగా చెప్పేసింది. ఏ చరిత్రపుస్తకమూ యింత చక్కగా విడమరచి చెప్పలేదు. ఒకవేళ చారిత్రకంగా యీ సంఘటన

యిలా జరిగివుండకపోయినా, మేము అంగీకరించే స్తితిలో లేము, బఫెలో బిల్ చూపించిన విధంగానే బాక్సర్ విప్లవం సంభవించి వుంటుందని మా నమ్మకం.

బాక్సర్ విప్లవం, బఫెలో బిల్ ప్రదర్శనా పంథొమ్మిది వందల్లో జరిగాయి. పద్దెనిమివందల తొంభై తొమ్మిదితో ఆ సంవత్సరం అంత మవడమే కాకుండా, అ శతాబ్దం అంతమవుతోంది. పంథొమ్మిది వందల్తో యిరవయ్యో శతాబ్ది జన్మిస్తోంది. కొందరు సనాతనవాదులు ముప్పై ఒకటీ పన్నెండు పంథొమ్మిది వందల్తో (31-12-1900) గాని, పంథొమ్మిదో శతాబ్దం పూర్తికాదని, వాదించసాగారు. కాని జనబాహుళ్యం ఒకటీ, ఒకటీ, పంథొమ్మిదివందల్లోనే (1-1-1900) నూతన శతాబ్దం ప్రారంభమవుతుందనీ, అనాడే పండుగ చేసుకోడం బాగుంటుందనీ అభిలాషపడింది. ఒక శతాబ్దమంతరించి, మరొక శతాబ్దం జన్మించడమంటే, అది సుళువుగా అయే పనికాదు. సృష్టికాంతకి ప్రసవవేదనవంటిది. నా కప్పుడు సరిగా తొమ్మిదేళ్ళు, మతగురువులూ, జ్యోతిష్కులు, ముప్పై ఒకటీ పన్నెండూ, పద్దెనివందల తొంభై తొమ్మిదితో (31-12-1899) యీ ప్రపంచం అంతరించడం ఖాయమని, మానవజాతి యిరవయ్యో శతాబ్దాన్ని చూడగలగడమన్నది, అసంభవమైన విషయమనీ, నిష్కర్షగా చెపుతూండేవారు. అయితే మా వాళ్ళు దూరదేశాలకి పోయి విజయం సాధించుకుని రావడం, ప్రపంచంలోని మూల మూలలూ చుట్టి రావడం, మిగతా ప్రయత్నాలూ యివన్నీ వృథా

యేనా? కొత్త శతాబ్ది అవతరించడంతో యివన్నీ నాశనం కావల సిందేనా? రానున్న మహోపద్రవం గురించి మతగురువులకి ఎటు వంటి సంశయమూ లేదు. ప్రపంచం యిప్పటికే పాపపంకిల మయిందిట. ఈ లోకం నాశనమవడం గురించి, బైబిల్‌లో స్పష్టంగా రాసి వుందని, ఆ వాక్యాలు చదివి వినిపించేవారు. జోతి ష్కులు ఆకాశాన్నీ, నక్షత్రమండలాన్నీ పరికించి, జ్యోతిష్శాస్త్రం కూడా యిదే విషయాన్ని వెలిబుచ్చుతోందని వక్కాణించేవారు.

ఎటొచ్చీ ఆ రానున్న మహోపద్రవం ఏ విధంగా వస్తుం దన్న విషయంమీద మాత్రం ఏకాభిప్రాయంవుండేదికాదు. కొందరు ఉపద్రవం మంటలద్వారా వస్తుందన్నారు. కొందరు బ్రహ్మాండ మయిన వరదవచ్చి, యీ లోకమంతా కొట్టుకు పోతుందన్నారు. నక్షత్రాలు పరిశీలించి చెప్పేవారు మాత్రం మరొక కొత్త పద్ధతి సూచించారు. సూర్యుని చుట్టూ తిరుగుతున్న యీ భూమి, అమాంత్రం పట్టాలు తప్పిన రైలు బండీలా అయి, అటు సూర్య మండలంలోకి వెళ్ళి కొట్టుకోనైనా కొట్టుకోవచ్చు, యిటు అనంత విశ్వంలోకి జారి ఒక్కసారి వుల్కలా పేలిపోనైనా పోవచ్చు, అని అన్నారు.

ఈ విషయాలన్నీ, ప్రతిదినమూ, వార్తా పత్రికల్లో పడుతూం డేవి. వార్తా పత్రికలు, వీటిని పెద్ద టైపులో వేయించి, యిటువంటి వార్తలకి తగు ప్రాముఖ్యత నిచ్చేవి. ఊళ్ళో ప్రతివాళ్ళూ యీ విషయం గురించే మాట్లాడుకునే వారు; నాకు యీ మాటలువిన్న కొద్దీ హడలెత్తిపోయేది. ప్రపంచానికి చివరి రోజులు వచ్చేశాయి–

అని ఎవరైనా అంటే సరి, చెవులు నిక్కబొడుచుకుని వినేవాడిని. ఆ మాటలు వింటున్న కొద్దీ కళ్ళు వాటంతట అవే పత్తికాయ లంత అయేవి. ఈ సంగతులు వారెంతో సీరియస్‌గా మాట్లాడే వారు. అంత నమ్మకంగానూ నిజాయితి వొలకబోస్తూనూ మాట్లాడే సరికి, అదంతా నిజమే కాబోలు అనుకునేవాడిని. మీరు నావిషయ మాలోచించండి. యింకా పదో ఏడు కూడా రాలేదు. ఇంత చిన్న తనంలో చనిపోడమంటే ఎంత కష్టంగా వుంటుందో చెప్పండి. పోనీ, చనిపోయినా ఫరవాలేదు. ఒక్క గొప్ప పనేనా చేసి చనిపో వాలి. ఇట్లా అనామకంగా ఏ ఘనకార్యమూ చెయ్యగల అవకాశ మైనా లేకుండా చనిపోమంటే, ఎవరికి మాత్రం ఏడుపు రాదూ? కాని యీ ప్రపంచమే అంతమయి పోతుందంటున్నారాయె!

న్యూయార్క్‌లో నాకు మల్లేనే చనిపోడానికి యిష్టంలేని వారు మరి కొందరున్నారు. అంతము తప్పని సరి అయినప్పటికీ, విధిని ఏ విధంగా ఎదుర్కోగలమా అనే విషయమై, ఒక పథకం వేయ బూనాము. నాలాటివారు మరికొందరున్నారనే వార్తను కూడా పత్రికలే ప్రచురించాయి. వారు అనుకోడము యేమిటంటే సృష్టి కాంత ప్రసవవేదన కాబట్టి కొత్త శతాబ్దం జన్మిస్తున్నపుడు ఉప ద్రవాలు ఎలానూ తప్పవు: ప్రపంచం మొత్తంమీద ఎలానూ నాశన మవదు, చాలాభాగం నాశనమయిపోడం మట్టుకు ఖాయం. చావగా మిగిలిన పదిమందీ, జరిగిన ఉపద్రవంనుంచి గుణపాఠం నేర్చుకోవలసివుంటుంది. మానవజాతిని తుడిచిపెట్టెయ్యడానికి వచ్చే వుపద్రవం, మానవులందర్నీ నాశనం చెయ్యదు. కొందరిని మాత్రం మిగిల్చి, చూశారా తప్పుడు పనులు చేస్తే ఎటువంటి పరి

ణామాలకిలోనుకావలసివస్తుందో - అన్నట్లుగా వారికి పాఠం చెబుతుంది. ఒక వుప్పెన రావచ్చూ, ఒక భూకంపం రావచ్చూ, కాని ఏదో ఒకటి రావడం మటుకు నిజం. నూతన శతాబ్ద జననాన్ని చూడటానికి ఆ వుపద్రవంనుంచి కొందరు బయటపడటం కూడా నిజమే - అన్నారు వీరు.

మా తాతయ్యలాటివారు యిదంతా అబద్ధం అనేవారు. కాని వారి వాదనలో పటిమలేదు. ఎంచేతనంటే, వారు బైబిలునూ కాదనీ, నక్షత్రగతినీ కాదని వాదించి ప్రయోజనమేమిటి? నన్ను వూరుకోపెట్టేందుకు ఏవో వుపశమనవాక్యాలు తాతయ్య చెబుతున్నాడనే నాకు అనిపించేది. లోకమంతా యీ విషయం ఎలుగెత్తి చాటుతూండగా, మా తాతయ్యలాటివారు కాదంటే మటుకు ఎలా? అంతమంది ఏకకంఠంతో అంటున్నది అబద్ధమవుతుందా?

నేను ఒక కాయితం ముక్కమీద, పంథొమ్మిదివేసి రెండు సున్నాలు చుట్టాను. ఆ అంకెలవంక చూస్తున్న కొద్దీ నాకే భయం భయంగా తోచింది. ఆ అంకెలు, ఏవో తేళ్ళూ, పాముల్లా కనిపించాయంటే నమ్మండి.

ఇటువంటి విపత్తులు యింతకి పూర్వం అనేకం జరిగాయని డాక్టర్ కెయిరాన్ మాకు చెప్పారు. అంటువ్యాధులు, అగ్నిభీతి, వరదలు, భూకంపాలు, యిలాటివి అనేకం జరిగాయని బైబిలులోని కథలు చెబుతూనేవున్నాయి కద! రోజులు గడుస్తున్న కొద్దీ, డిశంబరు నెల చివరి కొస్తున్న కొద్దీ నాలోని భయాందోళనలు ఎక్కువయాయి.

ఈ ప్రపంచం ఏ తేదీన అంతం కానుందో వార్తా పత్రికలు ప్రచురించేశాయి. ప్రజలు సేవింగ్స్ బాంకుల్లో వున్న డబ్బంతా తీసుకు మంచినీళ్ళప్రాయంగా ఖర్చుపెట్టెయ్యసాగారు - ఎవరికి వారు తమ చివరి రోజు సుఖంగా గడిపెయ్యాలని! మా చుట్టల షాపులో కొచ్చేవారిలో కొందరు 'అఖరి రోజుల విషయమై' ఎటువంటి యేర్పాట్లు చేసుకుంటున్నదీ కూడా చెప్పేవారు. యింకెన్నాళ్ళో లేదు కాబట్టి ఖరీదుగల చుట్టలు యివ్వమన్నాడు ఒక ఫైర్‌మన్. ఆ వుపద్రవం వేళ, ఘాటైన చుట్ట కాల్చుకుంటూ కూచుంటే కొంతలో కొంత మేలట. మరొకతను ఒక పెట్టెడు చుట్టలు తీసుకెళ్తూ 'కష్టసమయంలో తలొకటీ పంచి పెట్టేందుకు పనికొస్తాయి' అన్నాడు.

ఇక మా మిసెస్ లియరీ అంది: "యీ ప్రపంచంలో దుర్మార్గం పాపం ఎక్కువయిపోయాయి. అంచేత భగవంతుడు యీ ప్రపంచాన్ని శిక్షిద్దామనుకున్నాడంటే, ఆశ్చర్యపడవలసింది యేమీ లేదు. ఎటొచ్చీ చెడ్డవాళ్ళతోపాటు మంచి వాళ్ళను కూడా కలిపేస్తున్నాడే అని కొంచెం బాధగావుంది. ఏమైనా మా ఆయనని న్సా తగ్గించమనాలి. భగవంతునికి ప్రార్థన చెయ్యమని కొంచెం గట్టిగా చెప్పాలి" అంటూ చిటిగెడు ముక్కు పొడుం ఘాటుగా పీల్చి పెద్ద తుమ్ము తుమ్మింది.

"భగవంతుడు నిన్ను రక్షించుగాక" అన్నాడు తాతయ్య.

"నా వొకర్తెనే ఎందుకు? మన అందర్నీ రక్షించాలి. యీ దెబ్బతో అయినా మా ఆయన తాగుడు తగ్గిందా బతుకుతాను. యీ

సంగతి చూశారూ, యింత వుపద్రవం రానున్నదనే విషయం కూడా తెలియదు మా అయనకి. ఎప్పుడూ అంత నిషాలో వుంటే కష్టం గదా !"

ఫిడేళ్ళు తయారుచేసే ష్మిట్జ్, తాతయ్యా పక్షం వహించాడు. "ఎబ్బే, అల్లాటిది ఎన్నటికీ జరగదు. ప్రపంచం వెనక అంతం కాలేదు, యిక ముందు అంతం కాబోదు."

నటుడైన మిస్టర్ క్యాఫ్ అందుకుని అన్నాడు: "యీ ప్రపంచమే అంతం కానుంటే, ఒక మహానాటకంలో తెర దింపినట్లవుతుంది. తెర దింపెయ్యా నివ్వండి. మనమందరమూ ఒకే రంగ స్థలంమీద వుంటాముగా ! ఈ ప్రపంచమొక రంగ స్థలమూ స్త్రీ పురుషులందరూ అందులో పాత్రధారులు కదా!" నాకు క్యాఫ్ చెప్పిన విషయం బాగుంది. అందరం ఒకే రంగ స్థలంమీదవుండి, కట్టకట్టుకు ఏదన్నా అవుతాం. అందరం ఒకచోట వుంటం కూడా కొంతలోకొంత తృప్తి నిస్తుంది.

1899 డిశంబరు ముప్ఫై ఒకటో తేది వచ్చింది. యింత వరకూ ఏమీ జరగలేదు. యింక ఒక్క యిరవై నాలుగు గంటలు వుంది. ఈ యిరవై నాలుగుగంటలూ సక్రమంగా గడుస్తాయని నమ్మకమేమిటి !

ఆ సాయంత్రం భోజనాలయాక బ్రాడ్వేవైపుగా వెళ్దామన్నాడు తాతయ్యా. ఇంక ఎన్నిగంటలో వ్యవధిలేదు. రోడ్లమ్మట

తిరగడం అంత మంచిది కాదేమోనని నా మనసులో దుడుకుగా వుంది. కాని యింటిల్లపాదీ బ్రాడ్వే వెళ్తూన్నపుడు, నే నొక్కడినీ యింట్లో వున్నా భయంగానే వుంటుంది కద! అంచేత బయలు దేరాను.

మేము బ్రాడ్వే దగ్గర కొస్తున్న కొద్దీ, ఎక్కడికక్కడ ప్రజలు గుంపులు గుంపులుగా కనపడ్డారు. బ్రాడ్వేలో ప్రజల కోలాహలం చెప్ప నలవికాదు. యీ మనుషులందరూ యింత తెగించారేమిటి, అని నేను ఆశ్చర్యపోయాను. వీరు పత్రికలు చదవలేదా? లేక తమ జీవితంలోని చివరి ఘడియలు కులాసాగా గడిపేద్దామని యిలా వచ్చారా - హోటళ్ళ నిండా మనుషులు, వీథులనిండా మనుషులు, అందరూ పాటలు పాడుకుంటూ, ఏదో ఆనందస్రవంతిలో మునిగిపోయినట్లు ప్రవర్తిస్తున్నారు. మొగ పిల్లలు బూరాలు వూదుతున్నారు. ఆడపిల్లలు కిలకిల నవ్వుతూ గంతు లేస్తున్నారు.

మేము నెమ్మదిగా నడచుకుంటూ బ్రాడ్వే చేరుకునేసరికి, దరిదాపు అర్ధరాత్రి అయింది. బ్రాడ్వేలోని పెద్ద గడియారపు ముళ్ళు రెండు పన్నెండు దగ్గర కొస్తున్నాయి. పెద్ద ముల్లు ఒక్కొక్క నిముషం ముందుకు సాగిన కొద్దీ, నా గుండె దడ ఎక్కువ అవజొచ్చింది.

చిట్టచివరికి ఆ ప్రధానఘట్టం చేరుకున్నాం; రెండు ముళ్ళూ కలుసుకున్నాయి. అర్ధరాత్రి అయింది, పన్నెండు కొట్టారు. కొత్త

సంవత్సరం ఉదయించింది. కొత్త సంవత్సరంతోపాటు కొత్త శతాబ్దికూడా మా జీవితాల్లో ప్రవేశించింది. చర్చిగంటలు మంగళ ధ్వానాలు చేశాయి. రైలు యింజనులు, వోడ యింజనులూ, మిగతా యింజనులన్నీ ఆనందాన్ని వెలిబుచ్చుకూ యీలలు వేశాయి. ఆ బ్రహ్మాండమయిన శబ్ద మాధుర్యంలో ఆ ఆనందోత్సవ సమయంలో ఒకరిమాట ఒకరికి వినబడలేదు. ధ్వని ప్రధానమైన జగత్తులో ముందుకు నడిచాము. పాతసంవత్సరం వెళ్ళిపోయింది. కొత్త సంవత్సరం నూతనకాంతులతో ప్రవేశించింది. ఇంటి కొచ్చే సరికి నేను చాలా అలిసిపోయాను. కళ్ళమీదకి నిద్ర కూరుకు వస్తోంది. యీ ప్రపంచం అంతం కాలేదన్న విషయం, అంత మయిపోతుందన్న ప్రపంచం అంతంకాకపోడం, నాకెంత సంతో షాన్ని కల్గించిందో, మాటలేమి చెప్పగలవ్? నాకు యీ నేలమీద నూకలున్నాయి. నేనింకా బతకగలను. నూతన శతాబ్ది అవతరణ రేపు ఉదయం చూడగలను.

# నూతన శతాబ్ది

సర్వనాశనమవుతుందని అనవరతమూ భయపెట్టిన వారి జోస్యాలు పూర్తిగా అబద్ధం కాదేమోననిపించింది. పాత ప్రపంచం ఒక విధంగా అంతమయింది. అగ్నులూ వరదలూ లేకపోయినా, ఆ లోకం అంతమయి, జనవరి వుదయాన, నూతన జగతి వుద్భవ మందింది.

ఈ శతాబ్దపు మొదటి సంవత్సరాల్లోనే మా జీవితాలు ఎన్నో విధాల మారిపోడం మొదలుపెట్టాయి. విద్యుచ్ఛక్తి వ్యాప్తిలోకి వచ్చింది. దానితోపాటు మోటారు కారు కూడానూ. విమానమూ, సినీమా, యివి కూడా యిరవయ్యో శతాబ్దపు మొదటి పది సంవత్సరాలలోనే వ్యాప్తిలోకివచ్చాయి. వీటన్నిటికంటె ముఖ్యమైనవి వైద్యరంగంలోని పరిశోధనలు. రాజకీయరంగంలో ప్రజాస్వామ్య దృక్పథం ప్రవేశించింది. వర్కింగ్ క్లాస్ సంఖ్య పెరగడంతో ప్రజాస్వామ్యలక్ష్యమనునది తప్పని సరి అయింది. ఈ మార్పు లన్నీ మా జీవితాల్లో ప్రవేశించి జీవనభాండాన్ని కుదిపివేశాయి. యివి ఎంత వేగంగా వచ్చాయంటే, ఆ వేగాన్ని విప్లవం అనడం కూడా పొరబాటు కాదేమో!

జనవరి ఒకటో తేది వుదయం, నగరవాసులు మేల్కొని నాలుగువీధులూ చూసేసరికి, యీ మార్పులు రానున్నాయని అనిపించలేదు. ఆఖరికి మా వార్తాపత్రికలైనా, రాగల యీ బ్రహ్మాండమయిన మార్పుల్ని సూచనప్రాయంగానైనా చెప్పలేక పోయాయి. యిరవయ్యో శతాబ్దము ప్రారంభమయిన తరువాత కూడా, కొన్నాళ్ళపాటు రోజులు మామూలుగానే గడిచాయి. వార్తా పత్రికలు యధాప్రకారం, జరిగిపోయిన సంఘటనల గురించి బ్రహ్మాండమయిన అలజడి చేస్తూండేవి. ఏమి రానుందో చూడ గల నేర్పుగానీ, దూరదృష్టిగానీ వాటికి వుండేది కాదు.

ప్రత్యక్షంగా యీ నూతన ప్రపంచోదయాన్ని తెలుసుకున్న న్యూయార్కు నగరవాసులలో తాతయ్య, అమ్మమ్మా, నేను మొదటి కొద్దిమందిలోకి వస్తాం. ఒకరోజు పొద్దున్నే నేను లేచే సరికి నాకు వంట్లో బాగుండలేదు. రెండురోజులుబాటు మంచం మీద పడుకోబెట్టారు. మూడోరోజున ప్రసిద్ధిపొందిన డాక్టరుని పిల వక తప్పింది. కాదు.

కంఠం సరిగాలేక జ్వరం తీవ్రంగా వుండేసరికి, అమ్మమ్మకి భయం పట్టుకుంది. మూడోరోజున డాక్టర్ లాంబర్ట్‌కీ మా అమ్మకీ వెంటనే కబురంపింది. వారిద్దరూ తక్షణం వచ్చారు. అమ్మా అమ్మమ్మా నా మంచం పక్కన నిలబడివుండగా డాక్టర్ లాంబర్ట్ నా కంఠాన్ని చాలాసేపు పరీక్ష చేశాడు. ఆపైన ఒకరి మొఖా

లొకరు చూసుకున్నారు. డాక్టర్ లాంబర్ట్ మెల్లగా 'డిఫ్తీరియా' అన్నాడు.

'డిఫ్తీరియా' ఆనాడు పిల్లల కొచ్చే గడ్డు వ్యాధుల్లో ఒకటి. డిఫ్తీరియా అనగా కంఠనాళం వుబ్బి, గాలిగొట్టాన్ని (Wind-Pipe) మూసెయ్యడం. అప్పుడు డాక్టరు చెయ్యగలిగిందేమిటంటే కంఠం దగ్గర శస్త్ర చికిత్సచేసి, కుర్రవాడు గాలి పీల్చేందుకు వేరే గొట్టాన్నొక దానిని గొంతుకలోకి ప్రవేశపెట్టడం. ఈ అపరేషన్‌వల్లా యిటువంటి గొట్టాన్ని ప్రవేశపెట్టడంవల్లా ఎక్కువ ప్రయోజనం కనపడేది కాదు. అసలు ఆ వ్యాధి చాలా వుధృతమైనది. అంచేత యీ ప్రయత్నాలు ఏమీ ఫలించేవి కాదు. కుర్రవాడు గాలి పీల్చ లేక, గిలగిలకొట్టుకుంటూంటే తల్లిదండ్రులూ, డాక్టర్లూ నిస్సహాయులై చూస్తూ నిలబడేవారు. యీ డిఫ్తీరియా వ్యాధి ప్రతి సంవత్సరమూ ఒక్క న్యూయార్క్ నగరంలోనే కొన్నివందల మంది పిల్లల్ని బలి తీసుకునేది.

అమ్మా అమ్మమ్మా కన్నీటిపర్యంతం అవుతూండగా డాక్టర్ లాంబర్ట్ వారికి ధైర్యం చెబుతూ యిట్లా అన్నాడు : మీరేమీ భయపడకండి. ఆ కుర్రవానికి యిట్టే నయమవుతుంది. నేనొక కొత్త మందు ప్రయత్నించబోతున్నాను. గుర్రపు రక్తంనుంచి తయారు చెయ్యబడిన మందు యిది. దీనిని చాలాచోట్ల వుపయోగిస్తున్నారుట. సత్ఫలితాలు కనిపిస్తున్నాయట. ప్రయత్నించి చూస్తాను. అబ్బాయి కేమీ భయం లేదు."

"మాత్రలా ?" అని అడిగింది అమ్మమ్మ.

"మాత్రలు కాదు, యింజెక్షను. యీ యిచ్చేదాన్ని యాంటీ-టాక్సిన్ అంటారు. అది నా దగ్గర లేదు. ఆరోగ్యశాఖ ఆఫీసుకెళ్ళి పట్టుకు రావాలి. ఒక అరగంటలో వచ్చేస్తాను."

డాక్టర్ లాంబర్ట్ తిరిగి వచ్చేసరికి, నేను యీ ప్రపంచంలో లేను. నాకు ఏం యింజక్ష నిచ్చారో, ఎప్పుడిచ్చారో తెలియదు. చాలాగంటలు గడిచాక, జ్వరం తగ్గిపోయింది. ఆ రాత్రి కాబోలు డాక్టర్ లాంబర్ట్ మళ్ళీ నన్ను చూడ్డానికి వచ్చాడు. అప్పటికప్పుడే జ్వరం తగ్గి వంట్లో కొంచెం తేలికగా వుంది.

"ఇది నిజంగా ఒక మిరకిల్" అంది అమ్మ.

"'మిరకిల్' అని నెమ్మదిగా అంటావేమిటి? మనం ఎప్పుడైనా యిలాటిది విని ఎరుగుదుమా" అంది అమ్మమ్మ.

నిజంగా అది ఒక మిరకిలే. అప్పటినుంచీ 'డిఫ్తీరియా'కి యాంటీ - టాక్సిన్ వాడటమనేది వ్యాప్తిలోకి వచ్చింది. వేలకొద్దీ పిల్లలని పొట్టను పెట్టుకున్న యీ డిఫ్తీరియా రాక్షసిని సైంటిస్టులు జయించారు.

కొందరు తల్లిదండ్రులు తమ పిల్లలకి యాంటీ-టాక్సిన్ యివ్వడానికి అంగీకరించేవారు కాదు. మానవరక్తంలోకి యితరమైనవి పంపడం అసహజమనీ విషతుల్యమనీ, భగవంతుడు యిటువంటి పనులని ఎంత మాత్రమూ అంగీకరించడనీ వారు అంటూండేవారు.

యాంటీ - టాక్సిన్ యిచ్చిన పిల్లలు బ్రతకడమూ, అయింజక్షను పుచ్చుకోని పిల్లలు చనిపోడమూ, ప్రజలు తమ కళ్ళతో చూడసాగారు. ఈ ప్రత్యక్ష సత్యం గమనించినమీదట, విషతుల్యామనే సిద్ధాంతం దానంతటదే వోడిపోయి, యింజక్షనుల విషయంలో అభ్యంతరం తెలిపేవారు కాదు.

ఆ రోజులలో మృత్యుదేవత 'డిఫ్తీరియా' అను ద్వారం నుంచేకాక, అనేకమార్గాల మా పరిసర ప్రదేశాలలో ప్రవేశించేది. నిమోనియా, టీ. బి., స్కార్లెట్ ఫీవర్, టైఫాయిడ్, మశూచికం యిటువంటివి అనేకద్వారాల ద్వారా ఆ మృత్యుదేవత మానవాళిని పల్కరిస్తూ వుండేది. ఆ రోజుల్లో ఆపరేషనులంటే, మరొక ప్రపంచానికి 'పాస్‌పోర్ట్' అని అర్థం. శిశుమరణాలసంఖ్య చెప్పతరం కాదు. ప్రతివీధికీ ఒక మంత్రసాని వుండేది. ఆ రోజుల్లో వూపిరితిత్తుల వ్యాధి మరీ ఎక్కువ. మనుషులు నీరసించి ఖంగు ఖంగున దగ్గుతూ, ఆ దగ్గులో ప్రాణాలు వదిలేవారు. ప్రతి యింట్లోనూ యీ ప్రకారం దగ్గే మనుషులు అథవా ఒకరిద్దరేనా వుండేవారు. కొన్ని కుటుంబాలకి కుటుంబాలు యీ వ్యాధితో అంతరించిపోయేవి. ఈ గడ్డు వ్యాధులు భాగ్యవంతులని కూడా కనికరించేవి కాదు. వయసు మళ్లక పూర్వమే, యిటువంటి వ్యాధులతో వేలాది ప్రజలు ఆనాటి న్యూయార్క్‌లో మరణిస్తూండేవారు.

ఇక మశూచికమూ, పంటినొప్పి, కీళ్ళ వ్యాధులూ, మొదలైన వాటి గురించి చెప్పనే అక్కర్లేదు. ప్రతివాడూ ఏదో ఒక

దుర్గ్మత గురించి చెప్పుకుంటూనే వుండేవాడు. ఆరోగ్యంగా వున్న వారు ఒక్కరూ లేరా యీ పట్నంలో అనిపించేది. కుష్టువ్యాధి అక్కడ లేకపోయినా, బైబిలు కాలంనుంచీ దానిని గురించి చెప్పిన మాటలూ, అది ఎంత భయంకరమో, యీ నోటా ఆ నోటా వినడమూ వీటితో ప్రజల మనస్సుల్లో యీ వ్యాధి గురించి భయం విపరీతంగా వుండేది. ఈ వ్యాధి వున్నవారిని తూర్పు దిక్కుగాగల ఒక చిన్న దీవికి పంపేవారు. ఆ దీవికి వెళ్లడమే కాని తిరిగి రావడమనేది వుండేది కాదు. పాపం, యీ వ్యాధి చైనావారివల్ల వచ్చిందని న్యూయార్కులోని కొందరు అనవసరంగా అపవాదు లేవదీశారు. అందుకు కారణం ఒక్కటే! చైనావారు నడుపుతున్న 'లాండ్రీ బిజినెస్' తాము కాజెయ్యాలనే దురుద్దేశంతో తెల్లవారు యీ నిరాధారమైన అపవాదు లేవనెత్తి, "మీ ఆరోగ్యం కాపాడుకోదలచుకుంటే, చైనావారి లాండ్రీలకి బట్టలు వెయ్యకండి" అని పెద్ద పెద్ద పోస్టర్లు వూరంతా అంటించేవారు. భయమువల్లా అజ్ఞానమువల్లా న్యూయార్కు నగరవాసుల్లో చాలామంది యీ ఘోర అబద్ధం నిజమని నమ్మారు.

నూతనశతాబ్ది అవతరణతో మృత్యుదేవత మామీద చేసే దాడిని కొంచెం తగ్గించి, మనుష్యులు వారంతట వారు పెరిగి, కాలధర్మప్రకారం కడతేరడమనే వెనుకటి అభిప్రాయాన్ని కొంచెం మన్నించినట్టుంది. సైన్సూ వైద్యశాస్త్రమూ మానవుల ఆరోగ్యాన్ని పెంచేందుకు కృషిచేయ సాగాయి. దీర్ఘరోగులూ, వ్యాధిగ్రస్తులైన అనాకారులు వీధులలో కనపడటం తగ్గిపోయింది. వ్యాధిరాకుండా ఎదుర్కొనే మార్గాలు, అంటే నిరోధక పద్ధతులు వైద్యరంగంలో

పెరగడంతో న్యూయార్క్ నగరవాసుల మొఖాలలోకి కొత్త కళ వచ్చిందనవచ్చు.

నేను డిఫ్తీరియాతో పక్కమీద వున్నపుడు మా చుట్టలషాపులో అనేకమార్పులు జరిగాయి. క్రింద జరుగుతున్న ఆ రిపేర్లు ఏమిటో తాతయ్యా అమ్మమ్మా చెప్పేవారుకాదు. కొత్త శతాబ్దంతో లోకమంతా మారిపోతున్నదని నా కెందుకనో గాఢనమ్మకం. నన్ను పక్కమీదనుంచి లేవనిచ్చిన తరువాత, నేనుచేసిన మొట్టమొదటి పని ఏమిటంటే, గబగబా కిందకి పరుగెత్తడం. అక్కడ అంతా కొత్తకొత్తగా కనిపించింది. నేను మనసులో అనుకుంటున్నట్టు నూతన శతాబ్దపుకాంతి, మా 'సిగార్‌స్టోర్'లో కూడా ప్రవేశించింది - సందేహంలేదు. షాపంతా గాస్ మాంటిల్సు పెట్టారు. వార్తా వీధిలోని ఎలక్ట్రిక్ దీపాలకంటె యివి కాంతివంతంగావున్నాయి. వీటి కాంతి కొట్టవచ్చినట్టుంది. గాస్ దీపాలవైపు సూటిగా చూడలేం; చూస్తే, కళ్ళుమండి, నీళ్ళొస్తాయి. నేనవిచూసి ఆనందపడుతూండగా, "బాగున్నాయా?" అని అమ్మమ్మా తాతయ్యా అడిగారు.

"ఓ - చాలా బావున్నాయి. పట్టపగలులావుంది. ఏ మూలా చీకటనేదే లేదు."

ఈ అద్భుతకాంతే కాకుండా, మరొక కొత్తవస్తువుకూడా కనిపించింది మా షాపులో. టెలిఫోన్! నీగ్రోబొమ్మ పక్కనేవుంది.

టెలిఫోన్ యిదివరకు నేను చూశానుకాని, యింత అంద మయిన ఫోను నే నెక్కడా చూడలేదు. యిది మా స్వంతం. మందులషాపులకీ, వార్తాపత్రికలకి టెలిఫోన్లువుండటం సహజమే గాని, మా చుట్టలషాపుకి కూడా టెలిఫోన్వుండటం ఎంత అదృష్టం. నేను టెలిఫోన్ దగ్గరకువెళ్ళాను. యంత్రాన్నంతా సావకాశంగా పరిశీలించాను. మాట్లాడేగొట్టమూ, చిన్నపెట్టే, రిసీవర్ తగిలించేం దుకు ఒకకొక్కెంవున్నాయి. పెట్టెలోపల ఎలక్ట్రిక్ యంత్ర మున్దిట. ఆ యంత్రంలో చిన్నిచిన్ని మాగ్నెట్లూ, సిల్కుతో చుట్టబడిన తీగెలూ, వెండిగంటలూ, ఏవిటో బోలెడన్ని పరికరాలు, ఎంతో పొందికగా పేర్చబడివున్నాయి.

ఆ పెట్టె చూస్తూవుంటే, ఎంత సంతోషం కలిగిందో, అది ఎంత సుందరమైనదో చెప్పలేను.

డిఫ్థీరియా వచ్చినపుడు నేను పేచీపెట్టకుండా మందు తాగి నందుకూ, మంచి పిల్లవానిలా నడుచుకున్నందుకూ, తాతయ్య నన్ను ఆ వసంతకాలంలో మాడిసన్ గార్డెన్లో జరిగిన, బైసికిల్ ప్రదర్శనకి తీసుకెళ్లాడు.

ఆ రోజుల్లో బైసికిళ్ళు, ఎక్కడపడితే అక్కడ కనపడేవి. స్త్రీలూ పురుషులూ పిల్లలూ, అవి ఎక్కి తిరుగుతూండేవారు. ఆ బైసికిళ్ళసంఖ్య ఎంత విపరీతంగావుండేదంటే, ఆదివారాలప్పుడూ పండగరోజుల్లోనూ, న్యూయార్కులోని కొన్నివీధులు, బైసికిళ్ళు

తొక్కేవారికని, ప్రత్యేకంగా కేటాయించేవారు. యిక, సెంట్రల్ పార్కులోనూ, రివర్ సైడ్ డ్రైవులోనూ, వీరికోసమని వేరేమార్గాలు కూడా ఏర్పాటుచేశారు.

చాలామంది కుర్రవాళ్ళకి మల్లేనే నేనుకూడా, సైకిల్ ఎప్పుడు కొనుక్కుంటానా అని, ఆ శుభదినంకోసం ఎదురు చూస్తూండేవాడిని. తాతయ్య నన్ను బైసికిల్ ప్రదర్శనకి తీసుకెళ్ళి నపుడు, భవిష్యత్ కొనుగోలుదారు (Future - Buyer) దృష్టితో, ప్రతి కంపెనీ సైకిల్‌నీ, కొంచెం పరిశీలనగా చూశాను. ప్రతి కంపెనీ సైకిలూ, జాగ్రత్తగా చూసుకుంటూరావడమంటే, కాస్త కష్టమైన పనే! ఎంచేతనంటే, ఆ బైసికిలు ప్రదర్శనలో, కొన్నివందల సైకిళ్ళువున్నాయి. ఒక సీటున్నవీ, రెండు సీట్లున్నవీ, ముందూ వెనకా సీట్లున్నవీ, పొట్టిసైకిళ్ళూ, పొడుగుసైకిళ్ళూ; ఒకటేమిటి - ఎన్నిరకాలోచెప్పలేము. దేనికది భిన్నంగా దాని ప్రత్యేక అందా లతో అగుపడింది. ఆ ప్రదర్శనలో బైసికిళ్ళతోపాటు, తత్సంబంధ మైన వస్తువులుకూడా, అంటే - బెల్సూ, సీట్లూ, అందమయిన హేండిల్‌బార్సూ, హేండిల్‌బార్ తొడుగులూ, స్పెషల్ పెడల్సూ, సైకిల్‌సామానువేసుకునే తోలుసంచీ, పెద్దరెంచీలూ, అయిల్ కాన్‌లూ, సైకిల్‌చెయిన్సూ, ఆ చైన్సు తుప్పుపట్టకుండా వాడవల సిన గ్రాఫైట్‌కణికలూ, టైర్లూ, లాంప్‌లూ మొదలైనవన్నీ ప్రదర్శిం చారు. సైకిల్‌లాంపుల్లో కిరసనాయిలుపోసేవి వేరు, ఎసెటిలిన్ గాస్‌తో (Acetylene Gas) మండేవి వేరు.

ప్రదర్శనలో కనిపించిన ప్రతిదీ అద్భుతంగావుంది. ప్రతి వస్తువూ ధగధగలాడుతోంది. అది బైసికిళ్ళ స్వర్గం అనుకోండి.

తాతయ్యా నేనూ, ఒక స్టాల్‌నుంచి మరొక స్టాల్‌వైపుగా, ప్రతి వస్తువూ చూసి ఆనందిస్తూ, ముందుకి నడిచాం. ముందుకువెళ్తున్న కొద్దీ నా మనసు అయోమయమైపోయింది. నేను నల్లసైకిలు కొన డమా నీలం సైకిలుకొనడమా ? అయితే, ఏ లాంప్ శ్రేష్టం, కిరస నాయలుదా - గాస్‌దా ? వీటి విషయమై నే నొక నిశ్చయానికి రాక పూర్వమే, ఆ కల ఒకరూపాన్ని తీసుకోకపూర్వమే, మేము హాలు మధ్యభాగానికివచ్చాం. అక్కడ ఒక ఎత్తయిన ప్రదేశంలో ఎరుపూ తెలుపూ నీలపు పతాకాల అలంకరణతో ఒక ఆటొమొబైక్ నుంచునివుంది.

గుర్రంలేకుండా నడిచే బళ్ళగురించి, నే నిదివరకువిన్నాను, చదివాను. కాని యింతవరకూ చూడలేదు. ఇప్పుడు నాకళ్ళ ముందు, ఆ అద్భుతవస్తువు ప్రత్యక్షంగా కనపడుతోంది. చూడ టానికి బాగానేవుందిగాని అది ఏదో వింత జంతువులావుంది - యిటు గుర్రపుబండీ అటు బైసికిలూ కాకుండావుంది. గుర్రపు బండీకి మల్లేపెట్టే, కుషన్‌లతో కుట్టబడిన అందమైనసీటూ, బండీకివుండే స్ప్రింగుల్లాటి స్ప్రింగ్‌లూ (కమానుకట్ట) అన్నీ వున్నాయి. కానీ చక్రాలేమో లోహంతోచేశారు - కర్రవికాదు. టైర్లు బైసికిలు టైర్లకి మల్లేనే రబ్బరువి. స్టీరింగ్‌రాడ్ బైసికిల్ హేండిల్‌బారుకిమల్లేనే, అర్ధవలయంలోవుంది. ఈ ఆటోమొబ యిల్ చక్రాలకి, బైసికల్ చక్రాలకి మల్లేనే స్ప్రాకెట్స్యూ, గొలు సులూవున్నాయి. దీనికివున్న దీపాలుమాత్రం గుర్రపుబండీకిపెట్టు కునే ఇత్తడి దీపాలవంటివే. మొత్తానికి ఆటోమొబైల్ చూట్టానికి ఏదో వింతగానూ, తమాషాగానూ కనపడేది. ఇంతకీ యిది ఎలా

నడుస్తుందీ ? - అనుప్రశ్నకి సమాధానంగా బండీలోని ఎత్తయిన కుషన్‌సీటుకి అడుగున ఒక 'సిలెండర్‌గల గాస్' యింజనువుం డటం, మాకుచెప్పారు. ఆ గాస్‌యింజను సాయంతో యీ ఆట మొబైల్, గంటకి పదిమైళ్ళవేగాన, సునాయాసంగా ప్రయాణం చేయగలదట.

తాతయ్యా నేనూ, యీ అశ్వరహిత (Horseless Carriage) వాహనాన్ని ప్రతికోణంనుంచీ ఎంతో శ్రద్ధగా పరిశీలించాం. ధగధగ లాడే యిత్తడిసామాన్లు దీనిలో ఎక్కువవున్నాయి. చూస్తున్నకొద్దీ నా మనస్సు ఆటోమొబైల్‌కి కట్టుబడిపోయింది. బైసికిల్ ఎందుకు - వెధవబైసికిల్ ! యిప్పటినుంచీ పైసలు పోగుచేసి ఏ నాటికైనా, యిలాటిది ఒకటి సంపాయించాలని మనసులో నిశ్చయం చేసేసు కున్నా.

వారం పదిరోజులు అయాక, మాకు అశ్వరహిత వాహన మొకటి నడివీధిలో తటస్థపడింది. అది పొగలుకక్కుతూ, పెద్ద పెద్దశబ్దాలు చేసుకుంటూవస్తోంది. వీధిలో ప్రతివాళ్ళూ దానివంక వింతగా చూస్తున్నారు. కొందరు మొహంమీద నవ్వేశారు. దానిని నడుపుతున్నతను ప్రజల వేళాకోళానికి కొంచెం ఖంగారుపడ్డట్టు కనిపించాడు. ప్రజలలో కొందరు "ఏయ్, అది నడవదు. ఒక గుర్రాన్నిపట్టుకొచ్చి కట్టకూడదూ? గుర్రాన్నిపట్టుకురా," అని పెద్దగా అరిచారు.

ఇది అయిన కొన్నాళ్ళకి, మళ్ళీ మరొక అశ్వరహితవాహ నాన్నిచూశాను. ఆ తరువాత ఆరునెలల్లోనూ నాలుగు కనపడ్డాయి.

మూలమూలలనుంచి యీ వింత మృగాలు ప్రజలమధ్యకిరావడం మొదలుపెట్టాయి. వార్తాపత్రికల్లో వీటిని గురించిన కథలూ గాథలూ ప్రచురితమయేవి. వారపత్రికలూ మాసపత్రికలూ, వేరు వేరుకంపెనీల వాహనాలగురించీ, వాటియోగ్యతగురించీ, ప్రకటనలు వేస్తూండేవి.

ఈ కొత్తయంత్రాల గురించిన సమస్తవిషయాలూ నేను సేకరించేవాడిని. యిరవయ్యో శతాబ్దము ప్రారంభం కాకపూర్వం, అమెరికా మొత్తంమీద నాలుగంటే నాలుగు యిటువంటి వాహనాలువుండేవట. యిరవయ్యోశతాబ్దపు ప్రారంభంనాటికి, యిటువంటివి అమెరికా మొత్తంమీద ఎనిమిదివేలు వున్నాయిట. మొదటి ప్రపంచయుద్ధంనాటికి అమెరికాలో ప్రతిసంవత్సరమూ, సాలుకి రెండులక్షలకార్లు వుత్పత్తిఅయేవి. రెండువందల కంపెనీలు కార్ల తయారీలో కృషి చేస్తూండేవి.

మొదటిరోజుల్లో కార్లకి సీట్లఅడుగున ఒకే ఒక్క సిలండరు గల యింజనువుండేది. దాని హార్సుపవర్ ఏడు. ఒక సిలండరు గల ఓల్డ్స్‌మొబయిల్ కారుధర ఆ రోజుల్లో అరువందల యాభై డాలర్లు - అనగా సుమారు మూడువేలరూపాయలు. ఆ తరువాత వోల్డ్సుమొబయిల్ కారు నాలుగుసిలండర్లతో, యిరవైఎనిమిది హార్స్‌పవర్‌తో (అశ్వికశక్తి) రెండువేల అయిదువందలడాలర్ల ధరకి అమ్మకమయేది. యిరవైఎనిమిది హార్స్‌పవర్‌గల యీ కారు గంటకి యిరవైనుంచి యిరవైఅయిదు మైళ్ళవేగాన వెళ్ళగలిగేది.

కాడిలాక్సూ, స్టుడిబేకర్సూకూడా మార్కెట్‌లోకివచ్చాయి. స్పీడోమీటర్లూ లైట్లూలేకుండా వాటిధర మూడువేలనుంచి అయిదు వేల డాలర్లదాకాపుండేది. స్పీడోమీటరూ లైట్లూ ఎక్స్ట్రా ఛార్జి పుచ్చుకుని అమ్మేవారు. అప్పుడా రోజుల్లో 'నార్దర్న్' అను ఒక కారువుండేది. ఆ కారు తయారుచేసినకంపెనీవారు, "దుమ్ము లేప కుండా మిమ్మల్ని తీసుకెళ్ళగల కారు మా ఒక్కరిదే సుమండి!" అని 'ఎడ్వర్టయిజ్' చేసేవారు. దుమ్ములేపకుండా మట్టిరోడ్డమ్మట కారు ఎలా వెళ్ళగలదో ఆ ప్రకటనకర్తలకే తెలియాలి!

యాంత్రికంగాచూస్తే బైసికిల్ అన్నివిధాలా వుపయోగ కారి అయిన వాహనం. పిల్లలమైన మాకు సైకిల్‌లోని భాగాలు, తేలిగ్గా తెలిసిపోయేవికాని, ఆటొమొబైల్ గురించి అంతగా అర్థ మయేదికాదు. అర్థంకాని కొద్దీ అది తెలుసుకోవాలనే తృష్ణ ఎక్కు వయేది. మమ్మల్నా రోజుల్లో ఆటొ - క్రేజీ (Auto - Crazy) అనే వారు. పోస్టేజిస్టాంపులు కార్ల కంపెనీలకిపంపి, వాళ్ల కేట్లాగులు తెప్పించుకునేవారం. కారు ఎలా నడిచేదీ, మాకుతెలిసిన కొద్ది పాటి జ్ఞానంతో ఆలోచించి, ఒకరితో ఒకరం చర్చించేవారం. ఎక్క డేనా వీధిలో కారు కనపడిందా, పిల్లలందరం దానిచుట్టూ గుమి గూడి, నఖశిఖపర్యంతం పరీక్షచేయడమే! ఏదేనా కారు నడిరోడ్డులో ఆగిపోయిందా, దాని రిపేరీని సర్కస్ చూస్తున్నట్లుగా అందరం అమితాసక్తితో చూసేవారం. ✓

అమెరికనుల జీవితాల్లోకి పొగలుకక్కుతూ, పొగలు చిమ్ము తుంటూ ప్రవేశించింది ఆటొమోబైల్. ఇది గుర్రాలని ఎంతగానో

భయపెట్టింది. ఏ క్షణాన యిది నడిరోడ్డుమీద పేలిపోతుందో అని మనుషులు దూరదూరంగా తప్పుకు నడిచేవారు. దానిని వేళాకోళం చేశారు; దాన్ని చూసి నవ్వారు. నోటికొచ్చినట్లు అన్నారు. కాని అది చలించలేదు. దాని సంతతిని దినదినాభివృద్ధి చేసుకుంటూ, ఆపిటికాపేడు మానవజీవితంలో అత్యధికస్థానాన్ని ఆక్రమించింది. యింగ్లీషు భాషలోకి ఫ్రెంచి మాటలు అనేకం పట్టుకొచ్చింది. షొఫర్, గరాజ్, కూపె, ఛాసిన్, కార్బురేటర్ మొదలైన పదాలు దైనందిన జీవితంలో వాడుక పదాలు అయినాయి. అసలు ఆటోమొబైల్ అన్నదే ఫ్రెంచిపదం. యిరవయ్యో శతాబ్ద ప్రారంభంతో యీ ఆటోమొబైల్ ఆమెరికనుల జీవితంలో ప్రవేశించి అక్కడ స్థిరపడిపోయింది. కొన్నాళ్లయ్యేటప్పటికి దాని ప్రభావాన్ని ఆమోదించక తప్పింది కాదు. యీనాడు మోటారు కారు లేని మానవప్రపంచం వూహింప నలవికానిది. ఇవి లేకుండా మనుషులొకప్పుడు జీవించగలిగారనే విషయం కూడా యీనాడు మాకు తట్టదు.

బైసికిల్ ప్రదర్శన అయిన కొద్దినెలల లోపల మొట్టమొదటి మూవీ (Movie - కదిలే బొమ్మలు) చూశాను.

అది వేసవికాలం. ఆదివారం నాడు తాతయ్యా నేనూ సముద్రస్నానాని కని 'కోనీ అయిలాండ్'కి వెళ్లాము. యిక్కడే చూశాము మొట్టమొదటిసారి 'మూవీ'ని నేనూ తాతయ్యాను.

ఆ రోజున అమ్మమ్మ మాతో వుండి వుంటే, సినిమా చూడ్డం పడివుండేది కాదు. బార్‌రూమ్‌లోకి వెళ్లడంగాని ఏ విధమైన పానీయం ముట్టడంగాని ఆమెకి గిట్టదు. తాతయ్యకి మరీ కడుపునొప్పిగా వున్నపుడు నన్ను వెంటబెట్టుకుని బార్‌రూమ్‌కి వస్తూండేవాడు. అమ్మమ్మకీ సంగతి తెలియదు; తెలిసిందా మమ్మల్ని బతక నివ్వదు.

ఆ రోజునైనా నేను సినిమా చూడ్డం ఎలా సంభవించిందంటే, నేనూ తాతయ్యా కోనీ ద్వీపంలోని విశాలమైన బాట వెంట నడుస్తున్నాం; ఒక పెద్ద హొటల్ ముందుకు వచ్చాం. ఆ హొటల్ దగ్గిర ఒక పెద్ద క్యానాస్ తెర వేలాడదీశారు. యిదేదో కొత్తగా వుంది. లోపలనుంచి స్త్రీపురుషుల నవ్వులూ, బాల బాలికల అరుపులూ, పియానో సంగీతమూ వినిపిస్తున్నాయి. 'ఇదేదో కొత్తగా వుంది లోపలికి వెళ్దాం' అన్నాను తాతయ్యతో. తాతయ్యా నేనూ లోపల ప్రవేశించాం. టేబుల్సు దగ్గిర ఆడవాళ్ళూ మొగవాళ్ళూ బీరు గ్లాసులుచేత బుచ్చుకు కూచుని, తమ కెదురుగా వున్న తెల్లటి తెరమీద కదులుతూన్న బొమ్మల్ని చూస్తూ ఆనందిస్తున్నారు. యీ కదిలేబొమ్మల్ని చూసీ చూడటంతోటే నేను ముగ్ధుణ్ణయిపోయాను.

తెరమీద కనిపించే బొమ్మలు నిత్యజీవితంలోని మనుషులకి మల్లే ఇటూ అటూ తిరుగుతున్నాయి; గబగబా పరిగెడుతున్నాయి. ఏటొచ్చీ, వాటి నడక నడకలా లేదు, గెంతుతున్నట్లుంది. అయినప్పటికీ ఆ బొమ్మలు మమ్మల్ని ఆనందాబ్ధిలో ముంచేశాయి. ఒక

పొట్టివాడు, వికృతాకారంగల ఒక మనిషి కోపంనుంచి తప్పించుకో జూస్తున్నాడు. ఒక స్త్రీ మూలగా కూచొని పెద్దపెట్టున ఏడుస్తోంది. తెరమీద మనుషులు కొట్లాడుకొంటున్నారు. పోలీసు జవాను కూడా వాళ్ళతో కలిసి అల్లరి చేస్తున్నాడు. మొత్తంమీద ఆ బొమ్మలు కదలికలతోనూ, ఉత్సాహోద్రేకాలతోనూ కూడి వున్నాయి. చీకటిలో కొచ్చేందుకు తాతయ్యే ముందు సంశయించాడుగాని, లోపల ఎంత తమాషా అయినవి చూపెడుతున్నారో చెప్పేసరికి ఆయన కొంచెం మెత్తబడి, "బార్ రూమ్‌లోకి మనం వెళ్ళకూడదుగా! అమ్మమ్మ కొడుతుంది" అన్నాడు.

"అక్కడ పానీయాలు కాదు, ముఖ్యం బొమ్మలు. అందరూ బొమ్మలు చూసి ఆనందిస్తున్నారు. మనంకూడా చూద్దాము, తాతయ్యా" అని ప్రాధేయపడ్డాను.

తాతయ్యా నేనూ లోపలికి వెళ్లాం. ఒక పిక్చరు మొదటి నుంచీ చివరి దాకా చూశాం. మళ్ళీ మరొకసారి చూశాం. రెండు సార్లు చూసి నవ్వుకున్నమీదట మాకు కొంచెం తృప్తి కలిగినట్లనిపించింది. అందులో కనపడ్డ దృశ్యాలూ, ఆ ఎదుర్కోడాలూ, ఆ తప్పించుకోడాలూ, అవన్నీ మామనోఫలకంమీద నిల్చిపోయాయి.

బయటికి వచ్చాక తాతయ్యే అన్నాడు: "బొమ్మలు బాగానే వున్నాయి. కాని యిటువంటివి చూపించ నివ్వకూడదు. బీరు ఎక్కువగా అమ్మేందుకు యిది ఒక సాధన. ఆబొమ్మలు చూస్తూ

మనుషులు బీరు ఎక్కువగా తాగుతారు. పానీయాలు ఖర్చయేందుకు, షాపులవాళ్ళు కనిపెట్టిన కొత్తపద్ధతి యిది."

ఈ విషయంలో మటుకు తాతయ్య పొరబడ్డాడని చెప్పక తప్పదు. తరువాతి కొద్ది సంవత్సరాలలోనూ, న్యూయార్కులోని బార్‌రూములవారు పెద్ద పెద్ద షాపులవారూ, యీ 'కదిలే బొమ్మలని' తమ తమ ఆవరణల్లో వుంచి, ఎక్కువమందిని తమ వేపుగా ఆకర్షించుకునేవారు. రాను రాను మనుషులు, బొమ్మలు చూడ్డానికే వచ్చేవారు. బొమ్మలు చూపినందుకు ఒక 'నికెల్' పుచ్చుకునేవారు. 'నికలోడయాన్స్' (Nickelodeons) అను పేర యీ కదిలే బొమ్మల షాపులు మూలమూలల వెలిశాయి.

తాతయ్యా అమ్మమ్మా నేనూ, మా యింటి దగ్గరవున్న 'నికాలోడియాన్'కి వెళ్ళి అప్పుడప్పుడు బొమ్మలు చూసి వస్తూండేవారం. ఆ నెలకానెల యీ బొమ్మలు చూపించే తీరువూ పద్ధతులు మార్పుజెందాయి. యుద్ధాలూ పోరాటాలూ ఎక్కువయాయి సాహసకృత్యాలకి అవకాశం ఏర్పడింది. కథానాయికలు మరింత నిస్సహాయంగా కన్నీళ్ళతో మన వంక చూడసాగారు.

మురావీలతోపాటు నూతన శతాబ్ది మరొక వుల్లాసకరమైన వేడుక ప్రదర్శించింది. అదేమిటంటే, వనితా విమోచన కారులు. (Suffragettes)

స్త్రీలకి కూడా పురుషులకివలెనే రాజకీయమైన హక్కులు సరిసమానంగా వుండాలని, యీ వనితా విమోచనకారుల అందోళన. అమెరికన్ స్త్రీలు అప్పటికప్పుడే పారిశ్రామికరంగంలోనూ, యితరవృత్తులలోనూ ప్రవేశించారు. ఒకవిధంగా వారు పురుషుల ప్రపంచంలోకి చొరబడ్డారనే చెప్పవచ్చు. ఇంక యిప్పుడు మిగిలిందల్లా ఏమిటంటే, రాజకీయమైన వోటింగు హక్కు.

అమెరికాలో కూడా కొన్ని ప్రాంతాల స్త్రీలకి ఓటింగ్ హక్కు యిచ్చారు. కానీ మేమువున్న తూర్పువైపున ప్రజాభిప్రాయం యిందుకు పూర్తిగా విరుద్ధం. యిక్కడి స్త్రీలు పురుషులతో పోరాడటమే కాకుండా, తమ స్త్రీలతోకూడా పోరాడవలసివుంది. ఈ వనితా విమోచన అనేది వొట్టి వేళాకోళమైన విషయంగా భావించడంలో అనాటి స్త్రీ పురుషులు యిరువురూ ఏకీభవించారు. భాగ్యవంతులు యీ వుద్యమాన్ని కించపరచడమే పనిగా పెట్టుకున్నారు. ఇక బీదవారూ, కింద తరగతులువారూ, ససేమిరా యిది మాకు వద్దన్నారు. మధ్య తరగతిలోని చాలామందికి కూడా యీ అందోళన సమంజసంగా కనపడేది కాదు. బహుకొద్దిమంది మాత్రమే స్త్రీల హక్కులకోసమై పోరాటం సలిపేందుకు ముందుకువచ్చారు.

ఈ స్త్రీలందరూ కలిసి ఒక సంఘంగా ఏర్పడి, అంతకి యాభైఏళ్ల క్రితమే ప్రారంభమయిన, 'సఫ్రగేటీ అందోళన'తో తమ సమస్యలని కలిపారు. అవకాశం కలిగినప్పుడల్లా తమ సమస్యలని ప్రజల ముందు పెట్టేవారు. ప్రజాభిప్రాయం తమపట్ల సుముఖత చూపించేందుకుగాను, నానాశ్రమాపడేవారు. ఒక్క

ముక్కలో చెప్పాలంటే, ప్రతిచోట వారొక 'న్యూసెన్సు'గా (Nuisance) తయారయేవారు. పికెటింగ్ చేస్తూ, కరపత్రాలు పంచిపెడుతూ, నాలుగురోడ్లూ కలిసేచోట మీటింగ్‌లు చేస్తూ, మీటింగ్‌కి ఎక్కువమంది ప్రజ రాకపోయినా, తాము చెప్ప దలచుకున్న వుపన్యాసాన్ని చివరంటా చెప్పేస్తూ, తమ ఆందోళనా కార్యక్రమాన్ని జంకుగొంకులు లేకుండా కొనసాగిస్తూండేవారు.

నేను అప్పుడప్పుడు వారు చెప్పేవి వినేవాడిని. హేతుబద్ధ మైన వారి మృదువాక్యాలు నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసేవి. యింత చక్కగా, యింత సబబుగా, యింతటి విషయజ్ఞానంతో వారు మాట్లాడుతున్నపుడు, ఆ చెప్పేదేదో సావధానంగా వినక, జన సామాన్యం యీలలువేసీ, పాడు మాటలు అనీ, అవమానాలు కురిపించీ, ఎందుకు బాధపెట్టే వారో నాకు అర్థమయేవి కాదు. ఇందులో అన్నిటికన్న తమాషా ఏమిటంటే, సభలో పిల్లికూతలూ అల్లరిపనులూ పురుషులు కాక స్త్రీలే ప్రారంభించేవారు.

వనితా విమోచనకారులమీద, పాపం ప్రతివాళ్ళకీ కోపమే ఎందుకనో ! స్త్రీలు గృహాన్ని అంటిపెట్టుకొని వుండాలని అనేవారు రాజకీయవాదులు. ఈ విమోచనకార్యక్రమం, అవినీతికరమైనదని మతగురువుల వాదన. స్త్రీలకి యిప్పుడిచ్చిన స్వాతంత్ర్యం చాలు, యింతకంటె మరీ ఎక్కువై వోటింగ్ హక్కు కూడా యిచ్చామా, యిల్లూ పిల్లలనీ విస్మరిస్తారు; దాంతో అమెరికనుల గృహజీవితం కల్లోలితమవుతుంది, అని మతగురువులు వీరి ప్రయత్నాలని ఖండించేవారు.

ఇన్ని అవాంతరాలూ దాటుకుంటూ, యీ 'సఫ్రగేటీస్' ఒక్కొక్క అడుగుచొప్పున ముందుకు వెయ్యసాగారు. వారిలోని అకుంఠిత కార్యదీక్షవల్లనే, ఉద్యమం కాలగర్భంలో కలిసిపోక నిలిచింది. సంవత్సరాని కొకసారి ఫిఫ్త్ ఎవెన్యూలో బ్రహ్మాండ మయిన ప్రదర్శన ఏర్పాటు చేస్తూండేవారు. ఆ 'పెరేడ్' చూత టానికి గుంపులు గుంపులుగా మనుషులు తరలివెళ్లేవారు. అంత మంది స్త్రీలని ప్రదర్శనలో చూస్తున్నామనేగాని, వారు యీ ప్రద ర్శన ఎందుకు జరుపుతున్నారు - అనే వివేకం యీ గుంపులకి వుండేది కాదు. సఫ్రగేటిస్‌లోని లీడర్సు తెల్లటి గుర్రాలు ఎక్కి, ప్రదర్శనకి ముందున వుండి, దారి తీసేవారు. యీ నాయకుల వెనక కొన్ని వేలమంది స్త్రీలు, అమెరికన్ పతాకాలతోటీ, తమ ఆందోళనని తెలిపే జండాలతోటీ, తమ కార్యక్రమానికి సంబం ధించిన నినాదాలు చేసుకుంటూ, ముందుకు నడిచేవారు. ఈ స్త్రీ ప్రవాహంలో అక్కడక్కడ కొందరు మొగవాళ్ళు కూడా కనపడే వారు. జనసామాన్యం వారిని ఆడంగిరేకుల వాళ్లనీ, వొట్టి పిరికి వాళ్లనీ భావించేది. సహృదయతగల భర్తలూ, సోదరులూ, పుత్రులూ మిత్రులూ యీ వనితా విమోచనకారులకి యిటువంటి సమ యంలో అండగావుండి సాయం చేసేవారు.

'పెరేడ్' ఫిఫ్త్ ఎవెన్యూలోకి రాగానే, పక్క పక్క వీధు ల్లోని గుంపులన్నీ మెయిన్ రోడ్డుమీదకువచ్చి, ఆ ప్రదర్శనని కాసేపు తిలకించి, ఆపైన పాడైపోయిన కోడిగుడ్లూ, కుళ్ళిపోయిన కూరగాయలూ ప్రదర్శనదారులమీదకి విసిరేవారు. కాని 'సఫ్ర గేటీస్' యీ అవమానానికి లక్ష్యపెట్టేవారు కాదు. తాము పోరాడు

తున్నది, ఒక వుత్తమ లక్ష్యంకోసం. ఆ లక్ష్యసాధనలో యిటు వంటివి తప్పవు. స్త్రీలంటే ధైర్యంగా వుండేవారు గాని, వీరికి సాయం చెయ్యడానికి వచ్చిన మొగవారిలో కొందరు యిటువంటి భీభత్స సమయాన చల్లగా జారుకునేవారు. కొందరు పురుషులు ఆ పంక్తుల్లోనించి పారిపోడంతో జనబాహుళ్యం వెర్రిగా అరిచి, నానా ఖంగారు చేసేది.

కొందరు స్త్రీలు ఓటింగ్ హక్కుకోసం పోరాడుతూంటే, మరి కొందరు తమ సౌజన్యాన్ని కాపాడుకునేందుకు అలజడి లేవ నెత్తారు. ఈ క్రొత్తగా వచ్చిన విద్యుచ్ఛక్తి స్త్రీ సహజమైన సౌజ న్యానికి భంగకరమని వారు అనడం మొదలుపెట్టారు. అది ఎలా గంటారా? - చెపుతాను.

యూరప్‌లో రోంటిజన్ (Roentgen) అనే ఆయన ఎక్స్‌రే యంత్రాన్ని కనిపెట్టి, ఆ మాదిరివి కొన్ని అమెరికా పంపించాడు. ఈ ఎక్స్‌రే యంత్రం అమెరికా రాగానే, ప్రజలలో రకరకాలైన పుకార్లు వ్యాప్తమయాయి· ఎక్స్‌రే యంత్రం అస్థి పంజరాన్ని, అంటే ఎముకలని ఫోటో తీయగలదు. ఈ యంత్రాల గురించిన పుకారు ఏ విధంగా వ్యాప్తమయిందంటే, ఒక దుర్మార్గుడైన డాక్టరుగానీ, శాస్త్రజ్ఞుడుగానీ, తన వీధి కిటికీలో యీ యంత్రాన్ని పెట్టుకు దారిని పోయే స్త్రీలని, యీ యంత్రం ద్వారా వీక్షిస్తూ వుంటే, వారి సౌజన్యమూ పవిత్రతా ఏంగానూ అని. ముఖ్యంగా స్త్రీని యీ విషయమై సంరక్షించవలసివుంది, యిటువంటి

యంత్రాలు, స్త్రీల పవిత్రతకు ముప్పు - అని ఆందోళన ప్రారంభించారు. మా చుట్టల షాపులోకి వచ్చిన ఒక ఫైర్‌మానూ, ఒక పోలీసు జవానూ, "కాలాతీతం కాక పూర్వమే యిందు విషయమై ఏదో ఒకటి చెయ్యాలి" అన్నారు.

"సైన్సు చాలాదూరం వెళ్ళిపోయిందని" ఒకరూ;

"అసలు అటువంటి యంత్రాన్ని ముక్కముక్కలు చేసి పారెయ్యాలని" మరొకరూ;

"అమర్యాదకరమైన ఈ మాదిరి యంత్రాలని కనిపెట్టమని ఎవరు చెప్పారు? ప్రజలని యిటువంటి దురవస్థనుంచి కాపాడవలసిన భారం మనమీద వుందని" యింకొకరూ.

ఈ ప్రకారం వాదోపవాదాలు జరుగుతూండగా, చతురుడైన ఒక డ్రెస్‌మేకర్, 'ఎక్స్‌రే' కిరణాలు చొరబడిన గౌనులు తమ షాపులో దొరుకుతున్నాయని, పత్రికల్లో ప్రకటన వేశాడు. "వీధి వెంట నడుస్తున్నపుడు మీ గౌనులగుండా ఏ కిరణాలైనా చొరబడవచ్చు. అంచేత మీ సౌజన్యత కాపాడుకునేందుకు ఎక్స్‌రే కిరణాలని అరికట్టగల మా కంపెనీ గౌనులే వాడండి."

నూతన శతాబ్దంతో విద్యుచ్ఛక్తి మా జీవితాల్లో ప్రవేశించింది. డౌన్‌టౌన్‌లో నేను చాలాకాలం బట్టీ విద్యుద్దీపాలు చూస్తున్నానుగాని, అవి మా ప్రాంతాలకి రావడం అదే మొదటిసారి.

వీధుల్లో గాస్‌దీపాలు వుండేవి. ఈ గాస్‌దీపాలని వెలిగించేందుకు సాయంత్రం వేళ 'లాంప్‌లైటర్స్' వస్తూండేవారు. గాస్‌దీపాలు సన్నగా హిస్‌మని శబ్దం చేస్తూ వెలిగేవి.

వీధుల్లో నడిచే ట్రామ్ కార్లూ రైలింజనలూ కూడా విద్యుచ్ఛక్తిని వుపయోగించుకో నారంభించాయి. 1902 నాటికే న్యూయార్క్‌లోని మొట్టమొదటి అకాశహర్మ్యం (Skyscraper) లో ఎలెక్ట్రిక్ లిఫ్ట్ వాడారు. ఫిఫ్త్ ఎవెన్యూ 23 వీధిలోని ప్లాటిరాన్ బిల్డింగులో మా అమ్మ ఆఫీసు వుండేది. దానికి కూడా ఎలెక్ట్రిక్ లిఫ్ట్‌లు ఏర్పాటు చేశారు. చూస్తూ చూస్తూ వుండగా న్యూయార్క్ మా కళ్లముందే మారిపోనారంభించింది. ఎక్కడికక్కడ ఆవిరి యంత్రాల స్థానంలో ఎలక్ట్రిక్ యంత్రాలు వచ్చాయి. ప్రతి దానికీ విద్యుచ్ఛక్తి వాడ నారంభించారు.

విద్యుచ్ఛక్తి ప్రవేశంతో ఆవిరీ మసీ మొదలైనవి తగ్గి 'పార్క్ ఎవెన్యూ' కొంచెం బాగుపడింది. వెనకటి కర్ర వంతెనలు తీసేసి కొత్త వంతెనలు కట్టారు. చెల్లా చెదరుగావుండే ఫాక్టరీలూ అద్దెకొంపలూ, అక్కడినుండి మాయమయిపోయాయి. వాటిస్థానే పెద్ద పెద్ద హొటల్సూ, డిపార్టుమెంటు హౌసెసూ లేచాయి. బీద వారు అక్కడినుంచి తప్పుకోడమూ, భాగ్యవంతు లక్కడ ప్రవేశించడమూ, అప్పట్లోనే జరిగింది.

1901 డిశంబరులో మార్కోనీ తన నిస్తంత్రీ సందేశాన్ని (వైర్‌లెస్ మెసేజ్) అట్లాంటిక్ యీ కొసనించి ఆ కొసకి పంపిం

చాడు. తీగెలు లేకుండా, సందేశం పంపగలగడమనేది, మూన వాళ్ళని చకితులుగా చేసింది. ఒక వార్త కొన్నివేల మైళ్ళదూరం, తీగెలు లేకుండా ప్రయాణం చెయ్యడమనేది, అనాటి ప్రజకి మహా విచిత్రంగా కనపడింది. న్యూయార్క్ పత్రికలు మార్కొనీ గురించిన కథలూ, ఆయన ప్రయోగఫలితాలూ ఎంతో ప్రాముఖ్యతతో ప్రచురించేవి. అప్పటికే అట్లాంటిక్ కేబుల్ నిర్మితమైపోయి వుండటంవల్ల ఆ కేబుల్ కంపెనీవారూ, యితరులూ యీ వైర్ లెస్ వొట్టి నిష్ప్రయోజనమైనదనే ప్రచారం లేవదీశారు. కాని, సముద్రంమీద ప్రయాణం చేసే వోడలకి యీ వైర్‌లెస్ యంత్రం ఎంతో సహాయకారి కావడంవల్ల ఓడలన్నీ వైర్‌లెస్ యంత్రాలు పెట్టుకున్నాయి. మార్స్‌కోడ్ (Morse Code) అను సంకేత విధానం ద్వారా సముద్రంమీది ఓడలు, తీరంలోని రేవులతో యీ వైర్‌లెస్ యంత్రసాయంవల్ల సంభాషించగలిగేవి. ఎప్పుడైతే యిది వోడలకి ఉపయోగకారి అయిందో అక్కడితో ప్రజలు మార్కొనీ వైర్‌లెస్ యంత్రంలోని ప్రయోజనాత్మక గుణాన్ని గుర్తించారు.

ఎక్స్‌రే, ఎలక్ట్రిసిటీతో నడిచే రైళ్ళూ, వైర్‌లెస్ యంత్రం యివన్నీ నాలాటి సామాన్య బాలకులు చూడలేకపోయారనుకోండి. కాని నా వయసుకి తగ్గ నూతన విద్యుత్ పరికరాలు, నా దగ్గిర వుండేవి. ఎలక్ట్రిక్ బాటరీలూ, చిన్న మోటార్లూ, మీట నొక్కితే మోగే గంటలూ, మొదలైన ఆనాటి నూతన ఆట వస్తువులు ప్రాణప్రదంగా దాచుకునేవాడిని నేను. అన్నిటికంటే ఎలక్ట్రిక్ బెల్ అంటే నా కెంతో యిష్టంగా వుండేది. ఆ గంటని వేరు వేరు విధాలుగా మోగించేందుకు రకరకాల ప్రయత్నాలు చేసేవాడిని. బాట

రీలో కరెంటు వున్నదీ లేనిదీ చూసేందుకు నాలుకదగ్గిర పెట్టు కున్నపుడు ఆ బాటరీ రాడ్స్ నాలుకకు తగలగానే జివ్వుమనేది. ఎలక్ట్రిక్ బెల్లుతోగల ప్రయత్నాలన్నీ అయిపోయాక, ఎలక్ట్రిక్ మోటారు పని పట్టించాను. మోటారు ఒక్క బాటరీతోనే పరుగెత్త గలదు. కాని రెండు బాటరీలు పెట్టినపుడు, అది వెర్రెత్తించే వేగంలో పరుగెత్తేది. ఎలక్ట్రిక్‌బెల్ అంటే, యింట్లో వాళ్ళని పిలిచేందుకు పనికొచ్చేది గాని బాటరీతో పరుగెత్తే యీ మోటారు ఎందుకూ కొరగాని వస్తువు అయిపోయింది.

చిన్నపిల్లలు మోటార్లతోనూ బెల్సుతోనూ ఆడుకుంటూం డగా పెద్దలు యీ విద్యుచ్ఛక్తి ద్వారా తమ కీళ్ళవ్యాధులూ మొద లైనవి పోగొట్టుకునేందుకు ఆశక్తిని వుపయోగించేవారు. విద్యు చ్ఛక్తి దేహంలోనించి ప్రవహించడంవల్ల తమ వ్యాధులు నయం కాగలవని ఆ నాటి రోగులూ వైద్యులూ కూడా విశ్వసించేవారు.

రీన్‌హార్టూ నేనూ ఒక్కసారి వాళ్ళ తాతయ్యే వుపయోగించే విద్యుత్ యంత్రం దగ్గిరకెళ్ళి, ఎలక్ట్రిక్ ట్రీట్‌మెంటు అనగా ఎల్లా వుంటుందో ఒక్కసారి రుచి చూశాం. సన్నని సూదులు చిటుకూ చిటుకు పొడుస్తున్నట్లుగా మహ తమాషాగా వుంటుంది లెండి. నేను ట్రీట్‌మెంటు తీసుకోడమయిపోయాక రీన్‌హార్ట్ తీసు కుంటూండేవాడు. ఒకసారి రీన్‌హార్ట్, పొరబాటున యంత్రంలోకి ఎక్కువ విద్యుచ్ఛక్తిని వదలడంవల్ల నాకు నోటమాటరాక కళ్ళు తేలేశాను. రీన్‌హార్టేమో నేను చాలా ఆనందిస్తున్నాననుకున్నాడు. అతను నా పక్కన నిలబడి, ఏమిటో ఏమిటో చెపుతున్నాడు. నేను

ఎంతకీ సమాధానం చెప్పకపోయేసరికి, అతనికి కొంచెం ఖంగారు పుట్టి స్విచ్ లాగేశాడు. లేకపోతే నేను గయాకొట్టేసివుందును. బహుశా చిన్నపుడు నేను తీసుకున్న యీ విద్యుత్‌కిరణ జాగ్రత్త వల్లనే నేమో నాకింతవరకూ కీళ్ళవ్యాధి రాలేదు.

కీళ్లవ్యాధినీ, వాతరోగాన్నీ విద్యుత్ కంపనములవల్ల (Vibrations) కుదుర్చుకోగలమని చాలామందికి నమ్మకంగా వుండేది ఆ రోజుల్లో. అంతే కాకుండా ఎలక్ట్రిక్ బెల్టులూ జోళ్ళలో వేసుకునే ఎలక్ట్రిక్ రేకులూ మొదలైన రకరకాల విద్యుత్ పరికరాలు అమ్ముతూండేవారు. జోళ్ళలో వుంచుకునే విద్యుత్ పరికరంవల్ల మనిషి నడుస్తున్నపుడు, అతని దేహంలోకి కొత్త శక్తి ప్రవేశించి, అతనికి నూతన బలాన్నిస్తుందని, మా వాళ్ల కప్పట్లో గాఢ నమ్మకం.

ఎలక్ట్రిసిటీ మా పట్నంలోనూ మా జీవితాల్లోనూ ప్రవేశించినప్పటికీ, మా కాలమెప్పుడూ దాని వింతలు విశేషాల్తోగాక, యితరములైన ఆటపాటల్తో గడిచేది. ముఖ్యంగా గాలిపటాలు ఎగరేయడమంటే మాకెంతో సరదా. గాలి బాగా వీచే రోజున ఒక పెద్ద గాలిపటం పుచ్చుకుని, సెంట్రల్ పార్కు వైపుగా వెళ్లేవారం. రెండు పైసలకి గాలిపటం దొరికేది. పది సెంట్లిస్తే తాడు వుండ. ఇక గాలిపటానికి కావలసిన తోక, ఏ పాత పీలికైనా కట్టవచ్చు. గాలిపటాలు ఎగరవేస్తూ, గంటలకి గంటలూ గడిపేసే వారం.

అందులో మాకు పోటా పోటీలు; ఎవరి గాలిపటం, ఎక్కువ ఎత్తు వెళ్ళిందని పందెం వేసుకోడం!

ఇలా వుండగా ఒకరోజున మా పార్కుకి కొత్త మాదిరి గాలి పటం పట్టుకొచ్చాడు ఒక కుర్రాడు. మేము చుట్టూచేరి ఇదేమిటి ఇదేమిటని ప్రశ్నించాము. అతని గాలిపటం ఒక పెట్టె మాదిరివుంది. కర్ర ముక్కలతోనూ, బట్టలతోనూ చేసిన ఒక చిన్న పెట్టె. దానికి తోక అక్కర్లేదుట.

మాకు ఈ గాలిపటం ఒక వింత వస్తువులా కనపడింది. అది గాలిపటం కాదు, గాలిపెట్టె. దానిని గాలిలోకి వదిలి పెట్టాక, మేమందరం అతని చుట్టూ చూస్తూ నిలబడ్డాం. ఆ అబ్బాయి మా అందర్నీ ఒకళ్ళ తర్వాత ఒకళ్ళుగా తాడు కొస పట్టుకు చూడమన్నాడు.

"అబ్బో, చాలా బరువుగా వుంది" అని ఒకరూ;

"యీ తాడు తెగిపోయేటట్టు వుంది" అని మరొకరూ.

"దీని 'పుల్' చాలా తీవ్రంగావుంది. ఎగరేసేవాడిని కూడా నేలమీద గుంజేసేటట్లు వుంది" అని మూడో అతనూ - యీప్రకారం గాలిపెట్టె తాడు పట్టుకున్న ప్రతి ఒక్కరూ, అభిప్రాయం చెప్ప సాగారు.

గాలిపటం ఎగరవేస్తూ, దానితోపాటు గాలిలోకి ఎగర గల గడమనే భావన, మా అందరికీ ఎంతో సంతోషాన్ని యిచ్చింది. ఆ

మధ్యాహ్నం అంతా గాలిపటంతోపాటు మనంకూడా ఎగిరితే ఎల్లా వుంటుంది, అనే విషయమే మాట్లాడుకున్నాం.

కొన్నాళ్ళు గడిచేటప్పటికి గాలిపటాలు ఎగరవేసే పిల్లలు మామూలు గాలిపటాలు మానేసి, గాలిపెట్టెలు మాత్రమే పట్టుకు రావడం మొదలుపెట్టారు. ఈ గాలిపెట్టెలు ఒక్కొక్కటీ యాభై సెంట్లూ, డెభై అయిదు సెంట్లూ, ఒక డాలరూ యీ లెక్కన అమ్మేవారు. సైజునిబట్టి ధర వుంటూండేది. గాలిపెట్టె ఎగరవేసి నపుడల్లా అది ఎంత పెట్టె అయితే, నేలమీద నుంచున్న కుర్ర వాడిని గాలిలోకి తీసుకెళ్ళ గలుగుతుందీ, అను విషయంమీద తర్జన భర్జన జరిగేది. ఇప్పుడు ఎగరవేస్తున్న గాలి పెట్టెకు పది రెట్లు పెద్ద దవుతే, అది నూరు పౌనులు బరువుగల కుర్రవాడిని తనతోపాటు గాలిలోకి తీసుకెళ్ళగలదని కొందరు అంచనా వేశారు. మరికొందరు యిదంతా తెలివి తక్కువ ఆలోచన అన్నారు.

మా లెక్కలూ వాదప్రతివాదాలూ, ప్రతిరోజూ సాగు తున్నాయి. అంచనాలు వెయ్యలేక మాకు విసుగెత్తిపోయింది. ఇలావుండగా ఒక రోజున వార్తా పత్రికల్లో గాలిపెట్టెని పోలిన గ్లయిడర్ (Glider) బొమ్మ పడేసరికి మేమందరమూ ఆశ్చర్య పోయాం. ఆ గ్లయిడర్ నేలమీదవున్న మనిషిని తనతోపాటు గాలి లోకి తీసుకెళ్ళగలదుట.

ఈ బొమ్మపడ్డ కొద్ది రోజులకే వార్తాపత్రికలు మరొక బొమ్మ ప్రచురించాయి. ఓహియోలోని యిద్దరు బైసికిల్ మెకానిక్స్ ఒక

గాస్ యింజనూ, రెండు ప్రొపెలర్స్ (Propellers) గల గ్లయిడర్‌ని నిర్మిస్తున్నారనీ, యీ యింజనూ ప్రొపెలర్సూ గాలిలోకి లేచిన గ్లయిడర్‌కి గాలిలో ఎగరగల శక్తి సమకూర్చగలవనీ ప్రచురించారు.

కుర్రవాళ్లమైన మాకు ఈ ప్రయత్నమంతా చాలా గొప్పగా కనవడింది. కాని పెద్ద వాళ్ళు మాత్రం ఆ ఓహియో సోదరులకి కొద్దిగా మతి చెడిందన్నారు. గాస్‌తో నిండిన బెలూన్ గాలిలోకి ఎగరగలగడమనేది, శాస్త్రీయసిద్ధాంతానికి కట్టుబడిన విషయం కాబట్టి అది సబబని వొప్పుకున్నారు. ఇంత బరువైన యంత్రం గాలిలో ఎలా ఎగురుతుంది, అది అసాధ్యమైన సంగతి అన్నారు అందరూను.

"ఎగిరేందుకు బోలెడంత వ్యవధివుంది. గోల్డెన్‌గేట్‌వద్ద సెయింట్ పీటర్ మనకి రెక్కలు యిచ్చినపుడు నిక్షేపంగా ఎగరవచ్చు. యీ భూమిమీదవుండి ఎగురుదామనుకోడం తెలివి తక్కువ – నామాట నమ్మండి." అంది మిసెస్ లియరీ.

ఫిడేళ్ళు చేసే మల్జ్ గాలిలో ఎగరడం గురించిన మాట విని ఫక్కున నవ్వాడు. "నీటిమీద ప్రయాణం చేసినట్లు గాలిలో వెళ్లాలనుకోడం మానవుల తెలివి తక్కువ తనం. మీకు ఎగరాలని వుందా? నేను మార్గం చెబుతాను. యింటి కప్పుమీదకు వెళ్ళి, ఒక గొడుగు తెరిచి, తెరిచిన గొడుగుతోపాటు కిందకి దూకండి. గాలిలో ఎగరడమంటే అట్లాగే వుంటుంది."

మా చుట్టుల షాపుకి వచ్చిన ప్రతి ఒక్కరూ ఎగరడం గురించిన విషయం వచ్చేసరికి, వేళాకోళాలు పలకడమేగాని, రైట్ సోదరుల విషయమై ఒక్కరు కూడా సానుభూతి కనబరచ లేదు. వాళ్లపేరు చెప్పకు అందరూ పకపక నవ్వుకోడమే!

ఆ రోజుల్లో ప్రొఫెసర్ సైమన్ న్యూకూంబ్ (Simon Newcomb) అను శాస్త్రజ్ఞుడు గణితశాస్త్రరీత్యానూ తర్కశాస్త్ర రీత్యానూ మానవులు గాలిలో తేలగలగడం అసంభవమని ఒక ఆర్టికల్‌లో నిరూపించి చూపించాడు. మనిషి ఎప్పుడైతే నేలమీంచి గాలిలోకి ఎగురుతాడో, గాలిలోకి విసరబడ్డ రాయివలె అతను నేల మీదపడక తప్పదని భౌతికశాస్త్ర సిద్ధాంతాలతో రుజువు చేశాడు. ప్రొఫెసర్ న్యూకూంబ్‌కి సాయంగా అమెరికన్ నేవీలోని చీఫ్ యింజనీరు ఎడ్మిరలు జార్జినార్తు 'అట్లాంటిక్ రెవ్యూ' అను పత్రికలో, నేలమీద నడవవలసిన మానవులు గాలిలో ఎగరబూనడం ఎంత తెలివి తక్కువ తనమో, సోదాహరణంగా పేర్కొన్నాడు.

ప్రజాభిప్రాయాన్ని యీ ప్రముఖులు తమ వ్యాసాల్లో వివరించారు. ఆ తరువాత వార్తాపత్రికలు, ఓహియోలోని రైట్ సోదరులు, పన్నెండు తఫాలు తమ యంత్రాన్ని నేలమీదనుంచి పైకి తీసుకెళ్లడానికి ప్రయత్నించి విఫలులవడం గురించిన వార్త ప్రకటించేసరికి ప్రజలూ, ప్రముఖులూ సంతృప్తాంత రంగులయారు.

1903 సీతకాలంలో రైట్ సోదరులు తమ యంత్రాన్ని గాలిలోకి తీసుకెళ్లగలిగారన్న వార్త వెలువడింది. ఈసారి యీ

రైట్ సోదరులు గాలివాటం బాగావుండే ప్రదేశంలోకి తమ యంత్రాన్ని తీసుకెళ్ళి, దానిని గాలిలోకి లేవనెత్తే ప్రయత్నం చేశారుట. గాలిలోకి లేచిన యీ యంత్రం పన్నెండు సెకనులు మాత్రం నుల్చొ కలిగింది. నిరాశ నెరగని రైట్ సోదరులు మళ్ళీ మళ్ళీ ప్రయత్నించసాగారు. నాలుగవ ప్రయత్నంలో యిదే యంత్రం నలభై తొమ్మిది సెకండ్లు గాలిలో వుండగలిగింది. అది ప్రయాణం చేసిన దూరం, 852 అడుగులు. ఇప్పుడీనాడు, ఒక్క నిముషం గూడా గాలిలో నిలబడలేకపోయిన యంత్రం గురించి చెప్పుకుంటూంటే ఆశ్చర్యంగా వుంటుంది. రైట్ సోదరులు చేస్తున్న ప్రథమ ప్రయత్నాన్ని పరికించడానికి వచ్చినవారు - ఆ చుట్టు పక్కలవున్న సామాన్య కుటుంబీకులు. వాళ్ల వూళ్ళో ఒకే ఒక్క వార్తా పత్రిక వుంది. ఆ పత్రికా ప్రతినిధి మాత్రం వచ్చాడు. ముఖ్యనగరాల్లోని పత్రికలవారు, రైట్ సోదరులు చేస్తున్నది ఒక వృథాప్రయత్నమనీ అది విఫలం కాక తప్పదనీ, తమలో తాము అనుకుని, ఆఖరికి ఆ వార్తని కూడా చాలారోజులవరకూ వారు ప్రచురించనేలేదు. విమానయానం చాలా గొప్పగా వుంటుందని ప్రజలకి అంతర్యంలో అయితే వుందిగాని, రైట్ సోదరుల ప్రయత్నాలు మాత్రం ఏవో తెలివి తక్కువ పనులలాగా అవుపడేవి. గాలిలోకి ఒక యంత్రాన్ని తీసుకెళ్లి నిలబెట్టినమీదట కూడా రైట్ సోదరుల గురించి యింకా హాస్యాస్పదంగా అనుకుంటూనే వుండేవారు.

ఇరవయ్యో శతాబ్ద ప్రారంభాన క్రొత్తదైన ప్రతిదీ వేళాకోళంగా చూడబడేది. అది తమ జీవితాలని మార్చనున్నదని ప్రజలు ఎంతకీ వొప్పుకునేవారు కాదు. రైట్ సోదరులు 1904

వసంతకాలంలో కాబోలు, తమ యంత్రాన్ని గాలిలో చాలాసేపు నిలబెట్టగలిగారు. ఎంతసేపు నిలబెట్టారో నాకు జ్ఞాపకంలేదుగాని ఆ తరువాత ప్రజలు విమానయానాన్ని గురించి చులకనగా మాట్లాడటం మానేశారు. ఇన్నాళ్ళూ నవ్వుతాలుగా నిలచిన విషయం, అమాంత్రం ఘనవిజయమై పూరుకుంది. రెక్కలుగల యంత్రాలు గాలిలో ఎగర నారంభించాక, లోకవ్యవహారం మారి పోయింది.

ప్రళయం రానున్నదని గత శతాబ్దాంతాన చెప్పిన మను షుల మాటలు వృథా కాలేదు. ఒకవిధంగా పాత ప్రపంచం నశించిపోయింది. నూతన జగతి వుదయించింది. ఈ నూతన జగతితోపాటు వైద్యరంగంలోని పరిశోధనలూ, విద్యుత్‌పరికరాలూ, మోటారు యంత్రాలూ, చలనచిత్రాలూ, నిస్తంత్రీవిధానమూ విమా నాలూ మొదలైనవన్నీ వచ్చేశాయి.

వీటి రాకతో ప్రజల దృక్పథం మారిపోయింది. ఇంతవరకూ మానవునికి ఆధ్యాత్మికానందం సమకూర్చుతున్నవి మతమూ, కళలూ, కవనమూ సంగీతమూ మాత్రమే! యివి యింక మానవుని తృప్తిపరచలేకపోయినకాలం అంకురించింది. యంత్రాలరొజ అరణ్యరోదనని మరిపింపజేసింది. మానవుడు ప్రకృతిని మర్చి పోయి యంత్రాలవైపుగా జరిగాడు. ఈ యంత్రాలతనికి నూతన ఆర్థికతత్వమూ, శాస్త్రవిజ్ఞానమూ ప్రసాదించాయి. వాటి ద్వారా జీవితాన్ని సుఖతరం చేసుకోలేకపోతానా అని మానవుని ప్రగాఢ వాంఛ.

20-వ శతాబ్దం, మానవజీవితంలోకి ఒక నూతన వేగాన్ని తీసుకుని వచ్చింది. ఆ నూతన వేగంతోనే మానవులు ఆధునిక యుగంలోకి పాదం పెట్టారు.

# వసంతమూ వేసవీ

ప్రతి వసంతకాలంలోనూ, అనగా మార్చినెలలో న్యూయార్కు నగరంలోని అయిరిష్ ప్రజలు సెయింట్ పాట్రిక్స్‌డేని (స్మారక దినాన్ని) మహావైభవంగా జరిపేవారు. చిరుచలితోపాటు వెచ్చదనమిచ్చే ఆ రోజుల్లో, ఆపండుగను అయిరిష్‌వారే కాకుండా న్యూయార్కులోని అందరమూ, ఎంతో వైభవంగా జరుపుకునే వారము. సెయింట్ పాట్రిక్స్ స్మారకదినం నాడు జరిపే వుత్సవాల కోసం చాలారోజులపట్టి ఎదురు చూడటం జరిగేది.

ఆ రోజు తెల్లవారినప్పటినుంచీ వుత్సవం ప్రారంభమయేది. చిల్లరవిక్రేతలు (Vendors) రంగు రంగులవీ వింతవింతలవీ అయిన వస్తువులు, ముఖ్యంగా ఆకు పచ్చరంగులో వుండేవి తెల్ల వారడంతోనే వీధిలోకి పట్టుకొచ్చేవారు. బొమ్మలూ గుండీలూ రిబ్బన్లూ, సంగీత వాయిద్యాలూ (Harps) యిలాటివస్తువు లనేకం పట్టుకొచ్చేవారు. వీటిని కొనేవారు కూడా చాలా ఎక్కువమంది వుండేవారు. ఈ కొనడం అయిరిష్‌వారే కాకుండా అందరమూ కొనేవారం. సెయింట్ పాట్రిక్ జ్ఞాపకార్థం ఆ రోజున ఆకుపచ్చవి కొనడమూ, ధరించడమూ మా కందరికీ అలవాటు అయి పోయింది.

ముఖ్యంగా అయిరిష్‌వారికి ఆకుపచ్చవి ధరించడమంటే ఎంత గౌరవమో ఆనాటి వుదయం తెలిసేది. ఆకుపచ్చ టోపీలూ ఆకుపచ్చ నెక్‌టైలూ, ఆకుపచ్చకోట్లూ, ఆకుపచ్చ రుమాళ్ళూ - ఒకటేమిటి ప్రకృతితోపాటు మనుషులు కూడా ఆకుపచ్చరంగుతో చెలిమి చేసుకునేవారు. ఆనాటి ఆకుపచ్చని కాంతి నేత్రానందంగా వుండేది.

ఈ పండగ ఫిఫ్త్ ఎవెన్యూలో జరిగేది. న్యూయార్కు నగర వాసులందరూ, యీ పండగని చూసేందుకుగాను అక్కడికి తరలి వెళ్ళేవారు. ఆ వేలాది ప్రజల రూపురేఖలూ చూడవలసిందే గాని వర్ణించి చెప్పలేము. బక్క పలచని కన్నెలూ, పీపాల వలె పెరిగిన మధ్యవయసు స్త్రీలూ, రాజకీయవాదులూ, షాపు కీపర్లూ, కంట్రాక్టర్లు, కార్మికులూ, కార్మిక నాయకులూ, పొడుగు చుట్టలు కాల్చే వృద్ధులూ, అతి సంతోషంగా కనపడే స్కూలు పిల్లలూ, తప్పుకు తప్పుకు నడిచే అమ్మాయిలూ అదంతా వింత రంగుల జనసందోహం. ఆ విభిన్నతలో ఒక చైతన్యమూ, జీవమూ కనపడేది. బాండ్లు మోగించేవారు, బాగ్‌పైపులు వూదేవారూ, వీళ్ళ గురించి చెప్పనేలేము. ప్రతి గుంపుకీ ఒక బేనర్ (జండా) వుండేది. ఒక బేనర్‌కీ మరొక బేనర్‌కీ కొద్దిపాటి తేడాలువున్నా, అన్నిటిలోనూ "ఇంగ్లాండూ, నీవు అయిర్లాండునుంచి తప్పుకో" అన్న వాక్యం మాత్రం విధిగా అగుపించేది.

జనసామాన్యము కాలి నడకని నడిచేవారు. న్యూయార్కు లోని ధనవంతులైన అయిరిష్‌వారు, తమ ఆధిక్యత కనపరచు

కునేందుకు గుర్రాలమీద వచ్చేవారు. ఈ ధనవంతులు, చారల పంట్లాములు వేసుకు, సిల్కు టోపీలు పెట్టుకు ఆకుపచ్చ రంగు గల బెల్టులు ధరించేవారు. వీరిలో కొందరికి గుర్రాలు లేనపుడు, వారు అద్దె గుర్రాలు తెచ్చుకుకూడా, యీ ప్రదర్శనకి రావడం కద్దు. సంబరానికి ప్రయత్నాలు వుదయంనుంచి జరిగేవి. ఉత్సవం మధ్యాహ్నం ప్రారంభమయేది. చాలామంది ముఖ్యులు, ఆ ఉత్స వంలో పాల్గొని, దానిని ఫిఫ్త్ ఎవెన్యూనుంచి థర్డ్ ఎవెన్యూ దాకా నడిపించేవారు. సాయంత్రం పడేసరికి అయిరిష్ ప్రజలంతా థర్డ్ ఎవెన్యూలో వుండేవారు.

అది వారికొక సంతోషదినం. పద్యాలూ, పాటలూ, కోలా హలం, గంటగంటకీ పెరిగేది. సంబరంలోని ప్రజలు ఆనందో త్సాహంలో మునిగిపోయేవారు.

మూడవ ఎవెన్యూలోని ఒక మంచిచోట, నాకు ప్రతి ఏడూ స్థలం లభించేది. మా చుట్టల షాపు కొంచెం ప్రముఖ స్థానంలో వుండటంవల్ల యీ పండగ చూడ్డం నాకన్ని విధాలా వీలుగా వుండేది. మా షాపుకి దగ్గరలోనే హెన్నెసిస్ (Hennessy's) అను ఒక కొట్టుండేది. అక్కడికి డబ్లిన్ కుర్రవాళ్ళూ, దక్షిణ ఆయిర్లాండులోని యువకులూ వస్తూండేవారు. డబ్లిన్ కుర్రవాళ్లు విద్యా విషయంలోవున్నతులైనప్పటికీ, తమదేశంలోని దక్షిణప్రాంతా నికి చెందిన యువకులపట్ల ఎంతో స్నేహభావంతో ప్రవర్తించేవారు.

దక్షిణప్రాంతంవారు కొంచెం దురుసువారు. అయినప్పటికీ సంవత్సరం పొడుగూతా, యీ విద్యావంతులకీ ఆ సామాన్యయువకులకీ అంతగా కలహాలు వచ్చేవికాదు. సెయింట్ పాట్రిక్స్ స్మారక దినం నాడు మాత్రం హెన్నిసీ షాపులోనివారికీ, దాని కెదురుగా వున్న టూల్సు షాపులోనివారికీ చిన్న యుద్ధం జరిగేది. ఈ విద్యావంతులూ ఆ సామాన్య యువకులూ, మత్తుపదార్థాల ప్రభావంతో ఒకళ్ళమీద ఒకరు కలబడేవారు. మా చుట్టల షాపులో కూచుని వారి పోరాటం ఎలా ప్రారంభమయి, ఎలా అంతమయేదీ చూడటం చాలా తమాషాగా వుండేది. ఇన్నాళ్ళూ స్నేహభావంతో వున్నవారు యిటువంటి పుణ్యదినాన ఎందుకు విశృంఖలంగా ప్రవర్తించేవారా అంటే, అందుకు కారణం చెబుతాను. హెన్నెసీ షాపుకీ, టూల్సు షాపుకీ వ్యాపారవైరం వుండటం సహజం. యీ వ్యాపారవైరం సెయింట్ పాట్రిక్స్ డే నాడు వుగ్రస్తితినందుకునేది. ఒక షాపులో వారు బయటికి వచ్చి, సెయింట్ పాట్రిక్ గురించి నాలుగు మాటలు వుపన్యాసధోరణిలో చెప్పి ఆపైన అవతల షాపులోని వ్యక్తుల దుర్మార్గపు పనులవల్ల తామెందుకు కత్తికట్టవలసి వచ్చిందో నోటికొచ్చినట్లు అనేవారు. పాపం, ఆ సెయింట్ గురించి రెండు మూడు వాక్యాలకంటె ఎక్కువ వుండేవికాదు. మిగతాదంతా అవతలవారిని తిట్టడమే. అవతల షాపులో వారు కూడా యిదే పద్ధతి అవలంబించేవారు. వీరిని వారూ, వారిని వీరూ కాసేపు తిట్టుకున్నాక, రెండు పక్షాలలో వుద్రేకం చెలరేగాక, తాము తాగుతున్న మత్తు పానీయాలు ఒకరిమీద ఒకరు చల్లుకునేవారు. రెండూ రెండు యుద్ధశిబిరాలుగా తయారయేవి. యుద్ధధర్మ ప్రకారం శత్రుకూటంలోకి గూఢచారులని పంపేవారు. సంధి జరి

పెందు కొచ్చే దూతలని దూషించి, వారిని అవమానపరిచి పంపే వారు. ఎప్పుడైతే తమ దూతని అవతలపక్షం అవమానపరిచిందో ఆ అవమానం తమకేకదా ! తమని అవమానించినట్లేకదా! ఈ అవమానాన్ని భరించలేక వెంటనే యుద్ధశంఖం పూరించేవారు.

ఈ గొడవ ప్రారంభమవడం చాలా మర్యాదగా, రాజకీయ సూత్రాలని తుచ పాటిస్తూనే ప్రారంభమయేది. కాని యుద్ధం ప్రారంభమయాక, ఎవరికి వారు, తమ పక్షానికి కావలసిన సేనని సమకూర్చుకునేవారు. మంచి లావుగా, పొడ్డూ పొడుపూవున్న మనుషులు, కొందరు అనుచరులని వెంట తీసుకు శత్రుపక్షంలోకి వెళ్లేవారు. అప్పుడు జరిగేదేముంది గనక - యిద్దరూ మరింత గట్టిగా తిట్టుకుని, విజృంభించేవారు. స్థూలకాయునితో వచ్చిన అనుచరులు, యిక్కడ కొంప మునిగిపోతోందని వెనక్కి వెళ్ళి రిపోర్టు యిచ్చేవారు. వీరి మనుషులూ వారి మనుషులూ రోడ్డు మధ్య తలపడి, వొకరి నొకరు కొట్టుకునేవారు. అసలు యుద్ధం యింకా ముందువుంది. ఎంచేతననగా, అసలు యుద్ధం ప్రారంభమయేసరికి యిరుపక్షాలవారూ పూటుగా తాగి, తాము ఏమిటో మర్చిపోయే స్థితిలో వుండాలి.

ఒక్కొక్క అరగంటా గడవడంతో బీరుపీపాలు ఖాళీ అయేవి. రెండువైపుల వారికీ ధైర్యసాహసాలు సమకూడేవి. టూల్సు కొట్లోనివారు డబ్లిన్ విద్యార్థులని, అసగా హెన్నెసీ షాపు లోని వారిని యింగ్లాండు రాజు పాదాల దగ్గిర పడివున్నారనీ దేశాభిమానశూన్యులనీ, చదువుకున్నా పొట్టి జానెడుబుద్ధి అనీ

నిందించేవారు. ఈ డబ్లిన్ విద్యార్థులు అవతలవారికి నీతిజాతిలేదనీ ప్రొటెస్టెంట్ మతవిద్రోహులనీ అనేవారు. ఒక గాయంమీద ఒక గాయంగా, ఒకరి నొకరు మాటల్తో గాయాలు చేసుకునేవారు. మాటల యుద్ధం శృతిమించాక చేతులు కలపాలి కద!! యీ తిట్లు ఒకదానిమీద ఒకటి కుప్పగా ఏర్పడి, యిరుపక్షాలలోనూ ద్వేషాగ్ని రగుల్కొల్పి రెండుషాపులని రెండు యుద్ధమందిరాలుగా మార్చేవి.

అప్పుడు ఇటునుంచో అటునుంచో ఒక నాయకుడు, "మీరు అయిరిష్ పుత్రులు కారా? మీలో వుడుకు రక్తం ప్రవహించడం లేదా? మీరు వట్టి చవటలూ పిరికిపందలూనా?" అని నడిరోడ్డు మీద కొచ్చి బిగ్గరగా అరిచేవాడు. ఆ అరుపుతో యిటువైపువారూ, అటువైపువారూ నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ, యుద్ధ భూమిలో ప్రవేశిస్తున్నట్లు చెరోవైపునుంచీ వచ్చి చేరుకునేవారు. రోడ్డుమీద కొద్దిపాటి స్థలంమటుకే మిగిలేది. జనసందోహంలో అప్పటికే ఉద్రిక్తపరిస్థితి ఏర్పడిపోయివుండేది. శత్రువుమీద ఏ క్షణాన విరుచుకుపడి తన ధైర్యసాహసాలు చూపగలనా అని ప్రతివొక్కడూ మనసులో తలపోస్తూండేవాడు. రెండు సేనలకీ మధ్య పది బారల స్తలం వున్నపుడు, నాయకుల్లో ఒకతను మళ్ళీ అరిచేవాడు: "చూడండి, మనమీదకి వస్తున్నారు - సిగ్గు భిడియం లేని వాజమ్మలు. వీళ్ళని నరికేసినా పాపం లేదు. ఆ ఆకు పచ్చ దుస్తులు వేసుకునేందుకు అందులో ఏ ఒక్కడూ తగడు. ఈ పుణ్యదినాన ఆకుపచ్చవి ధరించడానికి అర్హతలేని క్రూరులు, దుర్మార్గులు, రాక్షసులు - చూడండి వాళ్ళని!" అంటూ అవతల

వారిని అన్నివిధాలా కించపరుస్తూ తను ఎంత బిగ్గరగా అరవ గలడో అంత బిగ్గరగానూ అరిచేవాడు.

అవతల నాయకుడు వూరుకుంటాడా! అతనూ యితనంత బిగ్గరగానే అరిచేవాడు. "రాక్షసులు, పాపిష్టులు, వీళ్ళని తుద ముట్టిస్తేగాని, లోకం బాగుపడదు. మీలో ప్రతివొక్కడూ, వాళ్ళలో ఏడుగురిని మింగేయగలడు. ఒక్క క్షణంకూడా వృథా కానీయ కండి. విజృంభించండి. ఈ పుణ్యదినాన ఆ పాపకర్ములకి బుద్ధి చెప్పి, మన ధర్మం నెరవేరుద్దాం."

అంతే - ఆపైన రెండుపక్షాలూ ఒకదానితో ఒకటి తలపడేవి. యుద్ధం ప్రారంభమయేది. రోడ్డుమీదవున్న స్తంభాలు, వారిని అక్క డక్కడ అటకాయిస్తూండేవి. ఆ స్తంభాలు లేకపోతే, పోరాటం మరెంత దిగ్విజయంగా సాగేదో కదా అనుకునేవారు. ఎక్కడి కక్కడ గుంపులుగా చీలిపోయి కొట్టుకోడం ప్రారంభించేవారు. దెబ్బలు మరీ ఎక్కువగా తగులుతున్నాయని తోచినపుడు నేల మీదపడిపోయి, మళ్ళీ కాసేపయాక లేచేవారు. తాగుడు ఎక్కువ అవడంవల్ల, ఒక వంక తూగుతూ తుళ్ళుతూ యుద్ధకాండ నిర్వ హించేవారు.

యుద్ధం మాంచిపట్టులోవున్నపుడు, దూరాన మిగతా షాపుల్లోవున్న వ్యక్తులు కూడావచ్చి యీ సంబరపు అంతిమ ఘట్టంలో పాల్గొనేవారు. థర్డ్ ఎవెన్యూలో యుద్ధం రగుల్కొం దన్న విషయం అంచీలమీద పాకిపోయేది. డబ్లిన్ విద్యార్థుల

తరఫువారూ, వారి విరోధులూ మాత్రమే కాకుండా, ఏ పక్షాన పాల్గొనడానికైనా సరే యిష్టపడే వాలంటీర్లు రంగంమీదకి వచ్చే వారు. యీ వాలంటీర్లకి యుద్ధం ఎందుకు జరుగుతోందన్న ప్రసక్తి గానీ, తాము ఎవరిపక్షాన పోరాడాలనే ప్రమేయంగానీ ఎంతమాత్రం వుండేదికాదు. ఒకచోట యుద్ధం జరుగుతున్నపుడు, ఆ యుద్ధంలో చొరబడటమే వారికి సంతోషకారకం. ఇది గవర్నమెంటు యుద్ధం కాక ప్రయివేటు యుద్ధం కావడంవల్ల తాము, తమ యిష్టప్రకారం పాల్గొనవచ్చునని వారికి తెలుసు.

థర్డ్ ఎవెన్యూలో మాకు కనిపించినంతమేరాయుద్ధభూమి అయిపోయి, ఒకళ్ల నొకళ్లు యిష్టంవచ్చినట్లు తన్నుకుంటున్న సమయంలో, యుద్ధం మరీ తీవ్రస్థాయినందుకున్నమీదట పోలీసులువచ్చేవారు. పోలీసు లెప్పుడూ ఆలస్యంగా వస్తారన్నవిషయం మనకి తెలిసిందేకదా ! సెయింట్ పాట్రిక్‌దినం నాడు, వారుగూడా ఆకుపచ్చ దుస్తులు ధరించేవారు. ఆ రోజున ముఖ్యంగా అయిరిష్ వారిని అరెస్టుచెయ్యడం వారికి అధర్మంగాతోచేది. అంచేత, గాయాలుతగిలి నేలమీద పడ్డవారిని హాస్పటల్‌కిజేర్చి, మిగతా వాళ్లందరినీ తరిమేసేవారు. పోలీసులువచ్చిన కొద్దిసేపటికే, గాయ పడినవారు తప్పిస్తే, మిగతా యుద్ధవీరులు ఎక్కడి కక్కడ చల్లగా తప్పుకునేవారు. పోలీసులు తమ బళ్లలో గాయపడ్డవారిని తీసుకెళ్లాక, థర్డ్ ఎవెన్యూ చూడ్డానికి భయంకరంగా అవుపడేది. పగిలిపోయిన సీసాలు, గాజుపెంకులు, టోపీలు, చినిగిపోయిన కోట్లు, వీధిలోకి విసిరేయబడిన కర్రసామాగ్రి; వీధి వీధంతా నానా ఖంగాళీగానూవుండేది. పాపం, మాపాపుకి కాపలాకాసే కర్ర సోల్జరు చెయ్యి రెండు తడపలు విరిగిపోయింది.

మా సోల్జరు కింతకష్టం కలగడం నాకెంతో బాధనిపించింది. అదేమీ ఫరవాలేదు, రిపేరు చేయించపచ్చు - అన్నాడు తాతయ్యా. వసంతకాలంవచ్చింది; మా కఱ్ఱ సోల్జరుకి కొత్త పెయింట్ వెయ్యవలసిన టైముకూడాను. అందుకని మా తాతయ్యాచెప్పిన సంజాయిషీతో సరిపెట్టుకున్నాను; లేకపోతే పెద్దపెట్టున ఏడుపొచ్చేదే!

వసంతోదయ మనగా ప్రతివారికీ ఆనందదాయకం గదా! సెయింట్ పాట్రిక్సుడేతో సీతాకాలం వెళ్ళిపోయి, నునివెచ్చని వేసంకాలం ప్రారంభమయేది. రగ్గులు దులిపి దాచేసేవారం. గృహాలకి నూతన అలంకరణ ప్రారంభమయేది. సామాను తుడుచుకునే 'డస్టర్లు' అమ్మే మనుషులు వీధుల్లో కనపడేవారు. వసంతోదయంతో గృహిణులకి చేతినిండా పని తగిలేది. మందుల షాపుల్లో వారు, సీతాకాలంలో అమ్మకమయే దగ్గుమందులూ, కాడ్లివర్ ఆయిల్, ఆవపట్టీలూ, (Mustard Plasters) మొదలైనవి లోపలపెట్టి వసంతకాలపు మందులయిన వైనూ, ద్రాక్షపానీయాలూ మొదలైనవి బయట అలమార్లలో వుంచేవారు. "ఇది వసంతకాలం - మీ రక్తాన్ని పరిశుభ్రపరుచుకోవలసిన వసంతకాలం" అని ఆ అలమార్లకి బోర్డులుకట్టేవారు.

చలికాలంపోయి వసంతకాలం రావడంతో రకరకాలవస్తువులమ్మే వ్యక్తులు వీధుల్లో కనపడేవారు. మరి చలికాలంలో వీరంతా

ఏమైపోయేవారో, ఎక్కడుండేవారో! అద్దాలు బాగుచేసేవారు, గిన్నెలుమాటేవారు, గొడుగులమ్మేవాళ్లు, కత్తులకీ, కత్తెర్లకీ పదును పెట్టేవారు, రకరకాలమంది ప్రత్యక్షమయేవారు. ఇక పువ్వుల బుట్టల సంగతి చెప్పనేఅక్కర్లేదు. వాళ్ళతోపాటు హాకీ-పాకీ గూడావచ్చేది.

ఒక మధ్యవయస్కుడు, చిన్న కర్రబండిని తోసుకుంటూ, నాలుగురోడ్లూ కలిసేచోటుకివచ్చి, ఒకమూలగా తన బండీని నిల బెట్టేవాడు. చుట్టుపక్కలన్నున్న పిల్లలందరూ ఆ బండిచుట్టూజేరి తమ చేతుల్లోవున్న పెన్నీ, హాకీ-పాకీమనిషికి యిచ్చేవారు. అతను ఒక చిన్నయంత్రం ద్వారా అయిసుని, కొబ్బరి కోరుకు మల్లేకోరి, దానిని పుల్లకి గుండ్రని బంతివలెచుట్టి, ఆ బంతిమీద మనకి కావల సిన రంగు సిరప్‌వేసి, యిచ్చేవాడు. ఆకుపచ్చా, ఎరుపూ, నారింజ రంగూ మొదలైన రంగుల్లో సిరప్‌లువుండేవి. హాకీ-పాకీ అమ్మే వారిలో ప్రతివొక్కరూ ఒక ప్రత్యేకమైన పిలుపు అలవాటు చేసు కునేవారు. ఆకేక మాకు, ఎంత దూరానవున్నా, యిట్టే చెవుల్లోపడేది. హాకీ-పాకీ మనిషి కేకవినడం ఎంత హాయిగా వుండేదను కున్నారూ!

వసంతకాలంతోపాటు కొందరు జర్మన్ పాటగాళ్ళుకూడా వీధుల్లో అవుపించేవారు. వారేదో విచారకరమైన రాగంలో వసంతో దయాన్నివర్ణిస్తూ పాటలు పాడేవారు. ఆ పాటల అర్ధం మాకొట్టే తెలిసేది కాదుకాని, ఆ సంగీతమాధుర్యం మా మనసులో నిలిచి పోయేది.

వసంతంవెళ్లి వేసంగిరావడంతో సెంట్రల్‌పార్కులో బాండు వాయిద్యం వినిపించేది. బాండ్‌మీద 'షికొవెస్కీ' (Tchaikovsky) "పద్దెనిమిదివందల పన్నెండు," విలయమ్ టెల్, "ది బ్యూటిఫుల్ బ్లూ డాన్యూబ్" మొదలైనవి పాడేవారు. నా చిన్నతనంలో నేను యిటాలియన్ బాండూ, హంగేరియన్‌బాండూ, జర్మన్ బాండూ యివన్నీవిన్నాను గాని సెంట్రల్‌పార్కులో వాయించే ఆ బాండుతో యివి సరితూగేవి కాదు. వేసవితోపాటు న్యూయార్కులో బాండ్ మ్యూజిక్ ముమ్మరంగావుండేది. చిన్నవాళ్ళమయిన మేము డబ్బు యివ్వకుండా వినగల మ్యూజిక్ అదొక్కటే; అంచేత మేము విధిగా వినేవాళ్లం బాండుని.

జూన్ నెలాఖరున స్కూళ్ళు కట్టెయ్యడంతో జూలై నాలుగున జరపబోయే స్వాతంత్ర్యదినోత్సవం కోసం ప్రయత్నాలు ప్రారంభించేవారం. ఆ నాడు భోగిమంటలువేయడం సరదా. నేనూ రీన్‌హార్టూ మరి కొందరు పిల్లలూకలిసి, యాభైరెండో వీధులోవేసే భోగిమంట అన్నిటికంటె పెద్దదిగావుండాలని ప్లాను. దానికిగాను ఎక్కడెక్కడి పాతకలపా పోగుచేసేవారం. ఒక్కొక్కప్పుడు మేము మోసుకురాలేకపోతే బండిలోవేసి పట్టుకొచ్చేవారం. ప్రతి యింటికీవెళ్ళి, మీ యింట్లో పనికిరానివస్తువులుంటే యివ్వండి - అని బతిమాలి, బామాలి తెచ్చుకునేవారం. కుంటికుర్చీలూ, కాళ్లు విరిగినబల్లలూ, మంచంపట్టీలూ, షాతకర్రముక్కలూ, ఏవి దొరుకుతే అవి పోగుచేసి వాటన్నిటినీ 'బాన్‌ఫైర్' కోసమని భద్రంగా

కాపాడేవారం. కొందరు పెద్దవాళ్ళు, మామీద కోపంవచ్చి, "పాత కర్రముక్కలెందుకూ - యీబ్లాకంతా తగలపెట్టండి, మీకళ్ళు చల్లబడతాయి" అనేవారు. యిలా అపసవ్యంగా అనే వారిమాటలు మేము లక్ష్యపెట్టేవాళ్ళమా? అసలు యీ మనుషులు పెద్దయిన కొద్దీ భోగిమంట అంటే, ఎందుకు విముఖులవుతారో మాకు అర్థమయేదికాదు. ఆ మంటలు చూస్తుంటే ఎంత బాగుంటుంది!! ఒకవేళ పొరబాటున మా భోగిమంటవల్ల ఏదైనా యిల్లే అంటుకుంది అనుకొండి; ఫైర్‌యింజనులు సిద్ధంగావున్నాయిగా; అసలు ఆ ఫైర్‌యింజనులు పనిచేస్తూండగా చూడ్డం మాత్రం ఎంత సంతోషంగా ఉంటుంది! ఒక్కొక్కసారి మేమొక పాతకుర్చీ మంటలోకి విసురుతున్నపుడు, "అంత మంచికుర్చీ తగలపెట్టడమేమిటి," అని మా చేతుల్లోంచి ఆ కుర్చీని లాక్కొ బోయేవారు కొందరు. మాదైన వస్తువుని మేము ప్రాణాల్తో వదిలేవాళ్లం కాదు. జూలై నాలుగున పిల్లల్తోపాటు కొందరు పెద్దలు కూడా కలిసేవారు. ఆ పెద్దలు మాకు అండగా నిలబడి, మాఆనందానికి విఘాతం కలిగించేవారినుంచి మమ్మల్ని కాపాడేవారు. చట్టప్రకారం మేమింతటి పెద్ద మంటలు నడిరోడ్డు మీద పెట్టకూడదుట. చట్టాలూ, గిట్టాలూ మాకు తెలియదు. యాభై రెండో వీధిలోని మా భోగిమంట ఎంత ఎత్తుగా లేచి, ఎంత ఉజ్వలంగా నిప్పురవ్వలు వెదజల్లుతుందా అని మా తాపత్రయం. ఒక్కొసారి యీ మంట యిళ్ళంత ఎత్తున లేచేది. మంట బాగా లేచినమీదట, టపాకాయలు కాల్చడం ప్రారంభించేవారం. మేము కాల్చే టపాకాయలతో యిరుగు పొరుగువారికి చెవులు దిబ్బెళ్ళు పడిపోయేవిట. స్వాతంత్ర్యదినాన్ని మేమింత బ్రహ్మాండంగా జర

పడం, పెద్దల కెందుకనో గిట్టక, అప్పుడప్పుడు కడవల కొద్దీ నీళ్ళు మేడ పైభాగంనుంచి, మంటల్లోకి పోస్తూండేవారు. "మీ దురా గతాలు నానాటికి మరీ ఎక్కువవుతున్నాయి," అని మరికొందరు మమ్మల్ని మొహంమీదనే తిట్టేవారు.

మిస్టర్ హాడ్లీ ఒకసారి అన్నాడు: "ఈ భోగిమంటలు ఆఏటి కాయేడు అంతరిక్షానంటుకుంటున్నాయి. ఒకరోజున యీ మంటలే యీ పట్నాన్ని మింగేస్తాయి. నిన్నరాత్రి ఫైర్ డిపార్టుమెంటుకి ఎన్ని పిలుపులొచ్చాయో లెక్కలేదు. వీధుల్లో మంటలు వెయ్యా డాన్ని బహిష్కరించాలి," అని కఠినంగా అన్నాడు. హాడ్లీవంటి వుత్తముడు యింతటిమాట అంటాడని అనుకోలేదు నేను. కాని ఆయన చెప్పింది కాలక్రమేణా నిజమయింది. భోగిమంటలు ఆయేటికాయేడు మరీ పెద్దవవడంతో వీధుల్లో మంటలు వెయ్యా కూడదని, శాసనం జారీచేశారు. మంటలుపోతే పోయాయి, టపా కాయలు కాల్చుకోనిస్తున్నారు కదా అని మేము తృప్తిపడి వూరుకున్నాం.

ప్రతి సంవత్సరం జూలై నాలుగో తేదీన స్వాతంత్ర్యోత్సవాలు జరిగాక న్యూయార్క్ నగరవాసులు వేసవికాలమొచ్చింది, వేసవి కాలమొచ్చింది అనేవారు. వెనక వాకిళ్లున్నవారు వెనక వాకిళ్ళలో కుర్చీ లేసుకు కూచునేవారు. ఉక్కపోస్తోందన్నమాట ప్రతివారి నోటా వినబడేది.

ఒక వేసవికాలం అమ్మమ్మా నేనూ కొండప్రదేశాలకి వెళ్లాం. "మనిద్దరం యీ సమ్మర్‌కి కంట్రీసైడ్ వెళ్తున్నాం" అంది అమ్మమ్మ.

"స్టాటెన్ ద్వీపానికా ?" అన్నాను.

"కాదు, నిజమైన కంట్రీసైడ్‌కి - కొండప్రదేశానికి."

నేనప్పటికి స్టాటెన్‌దీవి తప్ప వేరొకప్రదేశం చూసి ఎరగను. న్యూయార్కు వదిలి వెళ్ళింది ఆ ఒక్కచోటికి మాత్రమే. పర్వతాలనేవి బొమ్మల్లో చూశాను. ఆ బొమ్మలనుబట్టి ఆలోచిస్తే, అవి స్టాటెన్ దీవికంటె రమ్యంగా వుండేటట్టు వున్నాయి.

ఏమైనా, కొత్త వూరు వెళ్ళడమనేది నాకెంతో సరదాగా వుండి. పెట్టెలు సద్దడంలో అమ్మమ్మకి చాలా సాయబడ్డాను. ఆ వస్తువులతోపాటు నేను తీసుకెళ్లాల్సినవి కూడా చాలా వున్నాయి. బాటరీ, బెల్లూ, స్క్రూడ్రయివరూ, రెంచీలూ, బేస్‌బాలూ-యివన్నీ నా వస్తువులు. నా వస్తువులన్నిటితోటీ నేను సిద్ధమయాను. మా ప్రయాణానికి ఓ రోజు ముందుగా పెద్ద ట్రంకు రైల్లో పంపేశారు. మా వెంట చిన్నవి రెండుసూట్‌కేసులూ, భోజనపదార్థాలు పెట్టుకునే చిన్న బుట్టా పుచ్చుకుని తాతయ్యని పాపు చూసుకుంటూండమని చెప్పి మేము బయలుదేరాము.

మొట్టమొదట మూడో ఎవెన్యూలోని ట్రామ్ ఎక్కి, నలభై రెండో వీధికొచ్చాం, అక్కడ మళ్ళీ బండీమారి మా దీవికి పడమట నున్న - 'వీహాకెన్' (Weehawken) ఫెర్రీహౌసు చేరుకున్నాం. ఇక్కడ రేవుదాటి న్యూజెర్సీచేరుకుని, పడమటి తీరపురైలుబండీ ఎక్కాం. ఇంటి దగ్గిరనుంచి, రైలుస్టేషనుకి వచ్చేసరికి గంటన్నర

సేపు పట్టింది. నా కప్పటికే యీ ప్రయాణం విసుగనిపించింది. "అమ్మమ్మా, మనమింకా ఎంతసేపు ప్రయాణం చెయ్యాలీ ఈ విధంగా? కంట్రీసైడ్ యిప్పుడప్పుడే రాదా?" అని అడిగాను.

"ఇప్పుడిప్పుడే మనం కంట్రీ ప్రవేశిస్తున్నాం. యింకా చాలా దూరం వెళ్లాలి," అంది అమ్మమ్మ.

మా రైలుబండి హడ్సన్ నది పడమటితీరం వైపుగా ప్రయాణంచేస్తోంది. భుగభుగమని పొగలువదుల్తూ పెట్టెలన్నీ పదిలంగా యీడుస్తూ ముందుకుసాగుతోంది. కిటికీదగ్గిర కూచున్న నాకు బోలెడంత కంట్రీసైడ్ కనిపిస్తోంది. గంటల తరబడి అలా చూస్తూనే కూచున్నాను. కంట్రీఅంటే యింత పెద్దదనీ, హడ్సన్ రివర్ యింత పొడవైనదనీ నాకే నాడూ తట్టలేదు.

రైలు అక్కడక్కడ స్టేషనులో ఆగేది. ఇక్కడి స్టేషనులూ అవీ న్యూయార్కులోకి మల్లే వుండేవికాదు. అంతా ఏదో కొత్త కొత్తగావుంది. అయిదుగంటలసేపు ప్రయాణంచేశాక, మా రైలు 'కింగ్‌స్టన్' స్టేషనుచేరుకుంది. "మన మిప్పుడు న్యూయార్క్‌కి నూరుమైళ్ళ దూరంలోవున్నాం" - అంది అమ్మమ్మ. నూరు మైళ్ళే! మా అందాలదీవినుంచి నూరుమైళ్ళు వెళ్ళిపోడం నాకు బావుందేదు.

ఇక్కడ 'కింగ్‌స్టన్' స్టేషన్‌లో మేము వెనకటిరైలు మారి, మరొకరైలు ఎక్కాం. ఇది మొదటి రైలుకంటే మరీ నెమ్మదిగా

నడవసాగింది కాని పచ్చటి పర్వతాలమీంచివచ్చే గాలి ఎంతో హాయినిస్తోంది. మా రెండోరైలు కొండలూ గుట్టలూ ఎక్కి, దిగీ, ఫానీషియా అను వూరుచేరుకుంది. అక్కడ ఆ రైలుమారి మూడవ రైలు ఎక్కాం. అది చిన్నరైలు, ఆ రైలు 'హంటర్' అనే పట్టణం చేరుకునేసరికి, మధ్యాహ్నం మూడుగంటలయింది. ఇంత సేపటి నుంచీ ప్రయాణంచేస్తున్నా, మేము చేరుకోవలసిన స్తలం యింకా రానేలేదుట. "దగ్గిరకొచ్చేస్తున్నాం, యింకెంతో సేపులేదు," అని అమ్మమ్మ నన్ను వోదార్చింది.

హంటర్ స్టేషన్‌లో మమ్మల్ని కలుసుకునేందుకు ఒకపెద్ద మనిషివచ్చాడు. ఆయన మమ్మల్ని గుర్రపుషార్టులో కూచోపెట్టి, పదిమైళ్ళదూరం గతుకుల రోడ్డుమీదనుంచి తీసుకెళ్లాడు. ఇటూ అటూ చూడటానికి పర్వతాలైతే వున్నాయిగాని రోడ్డుమాత్రం దుమ్ముతోనూ, గతుకులతోనూ ఘోరంగావుంది. మా షార్టుబండీ జూయట్ హైట్సు (Jewett Heights) అను ప్రదేశానికివచ్చాక, గతుకుల రోడ్డుమీదనుంచి, పక్కగా తిరిగి ఒక యినపవంతెనదాటి, అరమైలుదూరం ప్రయాణంచేసి, కొండమీద నిలబడివున్న ఒక తెల్లటి ఫారమ్‌హౌసు దగ్గిరకొచ్చి ఆగింది. దానిపేరు 'పార్సన్స్' బోర్డింగ్‌హౌసుట. ఇదే మనం దిగవలసినచోటు - అని అమ్మమ్మ చెప్పింది. ప్రయాణం పూర్తిఅయిందని అమ్మమ్మ చెప్పడంతో, నా ప్రాణానికి హాయి అనిపించింది. ఈ బోర్డింగ్‌హౌసు చాలా బాగుంది. నేను చూడవలసినవి చాలావున్నాయి ఈ చుట్టుపట్ల. చీకటిపడే లోపుగా ఎంతమేర పరీక్షించడానికి వీలో అంతా పరీక్షిద్దామనుకుని, బండి దిగగానే, నాకు తోచినవైపు పరుగెత్తాను.

ధాన్యపుకొట్లూ, గొడ్లసావిళ్ళూ, కోడిపెట్టలని పెంచేచోట్లూ, బళ్ళూ, వ్యవసాయపనిముట్లూ, ఏమిటో అదంతా చిందరవందరగా కనిపించింది. నేను మొట్టమొదటచేసిన పని ఏమిటంటే, గొడ్ల సావిట్లోవున్న అవులని లెక్కపెట్టడం. పధ్నాలుగు ఆవులున్నాయక్కడ. పధ్నాలుగు ఆవులు ఒక్కచోటవుండగా చూడటం ఎంత అదృష్టం! నేనుపుట్టి బుద్ధెరిగాక, ఆవులని అంత దగ్గిరగా చూడనే లేదు. ఎప్పుడైనా ఎక్కడైనా ఆవు కనిపించినా అది నన్ను తన కొమ్ముల్తో పొడుస్తుందేమో నన్నభయంతో, చటుక్కున పక్కకి తప్పుకునేవాడిని. అంత సాధువైన జంతువు విషయంలో నాకాభయం ఎందుకు ఏర్పడిందో చెప్పలేను ఫార్మరూ అతని యిద్దరి కుమారులూ, మొత్తం ముగ్గురూ చిన్నచిన్న కుర్చీ పీటలమీదకూచుని, కాళ్ళమధ్యని పాత్రలుంచుకుని ఆవు పొదుగునుంచి పాలు పితకడంచూసి, నేను ఆశ్చర్యపోయాను. పాలు ఆ పాత్రలో పడేటప్పుడు అయ్యే శబ్దం, ఆ సన్నటి మధురధ్వని, వుడుతలు కిచకిచలాడినట్లు వినిపించింది. ఎంతసేపు నే నా అపూర్వదృశ్యాన్ని చూస్తూ తన్మయుణ్ణి అయానో చెప్పలేను. ఆ తన్మయత్వంనుంచి కొంచెం తేరుకున్నమీదట యింకా చూడవలసినవి చాలావున్నాయే అని, మరొక దిక్కుగా తిరిగాను.

గడ్డివాములకి పక్కగా గుర్రపుశాలవుంది. అక్కడ నాలుగు గుర్రాలున్నాయి. ఆ నాలుగూ వ్యవసాయపు పనిచేసే గుర్రాలు. ధాన్యపుకొట్టుకు వెనకవైపుగా పందుల దొడ్డివుంది. ఆ దొడ్లో చాలా పందులు నిశ్చింతగా నిద్దరపోతున్నాయి. అక్కడినుంచి కోళ్ళు వుండే చోటుకివెళ్ళాను. వాటిని కొంచెంసేపు వీక్షించి, నీళ్ల తొట్టెల

వైపుగానడిచాను. ఈ నీళ్లతొట్టెలు కర్రతో చెయ్యబడ్డాయి. మా న్యూయార్క్‌లోకి మల్లే యినుముతోటీ రాయితోటీ చెయ్యబడ్డవి కావు. ఈ నీళ్ల తొట్టెలదగ్గిర ఒకటీ రెండూకాక పది గుర్రాలు ఏక కాలమందు నీళ్ళు తాగవచ్చు. నీళ్ల తొట్టెలుండేచోటునే, పచ్చటి మొక్కలున్నాయి. ఇంకో నాలుగడుగులువేస్తే, చిక్కుడుపాదూ, ద్రాక్షతీగే కనపడ్డాయి.

వెనకవైపుగా కట్టెల దొడ్డివుంది. కట్టెలదొడ్డికీ, వంటయింటికీ మధ్యస్తలంలో ఓ పెద్ద కుక్క నిలబడివుంది. నేనా కుక్కకి దగ్గిరగావెళ్ళి, దానివెన్నుమీదరాస్తూ పల్కరించాను. అప్పుడే ఒక స్త్రీ, వంటయింటి తలుపు తెరుచుకువచ్చింది. ఆమె పార్సన్‌భార్య "యీ కుక్కపేరు రిప్ వాన్ వింక్‌ల్, నాయనా" అంది. "రిప్‌వాన్ వింకిలా? పర్వతాల్లో నివశిస్తూ ఒకనాడు అడవిలో కెళ్లి నిద్రపోయి, కొన్ని సంవత్సరాల తరువాత మేల్కొని వెనక్కివచ్చిన రిప్‌వాన్ వింకిలేకదా! చాలా మంచిపేరుపెట్టారు" అన్నాను.

రిప్ చాలా మంచికుక్క. దాని వెన్నుమీద మరొకసారి చరిచి, దానిపట్ల నాకుగల అభిమానం వెలిబుచ్చాను. మొదట్లో ప్రయాణం విసుగనిపించినా, నేనూ అమ్మమ్మా సరి అయిన స్తలానికివచ్చినట్లున్నాం.

పార్సన్స్ బోర్డింగ్‌హౌస్‌లో మేమేగాక యింకా చాలామంది అతిధులువున్నారు. వాళ్లందరి పిల్లల్తోటీ నాకు చా ¯ కాలక్షేపమయేది. పిల్లలం మా యిష్టంవచ్చినట్లు ఎక్కడబడితే అక్కడికి తిరిగేవారం. చెట్లెక్కడం, గుట్టలెక్కడం, దూకడం, పరుగెత్తడం - రకరకాల ఆటలు. మేత మెయ్యడానికివెళ్ళిన ఆవులని రిప్, ప్రతి సాయంత్రం యింటికి తీసుకొస్తూండేది. రిప్ కేదేనా ఆవు కనపడక పోతే, మేమువెళ్ళి దానికి సాయంచేసేవారం.

ఒక్కొక్కసారి పిల్లలమందరం కొండ కొనల్లోకి ప్రయాణం చేసి కొత్తవింతలు తెలుసుకునేవారం. పైన నీలాకాశం, పచ్చని ఆకుల మధ్యనించి సూర్యకాంతీ, ఆ లోకమంతా ఏదో లేసు వర్కుతో అల్లినట్లుండేది. మధ్యాహ్నంవేళ రిప్ మమ్మల్ని కొండ వాగువద్దకి తీసుకెళ్ళేది. చల్లగానూ పరిశుభ్రంగానూవున్న ఆనీటిలో దూకి, మా యిష్టం వచ్చినంతసేపు స్నానం చేసేవారం. పార్సన్స్ బోర్డింగ్‌హౌసు చుట్టుపట్లగల ప్రతిదీ మాకు కొత్తగానే కనపడేది. వెన్న తినడమేగాని, వెన్న ఎలా చేస్తారోచూడని మేము, వెన్న చెయ్యడంచూసి ఆశ్చర్యపోయాం. ఈ పరిసరాల్లోగల అద్భుత ప్రపంచం గురించి, చాలా పెద్దలేఖ ఒకటి, మా అమ్మకు రాసేశాను. ఒకసారి మిస్టర్ పార్సన్ హంటర్‌స్టేషనుకివెళ్తూ, మమ్మల్ని కూడా తనవెంట తీసుకెళ్ళాడు, మా కక్కడ చేపలుపట్టే గాలములుకొనిపెట్టాడు. ఆ మధ్యాహ్నంనుంచే మాకు చేపలు పట్టాలనిపించింది. మా బోర్డింగ్‌హౌసుకి దగ్గిరలోవున్న నీటి మడుగులన్నిటిలోనూ బోలెడన్ని చేపలు. గేలం లభించడంతో ఎప్పుడా ఎప్పుడా అని మా అందరికీ తొందరెక్కువయి పోయింది.

ఆరంగుళాలకంటె చిన్నదైన చేపను పట్టడం, జీవహింస కింద వస్తుందనీ, అది న్యాయసమ్మతంకాదనీ నాకు తెలుసు. అంచేత, ఏదేనా చేప కొక్కానికి తగలగానే, అది ఆరంగుళాల పొడవుందొ లేదో చూసేవాడిని. నేను యింతకీ పట్టింది ఒకే ఒక్క చేప. అది అరంగుళాలు లేకపోతే రూలు ప్రకారం నీటిలోకి వది లెయ్యాలి దాన్ని. చేపని కొక్కెంనుంచి బయటకుతీసి, దాన్ని స్కేలుతో కొల్చేసరికి, అయిదు ముప్పావు అంగుళాలే కనపడింది. అది అరంగుళాలు అయేదాకా సాగదీసి, గబగబా బోర్డింగ్ హౌసు లోకి పరుగెత్తాను. పార్సన్ సతికి నేను పట్టిన చేప చూపించి, ఇది ఆరంగుళాలు వుందో లేదో మొట్టమొదట చూడమన్నాను. "ఓ, వుంది. నువ్వు న్యాయచట్టాన్ని ఎంత మాత్రం వుల్లంఘించ లేదు," అని నాకు ధైర్యం చెప్పినమీదట, ప్రాణం తెప్పరిల్లింది. పార్సన్ సతి వంటిల్లు తుడుచుకుంటున్నంతసేపూ అక్కడే నిల బడ్డాను. "భోజనాల వేళప్పుడు నీ చేప నీ కిస్తాను. యీ ప్లేట్లో వుంచు," అని ఒక ప్లేటు చూపించింది. నేను దాన్ని ఆ ప్లేట్లో పెట్టి బయటికి వచ్చేశాను. ఆ తరువాత ఓ పిల్లిగారొచ్చి దాన్ని కబళించేసిందిట. భోజనాలవేళ చూసుకునేసరికి, ఆ ప్లేట్లో తలా తోకా మటుకు మిగిలివున్నాయి.

ఏమైనా చేపలు తినడంకంటె పట్టడం సరదాగా వుంటుంది. చెప్పొద్దూ, నేనూ రోజూ చేపలు పట్టేందుకు వెళ్లేవాడిని. నీరు ఎక్కడ లోతుగావుంటుందో చూసుకు ఆ వొడ్డున చతికిలబడి, 'చేప తాడు' (గాలం) నీటిలోకి విసిరేవాడిని. కర్ర ఒకచేతిలో పుచ్చుకు ఏవేవో ఆలోచించుకుంటూ, ఆ ప్రవాహపు గలగలని వింటూ

సూర్యరశ్మిలోని వెచ్చదనానికి పరవశమవుతూ, గంటల తరబడి ఆ నీటి వడ్డున కూచునేవాడిని. ఈ ప్రశాంతవాతావరణంలో ఎటువంటి కలలేనా వస్తాయి. నేను ఒకనాడు సంపాయించగలధనమూ, పొందగల అధికారమూ, నాకు ఒక కారు వుండటం, పెద్దవాడిని అవటం, పొడుగు పంట్లాములు వేసుకోగలగడం, నత్తి రాకుండా మాట్లాడగలగడం - యిటువంటి మధురమైన ఆలోచనలతో నన్ను నేను మర్చిపోయేవాడిని.

పార్సన్ బోర్డింగ్ హౌసులోవున్న పిల్లలందరూకూడా ఎంతో సుఖంగా గడిపేవారని చెప్పవచ్చు. చేసేందుకు చేతి నిండా పని, తినడానికి రకరకాల ఆహారపదార్థాలు. పరిశుభ్రమైన పాలూ, వెన్నా, కమ్మటిబ్రెడ్డూ, కోడిగుడ్లూ, అయిస్‌క్రీమ్, ప్రతి ఆదివారం విందూ - ముఖ్యంగా మా చిన్నపిల్లలకి చాలా సుఖంగా వుండేది.

సాయంత్రంవేళ ఆవులని యింటికి మరలించటం, వాటి పాలు పిండుతూండగా చూడటం, కోడిగుడ్లు పొదిగే విధానం యివన్నీ నగరవాసులమైన మాకు తెలియని అపూర్వవిషయాలు,

అటువంటి ప్రదేశంలో జీవితం పరిపూర్ణమైనదని నా అభిప్రాయం. మా అందాల దీవిలోకంటె యిక్కడేదో విశిష్టతవుందని నాకు తెలుసు. కాని నేను పుట్టి పెరిగింది న్యూయార్క్‌లో. నేను న్యూయార్క్‌కే చెందుతాను. ఈ కొండకోనల్లోని జీవనరాగంలో శాంతి సౌఖ్యాలున్నాయి. వెచ్చని సూర్యకాంతి మనుషుల ముఖాలని వికసింపచేస్తుంది. అర్ధరాత్రివేళ మిణుగురుల అందమూ.

కీచురాళ్ల సంగీతమూ మనకు తోడుగావుండి, హృదయకుహరం లోని విశాంతతనిపోగొడ్తాయి. వెనకవాకిట్లో పిల్లుల పోరాటమూ. ముందువాకిట్లో వాహనాల రణ గొణ ధ్వనీకాక, ఈ పల్లెప్రాంతం లోని నిశ్శబ్దతా నక్షత్రాలూ మానవజీవితానికి సామరస్యం కుదురుస్తాయి.

బోర్డింగ్ హౌసులో వున్నన్నాళ్ళూ యింతప్రశాంతంగానే గడవ లేదు. ఒక్కొక్కప్పుడు కొన్ని అలజడులుకూడా జరిగేవి. మళ్ళా జీవితం మామూలు రస్తాలోపడేది. ఒకరోజున రిప్ ముళ్లపంది యీకల్తో కెవ్వుకెవ్వున రోదిస్తూ వచ్చేసరికి మేమందరమూ కళ్ళ నీళ్ల పర్యంతరమయాము. మిస్టర్ పార్సన్ చాలా జాగ్రత్తగా ఆ యీకలు వొక్కొక్కటీ లాగెయ్యా నారంభించాడు. ఒక్కొక్క యీకా లాగుతూండేవేళకి, రిప్ పెద్దపెట్టున ఏడ్చేది. కాని అవి లాగెయ్యక తప్పదు. రిప్ ఏడ్చేవేళకి మేమూ ఏడుపు మొదలు పెట్టాము. అప్పుడు పార్సన్ సతి మాకు తినడానికేవో స్వీట్సు పెట్టింది. మేమవి తింటున్నామన్నమాటేగాని మనసు రిప్‌మీద వుంది. రిప్ మొహంమీద గుచ్చుకున్న ముళ్లన్నీ తీసేశాక, అది కూడా మాతోపాటు చాప్స్ (Chops) తినడం చూశాక మా అంత రికీ ఒక్కసారి సంతోషం పెల్లుబికి వచ్చింది.

ఒకరోజున ఆవువొకటి ఎంతసేపటికీ రాకబోయేసరికి, రిప్ పసిగెత్తుకుంటూ వెళ్ళి దాన్ని తరుముకు తీసుకొచ్చింది. ఆవులు తప్పిపోయినా, గుర్రాలు తప్పిపోయినా, అవి ఎక్కడున్నాయో వెతికి వాటిని యింటివైపుగా తోలుకు రావడం రిప్‌కి బాగా తెలుసు,

ఫారమ్‌హౌసులో జంతువులు తప్పిపోవడమెప్పుడి తరచూ జరుగుతూవుంటుందిట. ఒకసారిక్కడికి ఎలుగుబంటి కూడా వచ్చిందిట, మిస్టర్ పార్సన్ చెప్పాడు ఆ విషయం. ఆయన ఎలుగు బంటిని కాల్చేసి దాని మాంసం, చుట్టుపక్కల వాళ్లందరికీ పంచి పెట్టాడుట. ఇక అడవిపిల్లులూ, నక్కలూ, హెన్‌హౌసుమీదకి (కోడిపిట్టలుండే గది) దాడి చెయ్యడం తరచు జరిగే విషయమే నట. అవి కనిపించగానే కాల్చెయ్యక తప్పదట. ఒకసారి మిస్టర్ పార్సన్ డేగని కూడా కాల్చవలసివచ్చింది.

ఆయన డేగని చంపడం నేను ప్రత్యక్షంగా చూశాను. మేమిద్దరం కర్రల దొడ్లో దాక్కున్నాం. డేగ మమ్మల్ని చూడలేదు. అది కోడిపిల్లలుండే గదిచుట్టూ తిరిగి తిరిగి, కోడిపిల్లల్ని తన్నుకు పోయేందుకుగాను, కిందుగా వచ్చింది. కోడిపిల్లలు ప్రాణభీతితో గిజగిజలాడుతున్నాయి. ఇటూ అటూ పరుగులెడుతున్నాయి. డేగ కిందకి వాలే దాకా పార్సన్ వోపికపట్టాడు. అది వలయాకారంగా తిరుగుతూ, కోడిపిల్లలని తన్నుకుపోయే స్థితికివచ్చి రాగానే దబ దబా రెండుగుళ్ళు పేల్చాడు. అంత పెద్ద డేగా టపమని నేల కూలింది.

ఆ క్షణాన మిస్టర్ పార్సన్‌ని చూడగా నాకెంతో ఆనందం కలిగింది. ఆయన వ్యక్తిత్వంపట్ల అమోఘమైన గౌరవం ఏర్ప డింది. ఆయన యీ డేగని చంపడం, చాలా గొప్ప విషయంగా తోచింది నాకు. పెద్ద తుపాకీ చేతబుచ్చుకు, తన ఆస్తిని అపహ రింపజూసే ప్రాణిని హతమార్చగల ధీశాలి యీయన. ఆయన ఆస్తిని ఆయన స్వహస్తాలతో కాపాడుకోగలడు.

చటుక్కున నాకెందుకనో మా తాతయ్యా, మా చుట్టల షాపు జ్ఞాపకంవచ్చాయి. తాతయ్య ఏనాడూ తుపాకీచేత బుచ్చుకు, తన ఆస్తిని సంరక్షించుకోలేడు. ఎంచేత? నా చిన్న మెదడుకి ఏదో జవాబుతట్టింది.

రెండువందల నలభై ఎకరాల యీ వ్యవసాయక్షేత్రం. యిందులోని యిళ్ళూ వాకిళ్ళూ, గొడ్డూ గోదా, గుర్రాలూ బళ్ళూ, యంత్రాలూ, చెట్లూ చేమా యీ మొత్తానికంతకీ మిస్టర్ పార్సన్ యజమాని. ఈపసరికా యీమన్నూ అతనివి. ఎండకాయనీ, వర్షం పడనీ, గాలివీయనీ, వరదలురానీ యీ రెండువందల నలభై ఎకరాల్లోనూ జరిగే మార్పులన్నిటికీ బాధ్యత అతనిది - అతను ఆ నేలకి అధికారి. ఎండ వానలకి అతను సన్నిహితుడు. న్యూయార్కు లోని మా తాతయ్య షాపులోకి సూర్యకిరణం పొరబాటున కూడా రాదు. ఆ షాపు మా తాతయ్యదే, కాని ఆ యిల్లు మాది కాదు, ఇల్లు మరెవరిదోను. మేము వాడు కుంటున్న సమస్తం మాదికాదు, మరెవరిదో - ఆఖరికి అందమయిన టెలిఫోన్ కూడా! నిజానికి ఆ అందమయిన టెలిఫోన్ మాదా? మాది కాదు. ప్రతినెలా దానికి అద్దె కడుతున్నాం, అది టెలిఫోన్ కంపెనీది.

ఇంకా లోతుకుపోయి చూసిన మీదట, మావైన వస్తువులు మాకు కొన్ని వున్నాయనిపించింది. మా అద్దె యింట్లోని కర్ర సామానూ, నస్యపుజాడీలూ, నీగ్రో కుర్రవాని బొమ్మా, కాపలా కాస్తున్న 'కర్ర సిపాయి' యివన్నీ మావి - మా స్వంతం. కాని పార్సన్ గారి క్షేత్రంతో పోల్చి చూస్తే, యివి ఏ పాటివి? నా జీవి

తంలో మొట్టమొదటసారి శూన్యత అనేది హృదయమందిరంలోకి చొరబడింది. కాళ్ళకింద నేల కదిలిపోతున్నట్లు తోచింది.

ఆ తరువాత నాలుగైదేళ్ళపాటు ప్రతి వేసంగికీ, నేనూ అమ్మమ్మా పార్సన్ బోర్డింగ్‌హౌసుకి వెళ్తూండేవారం. ఆపాటికా ఏడు నేను పెద్ద వాణ్ణవుతున్నాను. నీరుటినుంచీ వార్తావీధికి ప్రకటన లిచ్చేందుకుగాను తాతయ్యా వెంట లేకుండా, వొక్కడ్నీ వెళ్ళడం మొదలు పెట్టాను. నీరుడు సీతాకాలంలోనే పొడుగు పంట్లాములు వేసుకోడం మొదలుపెట్టి, హైస్కూల్లో ప్రవేశించాను.

# స్వాతంత్ర్యదేవత

మా హైస్కూల్లోని ప్రార్థనామందిరపు గోడమీద, 'సత్యము తెలుసుకో; అది నిన్ను స్వతంత్రుణ్ణి'గా చేస్తుంది - అన్న సుభాషితము పెద్దక్షరాల్తో రాసివుండేది. కాలక్రమాన, మేము సత్యాలు తెలుసుకో నారంభించాము. సత్యం తెలుసుకోడంవల్ల మాలో స్వతంత్రభావన పెరిగినమాట నిజమేగాని, దాని వెంట కొన్ని యిబ్బందులు కూడా వచ్చాయి. మేము తెలుసుకున్న నిజాలవల్ల కొన్ని మార్పులు తప్పని సరిగా అవసరమయాయి.

సాంఘికరంగంలో అనేకమార్పులు సంభవించాయి. యూరప్‌ఖండంనుంచి లక్షలాది ఐరోపియన్లు యిక్కడికి వలస వచ్చారు. అమెరికన్ లక్షాధికారులు వారి ముందు బీదవారు అయారు. మాట తభావతులు ప్రారంభమయాయి; పరస్పర విశ్వాసం తగ్గిపోయింది; కార్మిక వుద్యమం బలపడింది; ధనవంతులకీ బీదవారికీ మధ్యనున్న బ్రహ్మాండమయిన తేడా కూడా చాలా వరకు తగ్గించబడింది. ఈ మార్పులన్నిటినుంచే సామాన్యపౌరుడు (Common Man) జన్మించాడు. ఈ మార్పుల ఫలితంగా నూతన సాంఘికజీవనం ఏర్పడింది. ప్రజాస్వామ్యం బలపడీ అమెరికా దేశం స్వాతంత్ర్యఫలాన్ని మరింతగా అనుభవించ మొదలిడింది.

ఆ నాటి మానవులకి న్యూయార్కు రేవు స్వాతంత్ర్యమందిరపు ద్వారమువంటిది. ప్రతివారం ఓడలు, వేలకొద్దీ వలస వచ్చినవారిని తీసుకొచ్చేవి. ఈ వలసదారులు యూరప్‌లోని అన్ని దేశాలనుంచీ, సమీప ప్రాచ్యం (Near East) నుంచీ వచ్చేవారు. స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ, వేలాదిసంఖ్యలో తమ తమ దేశీయ దుస్తులతో, తాము తెచ్చుకున్న తట్టా బుట్టతో, ఓడలు దిగి పట్నపు దిగువభాగానికి వెళ్తూవుండటం, చూడవలసిన దృశ్యం. ఈ వలస దారులందరూ 'యిమిగ్రేషన్ ఆఫీసు' దగ్గిర నిలబడి తమ పత్రాలు నమోదు చేయించుకు, నూతన ప్రపంచంలో అడుగు పెట్టడం అదేదో అపురూపమైన అనుభవంగా తోచేది. ఓడలు దిగి యిమిగ్రేషన్ ఆఫీసుకి వెళ్లే ప్రజల్ని చూడటానికిగాను నేను గంటల తరబడి రోడ్డుమీద నిలబడి. ఆకొత్త మొహాలూ, ఆవింత వడకలూ వీక్షించేవాడిని. ఆ దిగినవారిలో కొందరికి స్నేహితులూ బంధువులూ వుండేవారు! మరికొందరికి ఎవరూ వుండేవారు కాదు. ఈ దిగివచ్చినవారు కాక ఆఫీసుకి అవతల తట్టున మరికొందరు వుండే వారు. వలస వచ్చినవారిలో తమకి నౌకర్లుగా పనికి వచ్చేవారూ, తమ పొలాల్లో పని చేసేందుకు యిష్టపడేవారూ, తమ కంపెనీలో కార్మికులుగా వుండేందుకు వొప్పుకునేవారూ, దొరుకుతారేమోనని ఎన్నుకునేందుకు, అమెరికన్ ప్రజల అవతలితట్టున వుండేవారు. వీరితో పాటు అన్ని భాషలూ తెలిసిన ప్రతినిధులు కూడా కొందరు సమకూడేవారు. ఆయాభాషనిబట్టి ఆయాదేశీయులువుండే చోటుకి యీ వలసదారులని చేర్చే వ్యక్తులు బోలెడంతమంది, యిమిగ్రేషన్ ఆఫీసుకి అవతలతట్టున వుండేవారు. రైలుమార్గాలకీ వుక్కుకర్మాగారాలకీ, బొగ్గుగనులకీ, మిగతా భారీపరిశ్రమలకీ, లెక్కలేనంత

మంది పనివారు కావలసివచ్చారు ఆ రోజుల్లో. అంచేత మనుషులు కనిపించగానే వారికి తగిన సదుపాయాలు సమకూర్చి, వాళ్ళింకా ఊళ్ళోకి రాకపూర్వమే వుద్యోగాలు యిచ్చేసేవారు.

వలసదార్లలో కొందరు, అమెరికాలో తమ దేశస్తులు ఏ భాగానవున్నారో అటువైపుకి వెళ్ళేవారు. మరి కొందరు న్యూయార్కు లోనేవుండిపోయి, తమ దేశస్తులపేటలలో నివాసం ఏర్పరచుకునే వారు. వేరువేరు దేశస్తుల వేరువేరు జిల్లాలతో, న్యూయార్కులోని విదేశీయుల భాగం విపరీతంగా పెరిగిపోయింది.

యూరప్‌లోని వారి స్వదేశాన్ని పోలివుండేది ప్రతిజిల్లా(పేట) కూడా, న్యూయార్కు నగరంలో విదేశీభాషల్లో వార్తా పత్రికల ప్రచురణ ప్రారంభమయింది. మా పత్రికల కొట్లలో యింగ్లీషు పేపర్లతోపాటు జర్మన్, ఇడ్డిష్, జెక్, యిటాలియన్, గ్రీకు, మొద లైన ముఖ్యభాషల్లోని పత్రికలు వుండేవి. వారి వారి దేశీయసంప్ర దాయాల్ని అనుసరించి, ఆయాజిల్లాల్లో కళామందిరాలు ఏర్ప డేవి. మా పట్నంలో రెండు జర్మన్ థియేటర్లూ, ఒక యిటాలియన్ థియేటరూ, అసంఖ్యాకమయిన జూయిష్ థియేటర్లూ నెలకొల్ప బడ్డాయి. చైనీయులుండేభాగాన అతిసుందరమైన చైనీస్ థియేటర్ కూడా వెలిసింది.

న్యూయార్కులోవున్న మేము, యీ విదేశీజిల్లాలకు తరుచు వెళ్ళి, అక్కడి ఆహారం ఎట్లావుంటుందో రుచి చూసేవారం. ట్రాముఎక్కి అయిదుసెంట్లుయిస్తే, మనకి ఏ భాగానికి వెళ్లాలని

వుంటే అక్కడికివెళ్లవచ్చు. రెస్టారెంట్లుకూడా పరిశుభ్రంగావుండేవి. ఆహారపదార్థాలు రుచికరంగానూ తక్కువ ధరల్లోనూవుండేవి. ఇటాలియన్‌లూ, చైనావారూ, హంగేరియన్‌లూ వండుకునే ప్రత్యేక వంటకాలు, మేమక్కడ రుచి చూసేవారం. ముఖ్యంగా హంగేరియన్‌ల భాగంలో వారి ఆహారశాలలూ, సంగీతమందిరాలూ మరుపు రానంత మనోజ్ఞంగావుండేవి.

పుట్టి పెరిగినదేశం వదిలేసి, కొన్నివేలమైళ్ళ దూరంలోవున్న ప్రదేశానికివెళ్లి, బతికినన్నాళ్ళూ అక్కడ వుండిపోదామని అనుకోడానికి ఎంతో ధైర్యమూ పట్టుదలాకావాలి. యీ వలసదార్లని చూస్తే నాకదే ఆశ్చర్యంవేసేది. వారు తమ మాతృదేశాన్ని వదిలేసి ఎలా రాగలిగారా అనిపించేది. యీ కొత్తచోట జీవితానికి తిరిగి 'ఓనమాలు' ప్రారంభించాలికదా! కాని, వాళ్ళుపాపం, ఎంత నిరాశపడి, ఎటువంటి అసహాయతలోనూ, దారిద్ర్యంలోనూ తమ స్వదేశాలని వదిలివచ్చారో కదా! అవకాశాలూ స్వాతంత్ర్యమూ గల దేశమిది. వాటిని అందుకునేందుకు మానవులకి మనోధైర్యం కావాలి! మా తాతయ్యకూడా యింతేగా! ఒకప్పుడు వీరికి మల్లే వచ్చిన వాడేగా!

"అదంతా పారిస్‌లో జరిగింది. నేను జారు ప్రభుత్వంనుంచి పారిపోయివచ్చాను. అప్పుడు నేను దృఢంగావుండేవాడిని. పారిస్‌లోని ఒక ఫాక్టరీలో నాకు వుద్యోగం దొరికింది. నాకు నేనుగా పారిస్ వెళ్ళేందుకు జారు ప్రభుత్వం అంగీకరించదు. అంచేత అర్ధరాత్రివేళ సరిహద్దుదాటి ఫ్రాన్సు భూభాగంలో ప్రవేశించాను."

"నువ్వొక్కడివేనా తాతయ్యా? నీ వెంట యింకెవరేనా వున్నారా?" అని అడిగేవాడిని నేను.

"మేము అయిదుగురం. అర్ధరాత్రివేళ సరిహద్దు యివతలకి జేర్చేందుకుగాను మేము ఒక 'గైడ్'కి తల వొక్కంటికి యిరవైఅయిదు డాలర్ల చొప్పునయిచ్చాం. యిరవైఅయిదు డాలర్లంటే, మాకారోజుల్లో చాలాపెద్ద మొత్తం. ఆ డబ్బు సమకూర్చుకునేందుకు, మేము ఎన్నాళ్ళో రెక్కలువిరిగేటట్లు పనిచేశాం. యిరవైఅయిదు డాలర్లూ 'గైడ్' చేతిలో పెట్టినమీదట, నా జేబులో దమ్మిడీలేదు. సరిహద్దుదాటి ఫ్రాన్సుకొచ్చాక, ఫ్రాన్సులో కొన్నాళ్లు పనిచేసి, కొద్దిగా డబ్బు నిలవజేసుకు, అమెరికా జేరుకోవాలని నా ప్లాను. పారిస్‌లో ఒక యిత్తడిసామాన్లకొట్టులో నాకు పని దొరికింది. వాళ్ళు జీతంకూడా బాగానే యిస్తూండేవారు. ప్రతివారం యింతని వెనకేసుకుంటూ, అమెరికా చేరుకునేందుకుగాను ఓడఖర్చు సమకూడేదాకా పనిచేశాను. పారిస్‌నుంచి లండన్‌జేరుకు అక్కడ మరొక రెండేళ్ళు పనిచేసి, చిట్టచివరికి సౌతాంప్టన్‌లో ఓడఎక్కాను. ఆ వోడ ఎన్నాళ్లకి నన్ను అమెరికా చేరుస్తుందో నాకు తెలియదు. అఖరికి ఒకనాడు స్టాట్యూ అఫ్ లిబర్టీ, న్యూయార్కుహార్బరూ కనపడ్డాయి. స్టాట్యూ అఫ్ లిబర్టీకి అడుగునవున్న యిత్తడి పాదం చూసేసరికి నా ఆనందానికి పట్టపగ్గాలు లేకపోయినాయి. యీ పాదం నేను పారిస్‌లోవుండగా, అక్కడ పనిచేసిన యిత్తడి కర్మాగారంలో తయారుకాబడింది. మొట్టమొదటిసారి 'ఫోర్‌మెన్' ఆ యిత్తడి పాదందగ్గిర పనిచేయమనేసరికి, యింత పెద్దపాదం ఎవరికా అని నేను ఆశ్చర్యపోయాను. ఆ నాడు నాకు దీనిసంగతి

తెలియదు. న్యూయార్క్ హార్బరువద్ద ఒక స్వాతంత్ర్య విగ్రహం వుందనీ, ఆ స్వాతంత్ర్యవిగ్రహపు పాదానికిగాను యీ యిత్తడి తొడుగుచేస్తున్నారనిగానీ నాకుతెలియదు. ఇంత పెద్దవయిన యిత్తడిపాదం, యింత నిష్ప్రయోజనమైన పని మా యిత్తడికర్మాగారంవారు, ఎందుకు తలపెట్టారా అని - విస్మయపడ్డాను నాడు. ఇక్కడ యీ ధగధగలాడే పాదం చూసేసరికి నాకు కలిగిన అపరిమితానందం మాటల్లో చెప్పలేను. స్వాతంత్ర్యంకోసం వెతుక్కుంటూ వచ్చిన నాకు ఆ దేవతపాదాలవద్ద పనిచేయగల అదృష్టం లభించినందుకుగాను మురిసిపోయాను."

వలసదార్లూ, స్టాట్యూ ఆఫ్ లిబర్టీ, రాజకీయ స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం - యివన్నీ ఒకఎత్తు, అసలైన స్వాతంత్ర్యం ఒకఎత్తు. అమెరికాలో పరిశ్రమలు తొందరతొందరగా పెరగడంతో అమెరికన్ పౌరుడు ఆర్థిక స్వాతంత్ర్యంకోసం పోరాటం జరపవలసి వచ్చింది.

ఈ శతాబ్ద ప్రారంభాన అమెరికాలోని కార్మికవర్గాల్లో సంచలనం బయలుదేరింది. మనుష్యులూ, యంత్రాలూ, సంపదా - యీ మూడింటిలో ఒక దానికీ మరొక దానికీ గల సంబంధం ఏమిటి ? ఏవి ఎంతవరకు ఏ విధంగా పెరగాలి ? - అను విషయమై తీవ్రంగా ఆలోచించవలసివచ్చింది. ఈ కొత్త సమస్య మమ్మల్ని ఒకవిధంగా కలవరపరిచింది.

పిట్స్‌బర్గ్‌లో సమ్మె; పత్తి యంత్రాలలో చిన్న పిల్లలను వుపయోగించరాదు; బొగ్గు గనుల్లో పనిచేసేవారికీ వారి కుటుంబా లకీ క్షయవ్యాధివస్తోంది; - ఈ మాదిరి వ్యాసాలు దినపత్రికల్లోనూ వారపత్రికల్లోనూ వెలువడ్డంతో ప్రజలలో అలజడి బయలుదేరింది. లేబర్ (కార్మికులు), కాపిటల్ (పెట్టుబడి), యిండస్ట్రియల్ రెవెల్యూషన్ (పారిశ్రామికవిప్లవం), స్ట్రయిక్ (సమ్మె), లివింగ్ వేజ్ (కనీసవేతనాలు), - యీ మాటలు ప్రతిచోటా వినబడ నారంభించాయి. మా తాతయ్యా చుట్టలషాపులో కూడా వీటి ప్రస్తావన వస్తూండేది.

తాతయ్యా మిస్టర్ హడ్లీ యీ విషయాల్లో ఏ నాడూ ఏకీభవించేవారు కాదు. కాని వారిద్దరూ వాదులాడుకోడంవల్ల నాలో యిదేమిటో తెలుసుకోవాలనే ఆసక్తి జనించింది. స్థూలంగా తాతయ్యా మిస్టర్ హడ్లీ సమస్యాస్వరూపాన్ని అంగీకరించేవారు; ఎటొచ్చీ పరిష్కారం విషయంలో మాత్రం ఏకాభిప్రాయం కుదిరేది కాదు. ఎనిమిది తొమ్మిదేళ్ళ వయసుగల పిల్లలు రోజుకి పన్నెండుగంటల చొప్పున బట్టలమిల్లులో పనిచెయ్యడం దురన్యాయం. అమెరికాలో 'చైల్డ్ లేబర్' (Child Labour) వుండకూడదు; చిన్నపిల్లల విషయమే కాదు. అవసరమైతే తప్ప స్త్రీలని కూడా పరిశ్రమలలో వుపయోగించకూడదు. పరిశ్రమలలో పని చేసే ఆడవారికి తగిన సదుపాయాలు వుండాలి; కార్మికుల కిచ్చేది వారి జీవనోపాధికే అన్నట్లు కాకుండా మరికొంచెం ఎక్కువగా వుండాలి. ఇంతవరకూ తాతయ్యా మిస్టర్ హడ్లీ వొప్పుకునేవారు. వీటిని ఎలా ఆచరణలో పెట్టడం అనే విషయం దగ్గిర కొచ్చేసరికి

యిద్దరిదీ చెరో దారీ అయేది. పరిశ్రమదారులు కాలక్రమేణా తమ పనివారి కష్టసుఖాలు తెలుసుకు, తగు సదుపాయాలు చేస్తారు అనేవాడు తాతయ్యా. అది ఎప్పటికీ జరగదు - అనేవాడు మిస్టర్ హడ్లీ.

"అమెరికాలోని కార్మికులకి ఒకే ఒక్క మార్గం కనపడు తోంది. వారు కార్మికసంఘాలు ఏర్పాటు చేసుకు, తమ సమూహ శక్తిద్వారా, పారిశ్రామికులలో మార్పు తీసుకు రాగలగాలి. పారిశ్రామికులు హేతువుకి లొంగరు. వారి పెట్టుబడి, యింకా ఎక్కువ లాభాలు తీసుకుని రావాలనే వారి కుంటుంది. సమూహశక్తి ద్వారాగాని వారి కళ్ళు తెరుపులకి రావు. ఈనాడు అమెరికను కార్మికుడు, కార్మికసంఘ నిర్మాణవిషయంలో ఉపేక్ష చేశాడా- ముందు ముందు చాలా అవస్థలకిలోను కావలసివస్తుంది. కార్మిక సంఘాలు ఏర్పడ్డా కూడా అడుగడుక్కా పారిశ్రామికులతో పోరాడ వలసివుంటుంది. ఇది ఏళ్ళ తరబడి జరగవలసిన పోరాటం."

తాతయ్యకి కాలగమనం గురించి చెప్పేందుకా అన్నట్టు మిస్టర్ హడ్లీ, పారిశ్రామికవిప్లవంతో మానవునిమీద యంత్రం ఏ విధమైన ఆధిక్యత సంపాయించినదీ వివరించి చెప్పేవాడు. రాను రాను పరిశ్రమల్లో యంత్రానికి ప్రాముఖ్యత కలుగుతుంది. పెట్టు బడిదారులని దురాశాపరులనటం కూడా న్యాయం కాదు. ఎంచేత ననగా, ఏది వారికి లాభకరమో ఆ ప్రకారం నడుచుకుంటున్నారు. మోర్గన్, రాక్‌ఫెల్లర్, కార్నీజీ, ఫ్రిక్, యీ మాదిరి కోటీశ్వరులు పరిస్థితుల ప్రభావంవల్ల జనించినవారు. ఆ వ్యక్తులతో మన కెటు

వంటి పేచీలేదు. వారు సజ్జనులూ, వృత్తములూను, ఏ పరిస్థితుల వల్ల కార్మికవర్గం నెలకొల్పబడిందో, అదే పరిస్థితులకి వీరు గూడా వారసులు. కార్మికవర్గం తన ప్రాణాలు నిలబెట్టుకునేందుకు, పారిశ్రామికులతో పోరాడక తప్పదు.

మిస్టర్ హడ్లీ తాతయ్యతో 'పారిశ్రామిక విప్లవఫలితంగా యంత్రము మానవుని జీవితాన్ని ఎలా తారుమారు చేసింది వివరింపబూనేవాడు. తాతయ్యకి 'పోరాటము'నే మాట వినేసరికి వొళ్ళు మండేది. నాకేమో హడ్లీ చెప్పిన పలుకులు సబబుగా కనిపించేవి. హైస్కూల్లోజేరి ఈ పుస్తకం ఆ పుస్తకం చదవడం మొదలు పెట్టాక, లోకవృత్తం కొద్దిగా తెలియ నారంభించింది నాకు. చిన్నప్పుడు నాకు బొమ్మల పుస్తకాలంటే సరదాగావుండేది. అందులో కథ చదివేవాడినికాదు. బొమ్మలు చూస్తూ గంటలు గంటలు వెళ్ళబుచ్చేవాడిని, ముఖ్యంగా డాంటీస్ 'యిన్ ఫెర్నో'లోని నరకానికి సంబంధించిన బొమ్మలు నాకు చాలా బాగుండేవి. కొంచెం పెద్దవాడినయాక బొమ్మలవంక చూడ్డం మానేసి, కథలేమిటో చూడ్డం ప్రారంభించాను. పత్రికలేమిటి, పుస్తకాలేమిటి నాచేతికందిన ప్రతిదీ చదివేస్తూండేవాణ్ణి.

కౌంట్ ఆఫ్ మాంటీక్రిస్టో పారిపోడంవద్దనుంచి, న్యూయార్కులోని నౌఖర్లకి నెలకి పదహారు డాలర్లు యిస్తారనేసంగతి దాకా నాకు తెలిసేది. డాన్‌క్విక్సోట్ ఆయనగారి గుర్రంతోనూ, శాంఛోతోనూ పురాతన స్పెయిన్ అంతా పర్యటించి, గాలి మరలతో ఏ విధంగా పోరాడి కులీనకాంతలని ఎంతగొప్పగా రక్షించినదీ తెలుసుకునే

వాడిని. షెర్లాకు హోమ్స్ తోపాటు అపరాధ పరిశోధన నేనూసలిపి, గేగౌల్డ్, జిమ్‌ఫిస్క్, అను యిద్దరు అమెరికన్ కోటీశ్వరులు వారి స్వంత వైరానికిగాను, బంగారం మార్కెట్‌ని బ్లాక్‌ఫ్రయిడే నాడు ఎలా స్తంభీభూతంచేసినదీ తెలుసుకున్నాను. రోజుకి పది పన్నెండు గంటలు పనిచేసే కార్మికుడు, తనపని సమయాన్ని, ఎనిమిదిగంట లకి తగ్గించవలసిందిగా మహజర్లు పంపుతున్నట్లు చదివాను. ఇంతే కాదు, ట్రెజర్ ఆయిలాండ్, డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్, ది కాల్ అఫ్ ది వైల్డ్, మొదలైన పుస్తకాలు నా మనసుకి పని చెప్పుతూండేవి. వయోవృద్ధులకి పెన్షను లివ్వాలనే 'తీవ్రవాదులూ' కార్మికసంఘాలు నిర్మించే అలజడిదారులూ, విప్లవకారులూ ఆదర్శవాదులూ, మొదలైన వారిగురించి తెలుసుకున్నాను. వీటన్ని టితోపాటు జె. పి. మార్గన్ అను కోటీశ్వరుడు సివిల్‌వార్ సమ యంలో అమెరికా ప్రభుత్వానికి ఎందుకూ పనికిరాని తుపాకులు అమ్మి కోట్లు సంపాయించిన సంగతి కూడా తెలుసుకున్నాను.

నేను కాల్పనిక జగత్తునీ యదార్థవిషయాలనీ కలగాపులగం చేసేవాడిని. మొత్తంమీద చేతికందిన ప్రతిది చదివేసేవాడిని. ప్రఖ్యాత గ్రంథాలేకాకుండా, ఎప్పటికప్పుడు కొత్త పుస్తకాలు వెలువడుతూండేవి. 1901 లో గస్టవస్ మేయర్స్ 'ఎ హిస్టరీ ఆఫ్ టెమ్మనీహాల్' (A History of Tammany Hall) అను పేరిట న్యూయార్కు నగరంలోని రాజకీయాలలో ఎటువంటి లంచగొండి తనం ప్రబలినదీ బయటపెట్టాడు. అదే సంవత్సరం శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి, ఫ్రాంక్‌నారిస్ 'ది అక్టోపస్' (The Octopus) అను గ్రంథాన్ని ప్రచురించాడు. అమెరికాలో కొత్తగా ఏర్పడుతున్న

రైలురోడ్డు, అమెరికన్ రైతులకి ఎటువంటి అన్యాయం చేస్తున్నదీ యీాయన వివరించిచెప్పాడు. యీాయన బయటపెట్టిన విషయాల వల్ల కేంద్రప్రభుత్వం ఒక పరిశీలనాసంఘాన్ని ఏర్పరచవలసి వచ్చింది. ఫ్రాంక్‌నారిస్సే మళ్ళీ 1903 లో 'ది పిట్' (The Pit) అను యింకొక పుస్తకం ప్రచురించాడు. చికాగోలోని ధాన్యపు మార్కెట్‌లో జరుగుతున్న ఘోరపరిస్థితుల గురించీ అన్యాయాల గురించీ, యిందులో పేర్కొనడం జరిగింది. కేంద్రప్రభుత్వం మళ్ళీ మరొక పరిశీలనాసంఘాన్ని ఏర్పరచవలసివచ్చింది. ఈ రెండుపుస్తకాలూ బయటపెట్టిన విషయాలకి ప్రజలు ఆశ్చర్య పోయారు. ఇంతేసి ఘోరాలుజరుగుతున్నాయా, అని ముక్కు మీద వేలు వేసుకున్నారు.

ఇలావుండగా 1904 లో 'యిడాటార్బెల్' అను ఒక వనిత 'ఎ హిస్టరీ ఆఫ్ ది స్టాండర్డ్ ఆయిల్‌కంపెనీ' (A History of the Standard Oil Company) అను పుస్తకం ప్రచురించింది. ఈ కంపెనీలోని కుళ్ళూ మోసమూ ప్రజలముందు పెట్టిందామె. అదే సంవత్సరంలో లింకన్ స్టీఫెన్సు (Lincoln Steffens) 'షేమ్ ఆఫ్ ది సిటీస్' (Shame of the Cities) అను గ్రంథంలో దేశ మొత్తం మీద మునిసిపల్ వ్యవస్థలో జరుగుతున్న అవినీతినీ లంచ గొండితనాన్నీ బయటపెట్టాడు. 1906 లో మరొక బ్రహ్మాండ మయిన పుస్తకంవచ్చింది - 'ది జంగిల్'. అప్టన్ సింక్లేర్ రచించిన 'ది జంగిల్' చికాగోనగరంలోని 'మీట్ పాకింగ్ యిన్‌డస్ట్రీ' (Meat Packing Industry) (మాంసాన్ని డబ్బాల్లో పదిలపరిచి పంపే పరిశ్రమ)లోని ఘోరాలని లోకానికిచెప్పింది. ఫ్రాంక్

నారిస్ రైలు మార్గాల్లోనూ, గోధుమ బజారులోనూ జరుగుతున్న అన్యాయాన్ని లోకానికిచెప్పగా, అప్టన్ సింక్లేర్ పుస్తకం మాంస పరిశ్రమలోని విషపూరిత వాతావరణం బహిర్గతంచేసింది. 'ది జంగిల్' వెలువడగానే కేంద్రప్రభుత్వం మళ్లీ మరొక పరిశీలనా సంఘాన్ని ఏర్పరచింది. యీ వార్తలన్నీ పత్రికల్లో పెద్దక్షరాల్తో పడుతూండేవి. ప్రజలకి రానురాను, యిదేమిటి యింత ఘోరాలు జరుగుతున్నాయా - అని అనిపించసాగింది.

పైన చెప్పిన పుస్తకాలు నేను చదవలేదు. పత్రికలు చదివే వాడిని కాబట్టి వాటిల్లో ఆ పుస్తకాల గురించి వుండేది కాబట్టి వాటపేర్లూ, అవిచేసే అలజడీ నాకు తెలియవచ్చేది. అంతేగాక తాతయ్యా చుట్టల షాపులోకి వచ్చిన ప్రతివారూ యీ పుస్తకాల గురించి వుదహరించి, వాట గురించి వాదోపవాదాలు సాగించేవారు. కొందరు నిజమనీ, కొందరు అబద్ధమనీ కొట్లాడుకునేవారు. ఏమైనా ప్రతిఒక్కరూ వీటి గురించి మాట్లాడుకుని, యిందు విషయమై వాదులాడుకోడం సర్వసామాన్యమైపోయింది. అచ్చు అక్షరానికి గల విలవ, దాని శక్తి మొట్టమొదటిసారి తెలుసుకోగలిగాను నేను.

తదుపరి సంవత్సరాలలో చాలా పుస్తకాలు వచ్చాయి. 19 7 లో జాక్ లండన్ 'ది అయిరన్ హీల్'లో (The Iron Heel) యిరవై అయిదుసంవత్సరాల అనంతరం అమెరికాదేశం యావత్తూ భాగ్యవంతుల చెప్పెట్లో ఎలా యిమిడిపోయేదీ వర్ణించాడు. స్వేచ్ఛా వాయువులు నశించిపోయి ప్రజాస్వామ్యసూత్రాలు మంట గలుస్తా యని భయపెట్టాడు. అమెరికన్ ప్రజలలో ఒకభయం పట్టుకుంది:

ఈ ధనవంతులు రాను రాను తమని నల్లులని నలిపినట్లుగా నలి పేస్తారేమోనని భయం పట్టుకుంది. 1910 లో గస్టరస్ మేయర్స్ 'ఏ హిస్టరీ ఆఫ్ ది గ్రేట్ అమెరికన్ ఫారుట్యూన్స్' (A Hisrory of the Great American Fortunes) అను మరొక వుపద్రవమైన పుస్తకం ప్రకటించి, సేల్, వెండల్ బిల్ట్, బ్లెయిర్, ఫ్రిక్, కార్నెజీ హిల్, మొదలైన కోటీశ్వరుల చుట్టూగల జల్తారు తెరలని ముక్క ముక్కలుగా చింపేశాడు. ఈ కోట్లూ యీ ధనరాసులూ, ఎటు వంటి అవినీతితో, వంచనతో, మోసంతో, దగుల్బాజీతనంతో అక్ర మంగా కూర్చబడ్డాయో, పేజీ తరువాత పేజీగా, విషయం తరు వాత విషయంగా, తేదీలతోనూ, దాఖలాలతోనూ సహా ప్రచురిం చాడు. ఆ నాటితో అమెరికన్ పౌరుడికి కోటీశ్వరుడంటే నమ్మకం పోయి, యీ డబ్బు యితనికి ఎందరి తలకొడితే వచ్చిందో అను అభిప్రాయం ఏర్పడింది.

ఈ పుస్తకాలే కాదు, ఇంకా చాలావచ్చాయి. ఆనాడు వెలు వడ్డ పుస్తకాలన్నీ కాలప్రభావానికి మచ్చు తునకలు. అమెరికన్ ప్రజలు కోటీశ్వరుల కూటమి తమని ఏ విధంగా దిగ్బంధం చేస్తున్నదీ తెలుసుకున్నారు కోటీశ్వరుడంటే గౌరవంపోయింది. వారు చేసే దానధర్మాలు కూడా అనుమానదృష్టితో చూడ సాగారు. అమెరికాదేశం, అమెరికన్ ప్రజలకి చెందాలనీ, ప్రజా జీవితాన్ని కలుషితం చేస్తున్న కొద్దిమంది వ్యక్తులచేతుల్లో ఆట వస్తువ కాకూడదనీ ప్రజాకంఠం పెద్దగా పలికింది. ఈ ఆందో ళనతో పెద్ద పరిశ్రమలమీద పడ్డారు. ప్రతిచోటా 'రిఫారమ్సు' కావాలన్నారు. న్యాయచట్టాలలో మార్పూ, నీతివర్తనా, ముఖ్య

మన్నారు. ఆ సమయంలోనే అమెరికాలోని భారీపరిశ్రమ (Big Business) ప్రజల విశ్వాసాన్ని కోల్పోయింది. ఆనాడు పోయిన విశ్వాసం, తిరిగి పునర్నిర్మితం కానే లేదు. భారీ పరిశ్రమ తమకీ ప్రజలకీ మధ్య 'పబ్లిక్ రిలేషన్సు కౌన్సిలర్' (Public Relations Counselor) వుంటం మంచిదని భావించింది. కార్మికుని గొంతుక నానాటికి పెద్దదవుతోంది. అతను సంఘాలు నిర్మించుకు శక్తివంతుడవుతున్నాడు. సామాన్యమానవుడు యీ యాంత్రికయుగంలో తన స్థానమేదో తెలుసుకునేందుకు తపన పడుతున్నాడు, తనకీ పరిశ్రమకీగల సంబంధబాంధవ్యాలు ఎటు వంటివి? పరిశ్రమ తన గుప్పెట్లో వుంచుకున్న ఆర్థికశక్తిని ఒక పక్కన వొదిలేందుకు యిష్టపడేది కాదు. అంచేత యంత్రానికీ మానవునికీ అటపా తడపా పేచీ లొచ్చేవి.

ఈ కలతలతో మధ్య మా తాతయ్యకి మనశ్శాంతిపోయింది. ఈ ఆందోళనవల్ల సంఘనిర్మాణం, కూలిపోతుందని ఆయన భయం. ఇదంతా మంచికే అనేవాడు మిస్టర్ హడ్లీ. పరిశ్రమా మంచిదే, యంత్రమూ మంచిదే - కాని యీ రెండూ కలిసి మానవుడిని పిప్పి చెయ్యకూడదు - అని హడ్లీ వాదన. మానవుడిని యంత్రము పిప్పిచేసినమీదట వాక్స్వాతంత్ర్యానికీ, మతస్వాతంత్ర్యానికీ, పత్రికా స్వాతంత్ర్యానికీ, అసలు స్వాతంత్ర్యమనే మాటకే అర్థమేముంటుంది? తాతయ్యకి హడ్లీమీద అప్పుడప్పుడు చాలా కోపం వచ్చేది. కాని హడ్లీ చెప్పినదంతా నాలాటి వాళ్ళకి న్యాయంగానూ సబబుగానూ కనిపించేది.

తాతయ్యా ఒకసారి జోళ్ళు కుట్టించుకునేందుకు షిల్లర్ దగ్గరకు వెళ్ళివస్తాననేసరికి, అమ్మమ్మ విరుచుకుపడింది. "మనమంత భాగ్యవంతులం కాదు - ఏడు డాలర్లుపెట్టి జోళ్ళు కుట్టించుకునేందుకు. బజార్లో రెండున్నర డాలర్లకి జోళ్ళు దొరుకుతుంటే ఏడు డాలర్లు తగలెయ్యాలి కాబోలు," అని చీదరించుకుంది. కొన్నాళ్ళ పాటు తాతయ్యా వూరుకొని తన బొటనవ్రేళ్ళవాపుకి (Bunions) మరే జోళ్ళూ పనికిరానిపవడంచేత, జోళ్ళు ఆర్డరిచ్చేందుకు, షిల్లర్ దగ్గరకు వెళ్తూ తన వెంట నన్ను తీసుకెళ్ళాడు. షిల్లరు పెద్దవాడు, తలంతా నెరిసిపోయింది. అతని మాటల్లో జర్మన్ వుచ్చారణకనపడేది. అతని షాపు యాభై ఒకటో వీధిలో అడుగుభాగాన ఒక మూలగావుండేది. షాపులోకి అంత వెలుతురుకూడా వచ్చేదికాదు. 'థర్డ్ ఎవెన్యూ'నుంచి వెళ్ళే జన సామాన్యానికి యిక్కడ ఒక జోళ్ళషాపువున్నట్లు పరిశీలనగా చూస్తే గాని తెలియనే తెలియదు.

షిల్లర్ తాతయ్యాపాదం కొలతలు జాగ్రత్తగాతీసుకున్నాడు. పాదం యిటూ అటూ కొలిచాడు. ఒక కాయితంమీద రెండు పాదాలముద్దరలూ తీసుకున్నాడు. మరునాడువచ్చి, నమూనా ఎలా వున్నదీ చూసుకువెళ్లమని తాతయ్యాతో అన్నాడు. నా కెందుకనో ఆ షాపుచూసీ చూడగానే, షిల్లర్‌మీద ఎంతో అభిమానం ఏర్పడింది. తాతయ్యాజోళ్లు ఒక వారంలో తయారయిపోయాయి. అయితే నేనుమాత్రం తీరికదొరికినపుడల్లా షిల్లర్ షాపులోకివెళ్ళి, అతను పనిచేస్తూవుండటంచూసి ఆనందిస్తూ, యీ ఖబుర్లూ, ఆ ఖబుర్లూ అడిగేవాడిని.

"ఈ రోజుల్లో జోళ్లెవరూ కుట్టించుకోడం లేదు కదూ? బజార్లో కొనుక్కుంటున్నారు అంతేగా?" అని అడిగాను పిల్లర్‌ని.

"అవును; యిప్పుడెవరూ కుట్టించుకోడంలేదు. బోస్టన్ జోళ్ల ఫాక్టరీ కావలసిన జోళ్లన్నీ తయారుచేస్తోందిట."

"జోళ్లు తయారుచెయ్యడం కూడా పెద్ద పరిశ్రమే అన్న మాట."

"అని నెమ్మదిగా అంటావేమిటి? వెనకటి రోజుల్లో చేతుల్తో కన్నాలుపొడిచి, జోళ్ళు జాగ్రత్తగాకుట్టేవారు. యిప్పుడాబోస్టన్ ఫాక్టరీలో యంత్రాలే కన్నాలుపొడిచి గబగబ కుట్టేస్తాయిట. నేను ఒకజోడు తయారు చెయ్యడానికి ఒకవారంరోజులు పడుతుందా?- అక్కడ ఆ ఫాక్టరీలో నిముషానికొక జతచొప్పున తయారవుతుం దిట."

"ఓ - అలాగా. అయితే న్యూయార్కులో వాళ్లందరికీ తొడుక్కునేందుకు జోళ్ళు లభిస్తాయన్నమాట. ప్రతివాళ్ళకీ కనీసం ఒక్క జతైనా వుంటుందన్నమాట."

"అనే లెక్కలువేస్తారు" అన్నాడు పిల్లర్.

"అయితే, చాలామంది కాళ్ళకి జోళ్ళుండవే. శీతాకాలంలో పొద్దుటివేళ కాళ్ళకి గోనెపట్టాలు చుట్టుకుంవెళ్ళే పనివాళ్ళని చూస్తున్నానే!"

"అది, యీ ఒక్క న్యూయార్కులోనే కాదు. అన్నిచోట్లా వున్నదే. ప్రపంచమంతటా వున్నదే."

షిల్లరు పని చేస్తూవుండగా చూడ్డం ఎంతో సంతోషంగా వుంటుంది. పనివాళ్ళు తమపనిలో నిమగ్నమైపోడం అంటారే, అది అతని ముఖంలో కనపడుతుంది. కన్నాలు కొడుతున్నపుడూ, నరంతో కుడుతున్నపుడూ, మడవలు అతికిస్తున్నపుడూ, అతనిని చూడవలసిందే.

"నేను గొడారివాణ్ణి (Cobbler) కాను, షూమేకర్ని" అని గర్వంగా చెప్పుకునేవాడు షిల్లర్. అతను యూరప్‌లో శిక్షణపొంది వచ్చాడు. ఒకప్పుడు అతనివ్యాపారం చాలా బాగుండేది యిప్పుడు బాగా పడిపోయింది. మడమలు వేయించుకోడం జోళ్ళు బాగు చేయించుకోడం తప్ప అతని దగ్గిరకొచ్చి జోళ్ళు కుట్టించుకునే వారు అరుదయిపోయారు. మడతపడ్డ పాదాలుకలవారూ, అంగ వికలులూ మాత్రమే యితనికి పనియిచ్చేవారు. మిగతా వాళ్లందరికీ ఎక్కడబడితే అక్కడ జోళ్ళకంపెనీలు వున్నాయిగా!

షిల్లర్ కబుర్లుచెపుతూనే, తన పనిచేసుకునేవాడు. అతను జర్మనీలోపుట్టాడుట. బాల్యదశ హాయిగా గడిచిపోయిందిట. ఒక రోజున, అతను కైజర్‌ప్రభువు సేనలో పనిచెయ్యడం గురించి చెప్పకుంటూవచ్చాడు.

"సేనలో నే నొక్కడినే కాదు; నావయసు వాళ్లందరూచేరాలి. అమెరికాలోవున్న మీకు తప్పని సరిగా సేనలో జేరడమంటే

ఏమిటోతెలియదు. యూరప్‌ఖండపు దేశాలన్నిటిలో నిర్బంధ సైనిక విధానముంది. జర్మనీ ఒక్కటే అనికాదు - అన్నిదేశాలూ అంతే."

"ఎన్నాళ్లు పని చెయ్యాలేమిటి సేనలో ?"
"మూడు సంవత్సరాలు."
"సేనలో పని చెయ్యడం యిష్టంగా వుండేదికాదా ?"

"సైనికవృత్తి ఎవరికిష్టంగా వుంటుంది ?" అంటూ సుత్తి మరికాస్త తీవ్రంగా బాదేవాడు.

నెమ్మది నెమ్మదిగా అతనికి జర్మనీదేశంపట్లా, అక్కడి సైనికోద్యోగులపట్లాగల అభిప్రాయాలు తెలుసుకున్నాను. సామాన్య సైనికుల్ని జంతువులకంటె హీనంగా చూస్తారని అనేవాడతను.

"సైనికవృత్తి అయిపోయాక నాకు స్వేచ్ఛలభించింది. హాంబర్గ్ నగరంవచ్చి నిలవజేసుకున్న కొద్దిపాటి డబ్బుతోటీ, అమెరికాకు ఓడ టికట్టుకొనుక్కున్నాను. అఖరికి మా స్వగ్రామం వెళ్ళి, యిలా దూరదేశం వెళ్తున్నానని మా బంధువులకన్నా చెప్పలేదు. మీరూ మీ కైజరూ సుఖంగావుండండి, అంటూ ఓ వుత్తరంముక్క రాసి పడేశాను."

కైజరు గురించీ, కైజరు మాటంటేనూ ష్లర్‌కి అంత ఆగ్రహమెందుకో నాకు తెలిసేదికాదు. "కైజరు చాలామంచి వాడటగా ?" అన్నాను.

"కైజరు మంచివాడా? అలా అని వార్తాపత్రికలు ప్రచురిస్తాయి. కైజరంత పరమదుర్మార్గుడు మరొకడుండడు" అన్నాడు షెల్లర్.

కైజరుప్రభువుని అంతమాట అనేసరికి నేను ఆశ్చర్యపోయాను. ఒక దేశాన్ని పరిపాలించేరాజుని, చెప్పులు కుట్టుకు బతికేమనిషి, అంతమాట అనెయ్యడమే! సింహాసనాలనీ కిరీటాలనీ గురించి, తేలిగ్గా మాట్లాడగా వినడం నాకదే మొదటిసారి.

"నువ్వు అమెరికన్ బాలుడివి. నీకు మా బాధలు అర్థంకావు. మా దేశంలో ఏవొక్కరికీ స్వేచ్ఛలేదు. మనసులోవున్నది, పైకి చెప్పేందుకు వీలులేదు. ప్రతివారూ తమపేరు నమోదు చేయించుకోవాలి. మనం ఎక్కడవున్నదీ, ఏంచేస్తున్నదీ పోలీసు వారు కనిపెడుతూవుంటారు. పోలీసులూ మిలటరీవారూ మనని వున్నస్తలంనుంచి మారనివ్వరు. నీ తండ్రి ఏమిటో నువ్వూ అదే అవుతావు. నీ తండ్రి కూలీనాలీచేసుకు బతికితే, నువ్వూ అదేపని చేసుకు బతకాలి. నీ పరిసరాలని మార్చుకోగల అవకాశం నీకేనాటికీ లభించనీయరు. నీ కున్న సమస్తం, మానవిత్తప్రాణాలు, కెయిజర్ ప్రభువువి. అటువంటప్పుడు స్వాతంత్ర్యమేమిటి?"

జర్మనీ గురించి తలపులు వొచ్చేసరికి, అమెరికా అతనికి ఒక భూతలస్వర్గంలా తోచేదట. తన యిష్టంవచ్చిన పని తను చేసుకు బ్రతకవచ్చునట, "నువ్వేంచేస్తున్నావ్? ఎంత మిగుల్చుకుంటున్నావ్?" అని ఎవరూ యిక్కడ ప్రశ్నించేవారు కాదట. ఒక

ప్పుడు యితనిజోళ్ళు పాపుకి న్యూయార్కులోని పెద్దపెద్దవారంతా వచ్చేవారుట.

షిల్లర్ పెద్ద చదువుకున్నవాడుకాదు. స్వల్పవిషయాల నుంచి జీవితంలోని పరమసత్యాలు, అతని పరిశీలనలో మణి పూసలవలె అగుపడేవి. అతనికి అన్నివిషయాలూ కూలంకషంగా తెలుసు. అయితే బోస్టన్‌లోని జోళ్ళఫాక్టరీ కారణంగా, తనవృత్తి పడిపోయిందనీ, రాబడి సన్నగిలిందనీ, అంచేత తనింత చిన్న కొట్లో గడపవలసివస్తున్నదనీ - ఆ ఆర్థికన్యాయం మటుకుతెలి యదు. అప్పుడప్పుడు అనేవాడు. "నేను ఒకవిధంగా బంధింప బడ్డ ఖైదీనేకావచ్చు. అయినప్పటికీ యీనాలుగు గోడలమధ్యా స్వేచ్ఛావాయువుపీల్చగలుగుతున్నాను."

షిల్లర్‌తోపాటు కార్బెట్ అను మరొక ఆయనకూడా నాకు ఆ రోజుల్లో పరిచయంఅయాడు. కార్బెట్‌కి షిల్లర్‌కి చాలా విష యాల్లో సామ్యంవుంది. అయినప్పటికీ యిద్దరూ విభిన్నవ్యక్తులు. షిల్లర్ జర్మన్ దేశీయుడైతే - కార్బెట్ ఆంగ్లేయుడు. ఇద్దరూ తమ చిన్నతనంలోనే అమెరికావచ్చారు. యిద్దరూ తమ వృత్తివల్లనే వృద్ధిలోకివచ్చారు. షిల్లర్ యంత్రాలవల్ల పీడింపబడితే, కార్బెట్‌ని కార్మికవిధానం, కార్మికన్యాయసూత్రాలూ, అతనికి పెద్దవయసులో చేతినిండా పని లేకుండాచేశాయి.

షిల్లర్‌కివలె కార్బెట్ ఎక్కువ మాట్లాడేవాడుకాదు. అతను దయా స్వభావి, స్నేహపాత్రుడు. ఏవి కలప ఎటువంటివో, ఎటు

వంటికర్రతో ఎంత చక్కటివి తయారుచెయ్యవచ్చో, అతను చెప్పే వాడు. కర్రని వాసనచూసి అది కొత్తదో పాతదో చెప్పగలగడం అయనవద్ద నేర్చుకున్నాను. పియానోలు తయారుచెయ్యడంలో ప్రఖ్యాతిపొందిన కార్బెట్ తనదగ్గిరవున్న ప్రతి పనిముట్టూ ఏవిధంగా వుపయోగపడేదీ వివరించి చెప్పేవాడు. అతను పనిచేస్తున్నపుడు చూస్తే, నాకెంతో సరదాగాఉండేది. చిన్నచిన్న కర్రముక్కలు చిత్రికపట్టడం, వాటిని అందమైన ఆకారాల్లోకిమార్చడం, ఆ మార్చిన చెక్కల్ని నేర్పుగా అతకడం, నగిషీపనీ, యిలాటివన్నీ కార్బెట్‌చేస్తూండగా చూడవలసిందే.

వడ్రంగం గురించిన సమస్తం, కార్బెట్ పరిచయంతో నాకు తెలిసిపోయింది. ఇటు పిల్లరూ అటు కార్బెటూ యిద్దరూకూడా మారిపోతున్న కాలంతోపాటు మారలేని వ్యక్తులు. ఈ యిద్దరు మాత్రమే నాకుతెలుసు. ఇలావచ్చిన వారిలో ఎన్నివేలమంది, ఎన్ని లక్షలమందివున్నారో చెప్పలేం. కొత్త ఆశలతో నూతన అవకాశాల కోసం ఎందరెందరో మా అందాలదీవికివచ్చారు. కాని కార్బెట్ పిల్లర్లనిచూడ్డంతో సంతోషంతోపాటు విచారంకూడా కలిగేది. వారి జీవనకాలంలోనే వారి జీవితాలు ఒకవిధంగా పరిసమాప్తినొందాయి. వారిటైము పూర్తికాక పూర్వమే కాలప్రభావం వారిని మృతజీవు లుగా చేసేసింది. అమెరికా మొత్తంమీద పిల్లర్ కార్బెట్లవంటి వారు కొన్నివేలమంది కాలగర్భంలో కలిసిపోతున్నారు. వారి గురించి సంఘం ఏమీ చెయ్యలేకపోతోంది. అటువంటి వారి వుని కినే ఒకవిధంగా విస్మరించింది. ఆ సమయంలో థియోడోర్ రూజ్ వెల్టు ప్రెసిడెంట్ అయాడు. థియోడోర్ దూరదృష్టి, కార్యదక్షతా

కల మహనీయుడు. అమెరికాదేశం ఎదుర్కొపలసిన సమస్య లేమిటో అతనికి స్పష్టంగాతెలుసు. ఆ సమస్యలనుంచి పారిపోక వాటిని ఎదుర్కొనేందుకు ఆయన సిద్ధపడ్డాడు.

అసలు థియేడోర్ ప్రెసిడెంటు అవటమే తమాషాగాజరిగింది.

అమెరికా-స్పెయిన్ యుద్ధానంతరం థియేడోర్ రూజ్‌వెల్టు విజయపతాకంతో మాతృదేశంలో పాదంపెట్టాడు. ఆ నాటి విజయంతో ఆయనపేరుప్రతిష్టలు యినుమడించాయి. 1898 లో ఆయనని న్యూయార్కుస్టేట్‌కి గవర్నరుగా ఎన్నుకున్నారు. ఇతను రుజువర్తన పైనున్న రాజకీయనాయకులకి నచ్చలేదు. పై నాయకులు తన వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోటం, థియేడోర్ ఒప్పుకునేవాడుకాదు. ఏ పనులు ప్రజలకి లాభదాయకమో, అటువంటివి తలపెట్టి, పైవాళ్ళు ఏమనుకుంటే నాకేం, అన్నధోరణిలో ప్రజాహిత దృక్పథంతో వ్యవహరించేవాడు. ఒకసారి యితన్ని గవర్నరుగా నిలబెట్టినమీదట, యితను కొరకరానికొయ్య అని అగ్రనాయకులకి తెలిసిపోయింది. జనసామాన్యంలో థియేడోర్‌కి గొప్ప పేరు ప్రఖ్యాతులువున్నాయి; అంచేత అతన్ని పూర్తిగానెట్టేసేందుకు వీలులేదు. అందుకని అగ్రనాయకులు యితనిని రాజకీయంగా పూడ్చిపెడదామని వుపాధ్యక్షపదవికి నిలబెట్టారు. మెక్కిన్లీ ప్రెసిడెంటు. థియేడోరేమో వైస్-ప్రెసిడెంటు. ఉపాధ్యక్షునిగా చెయ్యడంవల్ల, అతనిచేతుల్లో రాజకీయంగా ఏ విధమైన శక్తివుండదని అగ్రనాయకులు తలపోశారు.

ఇరవయ్యో శతాబ్ద ప్రారంభానికి పరిస్థితులు పై విధంగా వున్నాయి. మెక్కిన్లీని బఫెలో నగరంలో ఎవరో దుర్మార్గులు హత్యచెయ్యడంతో, వుపాధ్యక్షుడైన థియోడోర్, అధ్యక్షుడవడం జరిగింది. అప్పటి కాయన వయసు నలభైరెండు సంవత్సరాలు.

థియొడోర్ రూజ్‌వెల్టు అన్నిరంగాల్లోనూ సర్వసమర్థుడు. అమెరికాదేశంలోని సామాన్యుల కాయన ప్రతినిధిగా నిలబడ్డాడు. ఆయన అధ్యక్షపీఠం ఎక్కిన నాటినుంచి అమెరికన్ ప్రజలు ఆయ నని తమవానిగా భావించారు. తమ ప్రజాజీవితంలో అత్యవసరంగా కావలసిన సంస్కారాలేమిటో థియొడోర్‌కి చక్కగా తెలుసు. పెద్ద పెట్టుబడిదారులనీ, పారిశ్రామికులనీ, డబ్బు సంపాదనలో నీతి నియమాలు పాటించని కోటీశ్వరులనీ ఆయన ఎదుర్కొన్నాడు. కాంగ్రెస్‌సభలో ఆయన చెప్పిన మొట్టమొదటి సందేశంలో తను కార్మికపక్షపాతిననీ పెద్ద పెద్ద కంపెనీలు ఒకదానితో ఒకటి కలిసి పోయి, కార్మికులకీ, పనివారలకీ అన్యాయాలుచేయడం తను సహిం చననీ స్పష్టపరిచాడు. పనివారల చట్టం, పని గంటల నియమం మొదలైన సంస్కరణలు దేశంలో వ్యాప్తమయేందుకు ఆయన పూనుకున్నాడు. అమెరికాలోని పెట్టుబడిదారులు చెడిపోవాలని ఆయన వుద్దేశం కాదు. మొత్తంమీద దేశమంతా సుభిక్షంగా వుండాలి; పరిశ్రమలని యీ అదనులో అరికట్టకపోతే అవి అమె రికా ప్రజాజీవితాన్నే నాశనం చెయ్యగలవని ఆయన గ్రహించాడు.

దేశంలో వెలువడుతున్న గ్రంథాలు భాగ్యవంతుల దురా గతాలని బయట పెట్టసాగాయి. సాంఘిక రాజకీయరంగాల్లో,

ముఖ్యంగా రాజకీయరంగంలో సంస్కరణలు అమలులోనికి వచ్చాయి. అమెరికా స్టీలు కార్పొరేషన్, స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ మొదలైన వాటి చరిత్రలూ చిట్టాలూ తిరగవేయించి, వారు వెనక చేసిన దుర్మార్గపుచర్యలు తిరిగి జరక్కుండా కట్టుదిట్టంచేశాడు. ఒక్క స్టాండర్డ్ ఆయిల్ కంపెనీయే తను చేసిన తప్పులకుగాను ప్రభుత్వానికి రెండుకోట్ల తొంభై లక్షల డాలర్లు జుల్మానాగా చెల్లించుకోవలసివచ్చింది.

కొవ్వు అగ్నిలోకి విసిరేసరికి ఆ మంట ఎంతో తేజోవంతంగా నలువైపులకీ ప్రసరించింది. ప్రజలు థియొడోర్‌వైపు వున్నారన్న మాటేగాని, అధికారులకీ ధనవంతులకీ ఆయన పరమవిరోధి అయి పోయాడు. తాము యితరుల నెత్తికొట్టి సంపాయించిన డబ్బులో కొంచెం కూడా వొదులుకునేందుకు ధనవంతులెవరూ అంగీకరించే వారు కాదు. వారు ప్రెసిడెంట్ థియొడోర్ రూజ్‌వెల్టుతో హోరాహోరీ పోరాటం సాగించారు. ఆయనని నానామాటలూ అన్నారు. అనేకమయిన చెడ్డకథలు ఆయనమీద ప్రచారం చేశారు. కానీ అమెరికన్ ప్రజల కాయన అప్తుడయాడు. 'టెడ్డీ' అనుపేరుతో పిల్చేవా రాయనను. 1904 ఎన్నికలలో బ్రహ్మాండమయిన మెజారిటీతో మళ్ళీ అధ్యక్షునిగా ఎన్నుకోబడ్డాడు.

థియొడోర్ రూజ్‌వెల్టు అధ్యక్షుడిగావున్న రెండు టరమ్సు (గడువులు)లోనూ ఒక నైతికశక్తి దేశమంతటా ప్రవహించింది. ఆ నైతికశక్తి ప్రజాహృదయంనుంచి వెలువడింది. ప్రభుత్వం ప్రజల సంరక్షణకోసం అన్నిరంగాలలోనూ ముందడుగు వేసింది.

ది షర్మాన్ యాంటిట్రస్ట్ యాక్ట్, (The Sherman Anti-Trust Act) ది ప్యూర్ ఫుడ్ అండ్ డ్రగ్స్ యాక్ట్ (The Pure Food and Drugs Act) మొదలైన న్యాయచట్టాలతో కంపెనీలు కల్తీసరుకు అమ్మడం మానేశాయి. కల్తీ ఆహారపదార్థాలు అమ్మే కంపెనీలకి పెద్ద పెద్ద జుల్మానాలు పడటంతో, జుల్మానాలతోపాటు జైలు శిక్షకూడా పడ టంతో, సంఘ విద్రోహచర్యలకు వుద్వాసన చెప్పడం జరిగింది. చెడిపోయిన మాంసం డబ్బాలూ, పనికిరాని మందుల సీసాలూ మార్కెట్‌లో వుంచడం, చట్టరీత్యా నేరమని ప్రకటించడం జరిగింది

అవి అమెరికన్ ప్రజల జీవితంలో వుత్సాహవంతమైన సంవత్సరాలు. నేనూ ఆ ఏటికాఏడు పెద్దవాణ్ణవడంతో అనేక కొత్తవిషయాలు తెలియ నారంభించాయి.

ఆనాడు సంభవించిన ప్రతి మార్పుకీగల దూరఫలితాలు అప్పటికప్పుడు తెలిసేవికావు. అయితే జరుగుతున్న సమస్తం మంచిదని మాకు తెలుసు. ఆ కాలంలోనే అమెరికాలోని 'సామాన్యపౌరుడు' ముందుకు వచ్చాడు. అతని వ్యక్తిత్వాన్ని గుర్తించడం జరిగింది. ఆ సామాన్యపౌరుని రక్షణకోసమే అతని హక్కులు కాపాడేందుకే, కొత్తవైన న్యాయచట్టాలు ప్రవేశపెట్టడం జరిగింది. యిరవయ్యో శతాబ్దపు ప్రారంభసంవత్సరాలలో తను పొందిన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు కాపాడుకునేందుకు అమెరికన్ పౌరుడు బద్ధకంకణుడైనాడు. థియొడోర్ రూజ్‌వెల్టు ధర్మమా అని సామాన్యపౌరుని వ్యక్తిత్వం గుర్తింపబడటంతో ప్రజాస్వామ్యధర్మానికి బలం చేకూరింది.

# అనుభవ జ్ఞానం

నేను హైస్కూల్లోవున్న నాలుగేళ్ళపాటూ థియొడోర్ రూజ్‌వెల్టు వైట్ హౌసులోవున్నాడు. సామాన్యంగాపుని ప్రపంచాన్ని థియొడోర్, ఎంతో చైతన్యవంతంగా మార్చ నారంభించాడు.

స్కూల్లో అల్‌జీబ్రా, జామెట్రీ, జర్మన్ భాషా నేర్చుకుంటూండేవాడిని, స్కూలుపాఠాలకంటె బయట కార్యకలాపాల మీద మక్కువవుండేదా రోజుల్లో. గుర్రపుపందాలూ, నాటకాలూ, సంగీతమూ, నన్ను అమితంగా ఆకర్షించేవి. నాకు అప్పట్లో రెండు సామాన్యమైన మెడల్సూ, ఒక వెండిమెడలూ వచ్చాయి. రన్నింగ్ రేస్‌లోనూ, జంపింగ్‌లోనూ సామాన్యమైన మెడల్సువచ్చాయి. వెండిమెడలేమో హైస్కూల్లో నేను ఆఖరి సంవత్సరంలో వుండగా 'న్యూయార్కు టైమ్సు పత్రిక'లో పడ్డ వ్యాసానికిగాను వచ్చింది.

రన్నింగ్‌లో చిన్నప్పటినుంచీ నాకు అనుభవమే. స్పానిష్-అమెరికన్ యుద్ధం సందర్భములో కుర్రవాళ్ళమైన మేము చాలా కాలంపాటు రన్నింగ్ ప్రాక్టీసు చేశాము. నాకు ఎంతకీ అమెరికన్ ఆర్మీలో రన్నర్‌గానైనా పనికొస్తానసనేగా ఆనాటి తాపత్రయం!

అప్పటినుంచి అలవాటు చేసుకున్న రన్నింగ్, హైస్కూల్లో నాకు బహుమతి సంపాయించి పెట్టింది. సెంట్రల్ పార్కులో నేనూ మిగతా పిల్లలం పరుగులు తీసేవారం, ఎవరు ముందు, ఎవరు ముందు అని మా కాళ్ళలో శక్తికొద్ది పౌరు తీసేవారంగాని, పోటీలు బహుమతులూ మొదలైనవి వుంటవని కారణంగా, కొంచెం నిరుత్సాహపడేవారం. కాని జీవితంలోని అద్భుతమేమిటంటే, ఎప్పుడో చిన్నప్పుడు అమాయకంగా తీసిన పరుగు, హైస్కూల్లో చదివే నాటికి వుపయోగపడి, నేను వేగంగా పరుగెత్తేవారిలో ఒకనిగా పరిగణింపబడటం.

నేను చదువుకునే స్టువెసెంట్ హైస్కూలు సరికొత్త కట్టడంలోవుండేది. మా స్కూలుది నూతనభవనమన్న విషయం విద్యార్థులందరికీ సంతోషప్రదంగా వుండేది. ఆ స్కూలు ప్రారంభించాక నేను రెండోవాణ్ణి. మొదటిరోజుల్లో మా స్కూలు భవనమూ, ఆ గదులూ, అవన్నీ చూడటం, ఎంతో ప్రమోదకరంగా వుండేది. ఫిజిక్సుకీ కెమెస్ట్రీకి పరిశోధనశాలలూ, (లేబరేటరీస్) వడ్రంగం నేర్పేభాగం, యంత్రాలూ యంత్రపు పనిముట్లతో వృత్తి విద్యలు నేర్పేభాగం, యిలా మా స్కూలు మొత్తంమీద ఒక బ్రహ్మాండమయిన దివ్యభవనం అది. స్కూల్లోజేరిన మరునాడే గేమ్సు టీచర్‌తో పరిచయం చేసుకున్నాను. మిస్టర్ హౌల్టన్ చాలా మంచివాడు. ఆల్జీబ్రాలో మొదటి ప్రాబ్లెమ్ పరిష్కరించక పూర్వమే జర్మనీలో మొదటిపాఠం నేర్చుకోక పూర్వమే ఐవాన్‌హో నవలలోని మొదటి ప్రకరణం చదవక పూర్వమే, నేను ఆటలలోనూ పరుగులలోనూ నిమగ్నుణ్ణి అయిపోయాను. తలుచు

కున్న కొద్దీ నా సమర్థత బుర్రలో కాక కాళ్లలో వుందా అనిపించేది. మిస్టర్ హొల్టన్ శిక్షణలో చదువు సంగతిమాట ఎటున్నా ఆట పాటలు బాగా అబ్బేయి. పరుగెడుతున్నమనిషి ఎప్పుడు వొంగాలో ఎప్పుడు వొంగకూడదో, గాలి ఏ విధంగా పీల్చాలో, మొదలైనవన్నీ నేర్పేవాడు మా టీచరు. మొదటి సంవత్సరంలోనే 'యింటర్-హైస్కూల్' పోటీలో నేను మూడవస్థానాన్ని పొంది, బ్రాంజ్ మెడల్ కొట్టేశాను. ఆ తరువాత పదకొండడుగుల 'జంప్'లో కూడా మూడవస్థానం సంపాయించి, మరొక బ్రాంజ్ మెడల్ బహుమతిగా పుచ్చుకున్నాను. యీ రెండు మెడల్సు పుచ్చుకోవడంతో నా కెంతో ధైర్యం కలిగింది. ఐవాన్ హో ఏమైతేనేం, జర్మన్ పాఠాలు ఏమైతేనేం, అను నిర్లక్ష్యం నాలో ప్రవేశించింది.

రన్నింగ్‌కి మల్లేనే థియేటర్ కూడా నన్నా రోజుల్లో ఆకర్షించేది. యిరవై అయిదు సెంట్లు జాగ్రత్త చెయ్యడం తరవాయిగా బ్రాడ్వేవైపు పరుగెత్తేవాడిని. బ్రాడ్వేలోని నాటకశాలకి వెళ్లాలంటే ఒకగంట ముందుగా స్కూలు చెక్కేసి రావాలి. ఒకగంటకాలంలో చెప్పే పాఠాలు ఏపాటి అని, అసలు లెక్కచెయ్యనట్లా బ్రాడ్వేవైపు పరిగెత్తేవాడిని.

బ్రాడ్వేలో తొంభై నాటకశాలలుండేవి. ఆ తొంభైలో నా యిష్టం వచ్చినచోటుకి వెళ్ళవచ్చు. నాకు ఆ రోజు ఎటువంటి నాటకం చూడాలనిపిస్తే, ఆ నాటకశాలకి వెళ్లేవాణ్ణి. ట్రాజిడీలు

కామెడీలు, సంగీతనాటకాలు, హాస్యరసప్రదర్శనలు, రకరకాలైన రూపకములు ప్రదర్శితమవుతూండేవి. షేక్స్పియర్, షెరిడాన్, యిబ్సన్, ఆస్కార్ వైల్డ్, పినేరో, ప్రభృతుల నాటకరాజములు. అక్కడ చూశాను. అంకుల్ టామ్స్ కాబిన్, కౌంట్ ఆఫ్ మాంటీక్రిస్టో మొదలైన నాటకాలూ, నెల్లీ ది బ్యూటిఫుల్ క్లోక్ మోడల్ లాటి శృంగార నాటకాలూ, అమెరికన్ కజిన్ వంటి రాజకీయపు నాటకాలూ మొదలైనవి చాలా చాలా చూశాను. అబ్రహాం లింకన్ యీ 'అమెరికన్ కజిన్' నాటకం చూస్తూండగానే నాటకశాలలో హత్యా గావించబడ్డాడట. ఈ దృశ్య కావ్యాలన్నిటిలోనూ ఏ నాటకీ మరపురాని కొన్ని అపూర్వదృశ్యాలుండేవి. ముఖ్యంగా వీరుడైన నాయకుడు కత్తిచేత బుచ్చుకుని, యిరవైమంది సైనికులని చెల్లా చెదురుగా నేల కూల్చేసరికి, ప్రేక్షకబాహుళ్యం అమితోత్సాహంతో హర్షామోదం వెలిబుచ్చేది.

ఒకముక్కలో చెప్పాలంటే, ఆరోజుల్లో నాటకాలే నాజీవం. థియేటర్‌ని నేను అమితంగా ప్రేమించేశాను. అక్కడ కనపడే జీవితం, వైరుధ్యం, ఆత్మగౌరవం, వుపన్యాస రీవి, మరింకెక్కడ అవుపడుతాయి? పెద్ద పెద్ద వాళ్ళు అనేకులు నాకు కనిపిస్తూండేవారు. నేను చిట్టచివర వరసలో వున్నప్పటికీ మా ముందు కూచున్న హేమా హేమీలందరూ ఎవరెవరా, అని తెలుసుకునేందుకు ప్రయత్నిస్తూండేవాడిని. తెర లేవడంతో నాటకశాలంతా నిశ్శబ్దతలో మునిగిపోయేది. అందరి చెవులూ, అందరి కళ్ళూ రంగస్థలంవైపే కేంద్రీకృతమయేవి. అక్కడ ఆ చివరవరసలో కూచుని నేను ఎన్నెన్ని దేశాలు చూశానో, ఎన్ని మహాప్రాసాదాల

లోకి అడుగుపెట్టానో! నార్వే ఫ్రాన్సు యింగ్లండులు చూసేను. అక్కడవుండే రాజభవంతులన్నీ నాకు తెలుసు. పెద్ద పెద్ద అంతః పురాలలో వారితోపాటు నేనూ ఫలహారం పుచ్చుకున్నాను; యుద్ధ భూముల్లో ప్రాణాలకి తెగించి నేనూ పోరాడాను. అతి సుందర మైన కన్యల సమక్షంలో ఆనందవీచికల మునిగిపోయాను. చీకటి కొట్లలో యమయాతనలు అనుభవించాను. సారా బెరన్‌హార్టు, జాన్ డ్రూ, మిసెస్ పాట్రిక్‌కాంబెల్. ఇ. హెచ్. సోదరన్, మిసెస్ ఫిస్కీ, మాడీయాడమ్సు, రాబర్టుమాంటిల్, ఎథిల్‌బారీమోరు, ఆమె సోదరులు లయనల్ అండ్ జాన్ బారీమోరు, వీరందరూ తమ వెంట ఎక్కడికి వెళ్తే అక్కడికి తీసుకెళ్ళేవారు నన్ను. వాడివెల్లీ ప్రదర్శనద్వారా లిలియన్ రసల్, వెబరు అండ్ ఫీల్డ్సు, మాంటు గోమరీ అండ్ స్టోను, విల్‌రోజర్సు, సోఫీ టక్కరు మొదలైనవారు పరిచయమయ్యారు. వీరందరూ నా మిత్రులూ, ఉత్తకోటిలోని వారూను. వారందరూ నాకు బాగా తెలుసు. నేను వాళ్ళకి తెలి యకపోవచ్చు. అది వేరే సంగతి. వారు రంగస్థలంమీదకి రాగానే దడదడ చప్పట్లుకొట్టి, వారికి కావలసిన ప్రోత్సాహాన్ని సమకూరు స్తూండేవాడిని.

మాజిక్ ప్రదర్శనలూ, సైకిల్ ట్రిక్‌లూ, తాళ్లమీదచేసే గమ్మత్తులూ, ఆనాటి హాస్యప్రదర్శనలలోనే చూశాను. విల్‌రోజర్స్ తాడుమీదచేసే ఫీట్‌ని థియేటరులోవున్న వాళ్లు మందరమూ ప్రాణాలు వుగ్గపట్టుకు చూసేవారము. వాడవెల్లీలో ఫీట్సేకాక పాటలుకూడావుంటాయి. మొత్తం ప్రదర్శన హాస్యరసప్రధానమై వుంటుంది. ఈ మాదిరి హాస్యప్రదర్శనశాలలు నాలుగుకంటే

ఎక్కువవుండేవికాదు. ప్రతిచోటా జనం నిండుగావుండేవారు. టికట్టు లభ్యమవడం కష్టం. అంతేగాక యీ ప్రదర్శనచూసేవారు కొంచెం విమర్శనాజ్ఞానం కలిగివుండటంవల్ల, వారికి హితవుగావున్న ఘట్టాలు మెచ్చుకుని, హితవుకానిచోట అల్లరిచేసేవారు. ఒక్కొక్క ప్పుడు తాముకోరిన పాటలు పాడమనేవారు. వాడివెల్లీ ప్రదర్శ నలో ఒక అంకానికీ, మరొక అంకానికీ మధ్య విరామకాలం ఎక్కువ వుండేదికాదు. ఒకటి పూర్తిఅవగానే, రెండవది సిద్ధ మయేది. ఈ అంకాలు పదినుంచి యిరవైనిముషాలకి మించి వుండేవికాదు. ప్రదర్శన ఘాటుగా, మనుషులకికోసం తెప్పించేది గానూ, నవ్వు తెప్పించేదిగానూ వుండేది.

ఇటువంటి ప్రదర్శనలో ప్రేక్షకులని రంజింపచెయ్యగలవారు అరుదు. నటకుడికి క్రమశిక్షణా సమర్థతలతోపాటు, వివేకవంత మయిన సమయస్ఫూర్తికూడా కావాలి. ఆనాటి 'వాడివెల్లీ'కి చెందినవారే బర్టు విలియమ్స్, చార్లీ చాప్లిన్.

బర్టు విలియమ్స్ అద్భుతకళాకారుడు. అతను నీగ్రో. స్టేజి మీదకిరావడమే మొహానికి నల్లరంగుపూసుకుని, దీనమైన నేత్రా లతోవచ్చేవాడు. చాలీచాలని నల్లసూటూ, తెల్లగ్లౌజూ ధరించేవాడు. పొడవుగా సన్నంగావుండేవాడు. శ్రావ్యమైన కంఠానికి అతను పెట్టింది పేరు. మానవజీవితంలోని దైన్యతకి అతను ప్రతిబింబమా అన్నట్టుగా కనపడేవాడు. ఆ దైన్యత అతడు ప్రదర్శిస్తున్న కొద్దీ ప్రేక్షకులలో హాస్యరసం వుత్పన్నమయేది. అతను స్టేజిమీదకు రావడమేమిటి, ప్రేక్షకులలో చీమ చిటుకుమన్నా తెలిసేపాటి

నిశ్శబ్దత ఆవరించడమేమిటి, రెండూ ఒకేసారి జరిగేవి. కాంతి వంతమయిన దీపాల ముందుకువచ్చి అతను కంఠంఎత్తి విషాద గీతం ఆలాపించేసరికి, ప్రేక్షక హృదంతరాళం ఏదో తెలియని వేదనతో తికమకపడేది.

బర్టు విలియమ్సు అనేకరకాలైన పాటలుపాడి అనేకమాదిరి ప్రదర్శనలుయిచ్చేవాడు. అతని ప్రదర్శనలన్నిటిలోకి గొప్పది పాంటోమైమ్‌లోని పోకరుగేమ్. పాంటోమైమ్ అనగా స్టేజిమీద ఒక్కడేవుండి, మిగతా పాత్రలని వూహించుకుని, ఆయా పాత్రల నటనని వరసగా ప్రదర్శించడం. బర్టు విలియమ్సు స్టేజిమధ్యని ఒక్కడూవుండేవాడు. అతను అయిదుగురు ఆటగాళ్ల ఆటని వర సగా ప్రేక్షకులకి చూపించాలి. ఒక్కొక్కవైపుకేవచ్చి పేక ముక్కలుతెరిచి ఆయా పాత్రలకి తగు హావభావ ప్రదర్శనకన బరిచి, ప్రదర్శనని రక్తికట్టించేవాడు. దైన్యతక ప్రతిబింబమూ అని పించే యితనిముఖంలో ఇంత అద్భుతమయిన భావప్రదర్శన ఎక్కడదాగివుందా అని - ప్రేక్షకులు ఆశ్చర్యపోయేవారు. అతని కంఠంనుంచి వెలువడ్డ ప్రతిపాటా హృదయంగీతమై, ఆనాటి ప్రేక్ష కులలో నిల్చిపోయేవి. ఆ తరువాత చాలామంది బర్టు విలియమ్సుని అనుకరించబోయారుగాని, అనుకరణవిద్యలో సహజప్రతిభ ఎలా వస్తుంది?



1908 ప్రాంతాల ఛార్లీచాప్లిన్ ఒక యింగ్లీషు సంగీత నాటక కంపెనీతో అమెరికావచ్చాడు. అతను పాంటోమైమ్‌లో యిచ్చిన రెండు ప్రదర్శనలూ విజయవంతమవడంతో చార్లీచాప్లిన్ పేరు

అమెరికాఖండమంతటా స్థిరపడిపోయింది. చాప్లిన్ మొట్టమొదటి ప్రదర్శనపేరు 'ఎ నైట్ లాడ్జింగ్'. ఇంగ్లీషు ప్రజల తిరస్కారం పొందిన నాటకమది. రంగస్థలంమీద రెండు వరసల పాతకాలపు కర్రమంచాలుంటాయి; తెర ఎత్తేసరికి, సాయంత్రమవుతోందన్న మాట; చిరుచీకటి పడుతున్న కొద్దీ దేశదిమ్మరులూ బిచ్చగాళ్ళూ వచ్చి, ఆ మంచాలు ఆక్రమిస్తారు. చివర ఒకముసిలి బిచ్చగాడొచ్చి తన మంచం చేరుకుంటాడు. ఆ తరువాత చార్లీ ఒంకరనడకలతో ప్రవేశించి, ఏదో దురుద్దేశం మనసులో వున్నవానివలె, మంచాల వరసలపంక క్రీగంటచూసి, ముసలి బిచ్చగాని మంచంపక్కవున్న మంచంవద్దకి చేరుకుంటాడు.

చీకటిపడుతుంది. ముసిలిబిచ్చగాడూ చార్లీతప్ప మిగతా అందరూ గుర్రుపెట్టి నిద్రపోతూంటారు. ముసిలి బిచ్చగాడు నిద్దర పట్టక అరాటపడటం, చార్లీ తన దుప్పటీ అడుగునుంచి పదిలంగా కనిపెడుతూంటాడు. అందరూ నిద్దరపోయారని నమ్మకం కలిగిన మీదట ముసిలి బిచ్చగాడు తన సంచీలోని నాణెములు, ఒక్కొక్కటే పక్కమీదపరిచి లెక్కపెట్టుకుంటాడు. చార్లీ నిమేష మాత్రంలో ఓ ప్లాను ఆలోచిస్తాడు. తన పక్కబట్టలు ఒక్కసారి చుట్టి, తన జేబులో వున్న ఒకే ఒక్క నాణెం పెద్ద శబ్దంతో నేల మీద జారేటట్లుగా పడేస్తాడు. ముసలివాడు తను లెక్కపెట్టు కుంటున్న నాణెములలో ఒకటి కిందపడింది కాబోలనుకుని, గబ గబా మంచందిగి, మోకాళ్ళమీద కూచుని, చీకట్లో నేలంతా తడుముతాడు ఆ నాణెంకోసం. యీ లోగా చార్లీ ముసలివాని రూపాయలసంచీ మొత్తం కాజేసి తన పక్కమీద తను కిక్కురు మనకుండా పడుకుంటాడు.

ముసలి బిచ్చగాడు తన మంచంమీద రూపాయిల సంచీ కనపడకపోయేసరికి, ప్రతి మంచందగ్గిరకూవచ్చి, వొక్కొక్కరినీ లేపి, పక్కబట్టల్లో ఎక్కడైనా వుందేమోనని వెతకపోతాడు. ఈ గోలా, ఒక్కొక్కళ్ళ లేపడం, ముసలివాని ఏడుపూ, దీంతో నిద్ర మత్తులోవున్న అక్కడ వాళ్లందరికీ చీకాకుపుడుతుంది. కారణ మేమిటోతెలియక, ఒకరితో ఒకరు కలహించుకోడం మొదలు పెడ్తారు. ఈ సమయంలో చార్లీ మంచాల పక్కనించీ, మంచాల అడుగునుంచీ, ముసిలివాడిని తప్పించుకొని, అతనితో కాసేపు చెలగాటమాడి. చటుక్కున గుమ్మం దగ్గిరకొచ్చి, తుర్రునపారి పోతాడు - ఆ రూపాయిల సంచీతో.

'ది మ్యూజిక్‌హాల్' అనుప్రదర్శనలో చార్లీ చాప్లిన్ ఒకతాగు బోతువాని పాత్ర ధరిస్తాడు. ఈ తాగుబోతువాని ముక్కు ఎర్రగా వుంటుంది. పూటుగాతాగి యితగాడు ఒకసంగీతప్రదర్శన ఆనం దించడానికివస్తాడు. ఆ తాగుడుమైకంలో అతను అతి రసపత్తర ఘట్టానికి మధ్యగా చప్పట్లు కొడుతూంటాడు. అసందర్భంగా యితనుచేసే కరతాళధ్వనులు, మిగతా ప్రేక్షకులకి ముహచిరాకు కల్గిస్తాయి. నాటకశాలలోవున్న అందరికి యితనంటె అసహ్యం పుడుతుంది. ఒక్కొసారి యితను తన స్టేజిబాక్సులోనించి స్టేజి మీదకు ఎక్కబోతాడు. అతికష్టంమీద ప్రజలు అతనిని ఆపుతారు. అప్పుడప్పుడు అతనికి నిద్రవచ్చి నిద్రపోతూంటాడు. అతను నిద్రలో మునిగివున్నప్పుడు సంగీత ప్రదర్శన సవ్యంగాజరుగుతుంది. మెళకు కువవచ్చిందా వెనక వదిలిపెట్టేసిన కథని పూర్తిచేసేందుకు వుప క్రమిస్తాడు.

ఈ రెండు పాంటొమైములు ద్వారా చార్లీ చాప్లిన్ అమెరికన్ ప్రజలకి పరిచితుడయాడు. పెద్దజోళ్ళూ, వొదులు పంట్లాం, డర్బీ టోపీ, పేకబెత్తం, - వీటితో చార్లీ చాప్లిన్, ఒకవర్గం ప్రజకి ప్రతినిధిగా ప్రపంచఖ్యాతిపొందాడు. ఈ యింగ్లీషు హాస్యగాని ప్రతిభా విశేషాలని, ప్రజ్ఞాపారీణతని న్యూయార్క్ ప్రజలు ఎంతగానో మెచ్చుకున్నారు.

థియేటరు గురించి తలచుకున్నపుడల్లా వొళ్ళు గగుర్పొడిచేది. నాటకాలూ నాటకసంబంధమైన విషయాలూ ప్రస్తావించడం మా జీవితాలకొక ప్రత్యేకతనిచ్చేది. సినిమాలింకా అప్పటికి స్లాప్ స్టిక్ దశలో (మొరటుహాస్యం) వుండేవి. అంచేత వుత్తమప్రదర్శనలు చూసేందుకూ, నాటకాలని ఆనందించేందుకూ, చాలామంది థియేటర్ని అభిమానిస్తూండేవారు. నాటకకళ ఆనాడు జీవనోత్సాహంతో విలసిల్లేది. నాటకకళాకారులంటే ఆ రోజుల్లో ఎంతో గౌరవం.

స్కూలైపోగానే నేను థియేటరుదగ్గిరకి పరుగెత్తేవాడిని. ఈ నాటకమందిరాల చుట్టుపక్కలనే, నేను అనేక కొత్తసంగతులు గ్రహించాను. స్కూల్లో నేర్చుకోలేనివీ, నేర్చుకోగల అవకాశంలేనివీ అనేకం యిక్కడ తెలుసుకున్నాను.

నాకు థియేటరంటే యిష్టం. నటకులంటే యిష్టం. నాటకాలంటే యిష్టం. నాటకసంబంధమైన విమర్శలంటే చెవి కోసుకునేవాడిని. ఒకరోజున మాకుతెలిసిన మిస్టర్ క్యాఫ్, మా చుట్టలషాపు కొస్తూండేవాడే ఆ క్యాఫ్, వద్దకువెళ్ళి, యిబ్సన్ గురించిన సంభా

షణికి మధ్యలో, నాకు నాటకాల్లో వెయ్యాలనిపుంది అన్నాను - అతనితో.

"అయితే నాటకకళ నేర్చుకో. అన్ని విద్యలకి మల్లేనే నటన కూడా ఒకవిద్య. నువ్వు యాక్టింగ్ నేర్చుకుంటే, ఆ నత్తి దానంతట అదేపోతుంది" అన్నాడు.

నా నత్తిపోవడమే కాకుండా నేను యాక్టర్‌నికూడా అవుతా నట. ఆలస్యమెందుకని తక్షణం నా అంగీకారం తెలియబరిచాను.

"నత్తి అనేది ఒక అలవాటు. నత్తిని తప్పించుకోడం ఏమంత కష్టంకాదు. యాక్టింగ్ అలవరచుకు, చక్కగా మాట్లాడటం నేర్చుకున్నాక, నత్తి దానంతట అదే పోతుంది" అన్నాడు మిస్టర్ క్యాఫ్.

నేను పైకి ఒక్కమాట అనలేదు కాని, అతనితో అక్షరాలా ఏకీభవించాను.

"యాక్టింగ్ ఫ్రీగా ఎక్కడ నేర్పుతారో నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు మిస్టర్ క్యాఫ్.

నిజానికి నాకు తెలియదు.

"అయితే నేను చెపుతాను. విను. అటువైపు దిగువగా వెళ్లు. నేను నీకు నా కార్డు యిస్తాను. అది తిన్నగా తీసుకెళ్ళి ఎమ్మా షెరిడాన్‌కి యియ్యి. మేమిద్దరం ఒకసారి 'మొంటానా' అనే నగ

రంలో డబ్బులేక వెనక ఏగడిపోయాం. మేము నటిస్తున్న నాటకం కంపెనీ డిమ్కి కొట్టడంతో మా కటువంటి అవస్తపట్టింది. నేనామెకి తప్పకుండా జ్ఞాపకం వుంటాను. ధనిక స్త్రీలు నడిపే ఒక నాటకకంపెనీలో ఆమె యిప్పుడు దర్శకత్వ పాత్ర నిర్వహిస్తోంది. దమ్మిడీ పుచ్చుకోకుండా నీకు నటనా వ్యాసంగం నేర్పుతుంది," అని హితోపదేశం చేశాడు మిస్టర్ క్వాఫ్.

అతనిచ్చిన కార్డు వుపయోగించడమా మానడమా అని చాలా రోజులు ఆలోచించాను. నా భయమెంతకీ ఏమిటంటే తీరా అక్కడికి వెళ్ళేసరికి, నోటినుంచి మాట పెగలదేమోనని. చాలా రోజులు మా యింటి పెరట్లో కూచుని, నాటకభాగాలు కంఠస్తం చేసి, నా నత్తి కొంతలో కొంత తగ్గిందని నమ్మకం కలిగినమీదట, ఒకరోజున స్కూలు టైము అయిపోయాక, ఆ కొత్తస్తలం వైపుగా వెళ్లాను. లోపలికి వెళ్లాలంటే గుండె దడదడ లాడింది. గుమ్మం పద్ద నిలబడ్డాను· లోపలికి వెళ్లనా మాననా అని తటపటా యిస్తున్నాను.

ఈలోగా చాలామంది బాలురూ, బాలికలూ ఆ భవనంలో ప్రవేశించడం చూశాను. కొందరు తెలివిగలవారిలా కనిపించినా, మరికొందరు చవట పెద్దమ్మల్లావున్నారు. తెలివిహీనులైనవారే దడ దడ లోపలికి వెళ్ళిపోతూండగా, నేను సంశయించవలసిన పని ఏమిటి? - అనుకున్నాను. నాకున్నదల్లా నత్తి; అంతేగాని తెలివి తక్కువవాడిని కాదు. నాది వంకర టింకర నడకకాదు, చూడ టానికి వెర్రి బాగులవాడిలావుండను. నాకు నేను వెన్ను చరుచుకు

ధైర్యంతో ముందు తలుపు తెరుచుకు లోన ప్రవేశించాను. నేను హాలులోకి వెళ్ళీ వెళ్ళగానే ఒకయువతి నన్ను వుద్దేశించి చూపిస్తూ "ఇదుగో మరో కొత్తబ్బాయి వచ్చాడు" అంది. నా దగ్గిరకువచ్చి "ఆ పక్కరూములోకి వెళ్ళు. అక్కడ మిసెస్ హర్షు వుంటుంది. కొత్తగా వచ్చిన పిల్లల సంగతి అవిడే చూస్తుంది."

మిసెస్ హర్షు చాలా మంచి మనిషిలా కనిపించింది. ఆమె మెడలో వేలాడుతూ ఒక బంగారపు గడియారం ఉంది. మెళ్లో అంటే సరిగ్గా మెళ్ళో అని కాదు. గౌనుకి పిన్నుబెట్టి గుచ్చుకుంది. మిస్టర్ క్వాఫ్ చెప్పిన ధనికస్త్రీలలో యీమె ఒకతైవుంటుందని అనుకున్నాను. మేము చాలాసేపు మాట్లాడుకున్నాము. ఆమె నా గురించిన యావద్విషయాలూ పాకబు చేసింది. నా గురించీ మా కుటుంబం గురించీ, చాలా ప్రశ్నలు వేసింది. మా తాతయ్యా చుట్టల షాపు పట్లా, మా ప్రకటన ఏజెన్సీల పట్లా ఎంతో ఆసక్తి కనబరిచింది. ప్రతిసాయంత్రం 'పాయ్కరో'లాని వార్తాపత్రికాఫీసు లకి నేను వెళ్ళడం గురించి ఆమెకి చెప్పాను. "థియేటరులో నువ్వు ఏమి చెయ్యాదలచుకున్నావ్?" అని అడిగింది ఆమె. ఇంత సేపు మాట్లాడిన పిమ్మట కూడా నా మనోభిప్రాయమేమిటో ఆమెకి తెలియకపోవడం, ఆశ్చర్యం కలిగించింది. "యాక్టరు నవాలని నా కోరిక" అని చెప్పేశాను. ఆమె కొంచెంగా యోచనాముద్రధరించి అన్నది: "మాకు చాలామంది యాక్టర్లున్నారు. ప్రతివాడికి యాక్టరు నవాలనే కదా కోరిక. థియేటరు అంటే ఒక్క యాక్టర్లే కాదు - యింకా చాలామంది కావాలి. కార్పెంటర్లు, పెయింటర్లు, డిజైనర్లు, రంగస్థల అలంకారం సమకూర్చేవారు, కళాకోవిదులు,

ఎలక్ట్రీషియన్సు - యిలా చాలామంది కావాలి. ఇందులో ప్రతి ఒక్కరిదీకూడా ముఖ్యమైన వుద్యోగమే."

ఆమె నా ముఖం వంక చూసి నా సమాధానంకోసం ఎదురు చూసింది. అనంగీకారసూచకంగా తల తిప్పాను. యాక్టర్ని అవాలని కదా యిక్కడికొచ్చాను. యాక్టర్ అవడమే నా అభిమతం.

ఆమె తనలో తను నవ్వుకుని అంది: "మిస్ షెరిడాన్ యిటు వైపుగా వచ్చినపుడు నీతో మాట్లాడుతుంది."

ఆ మిస్ షెరిడాన్ వేంచేసింది. పొట్టిగా చిన్నగా వుంది. వయసు నలభై, నలభై అయిదూ మధ్యనట. చాలా అందంగా ఆకర్షణీయంగా అలంకరించుకుంది. ఆమె కంఠధ్వనిలో భావ సౌందర్యం వుట్టిపడుతోంది.

మిసెస్ హర్షు, "ఒక కొత్త కుర్రవాడు యిప్పుడే వచ్చాడు" అని ఆమెతో అనడం చాటునవున్న నాకు వినిపించింది.

"మంచిది. మనకి చాలామంది కుర్రవాళ్ళు కావాలి."
"మీరు మొట్టమొదట అతనితో మాట్లాడండి?"
"నేనా? నే నెందుకు మాట్లాడటం?"

"కాదు. మీరు మాట్లాడండి. అతను ఒక 'బ్రోకెన్ హోమ్' నుంచి వచ్చాడు." 'బ్రోకెన్ హోమ్' అనుమాట వినడం నాకదే

మొట్టమొదటిసారి. మాయింటిని 'విరిగిపోయిన యిల్లు' అనడంలో గల వుద్దేశం నాకు అవగతం కాలేదు. కొద్ది క్షణాలయాక మెరుపు మెరిసినట్లుగా తట్టింది, మిసెస్ హస్టతో మా అమ్మా నాన్నా విడాకులు పుచ్చుకున్నారని చెప్పిన సంగతి.

మిస్ షెరిడాన్ నాదగ్గిర కొచ్చినపుడు, ఆమెకి నేను మిస్టర్ క్వాఫ్ కార్డు యిచ్చాను. మిస్టర్ క్వాఫ్ ఆమెకి చాలా బాగా జ్ఞాపకం వున్నట్టున్నాడు. అతని యోగక్షేమాలు విచారించినమీదట నన్ను గురించి అడిగింది. ఆమె ప్రశ్నలువేసే తీరు చూస్తే నా శక్తిని పరీక్షిద్దామని ప్రశ్నలు వేస్తున్నట్టుంది.

నా శక్తి ఎటువంటిదో ఆమెకి శాంపిల్ చూపించాను.

నాకు ఎటువంటి శక్తివున్నదీ తెలుసుకున్నమీదట కూడా, ఆమె ప్రశ్నలు అడగటం మానలేదు. నాకు ఏ పాత్రలు యివ్వడమా అని, తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు ముఖంపెట్టి నన్ను అనేక విషయాలు అడిగింది. నా శక్తి అంతవని నప్పులపాలు చేయగలదని ఆమె మనసులో భావిస్తోందా అని అనుమానమేసింది.

కాని పొరబాటు నాదే. ఏదో ఒక సాకు చెప్పి నన్ను పంపివెయ్యడానికి బదులు, నాకు ఏవిధంగా పని చెప్పడమా అని ఆమె ఆలోచిస్తోంది. "శక్తి పోగొట్టుకునేందుకు ఎటువంటి ప్రయత్నం చేశావు?" అని నన్ను అడిగింది.

"పురాతనగ్రీసులో డెమోస్తనీస్ తన శక్తి పోయేందుకు గులకరాళ్ళు నోట్లోపెట్టుకు మాట్లాడేవాడుట. నేనూ ఆ ప్రకారం

చేదామనుకున్నాను. కాని మా పెరట్లో గులకరాళ్ళు దొరకని కారణాన, చలపరాతిముక్కలు (Marbles) పెట్టుకు కొన్నాళ్ళు ప్రయత్నించాను. ప్రయోజనం కనబడలేదు'' అన్నాను.

ఆమె నా నోటనుంచి వెలువడ్డ ప్రతిమాటా ఎంతో శ్రద్ధగా విన్నది. ఎంతో ఓపికమంతురాలులావుంది. ''అల్లాగే చూదాం. నీకు ఏదో ముఖ్యమైన 'పోర్షన్' యిస్తాను. నీకు సరిపడే 'పోర్షన్' వెతికి యిస్తాను. మా గ్రూప్‌లో జాయిన్ అవు'' అంది.

ముఖ్యమైన పోర్షను అనేసరికి నా కెంతో సంతోషం కలిగింది. నాకు నత్తివుంటేనేంగాక ముఖ్యమైన పాత్ర ఒకటి లభిస్తోంది.

ఆ ప్రకారం నేను నాటకకంపెనీలో చేరాను. ఎమ్మా షెరిడాన్ నాకు చదివేందుకు రకరకాల పోర్షన్లు యిస్తూండేది. ఒక్కొక్కరోజున బాగా చదివేవాడిని; ఒక్కొక్కరోజున నత్తితో తడుముకొనేవాడిని. నా నత్తికికూడా వసంతకాలం, వర్షాకాలం అంటూ వుండేవి. ముఖ్యంగా చలిగావున్న రోజుల్లో నత్తి అనుకోకుండా ప్రబలమైపోయేది. ఏమైతేనేం, మొత్తంమీద నాటకాలు నాలో నూతన ఆసక్తిని రేకెత్తించాయి. వారానికి రెండుసార్లు అక్కడ హాజరయేవాడిని. శనివారాలప్పుడు మధ్యాహ్నంనుంచీ అక్కడే వుండిపోయేవాడిని.

ఈ రిహార్సలూ శిక్షణాకాక మూడంకాలనాటకం - నిజంగా స్టేజిమీద ప్రేక్షకులు అందరి ముందూ వేయనున్నామని

మిస్ షెరిడాన్ అనగా మా సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయింది. టికట్టు ఒక్కొంటికీ పదేసి సెంట్లచొప్పున అమ్ముతారుట. ప్రజలందరూ చూడటానికి వస్తారుట. మార్క్ ట్వైన్ రాసిన 'ది ప్రిన్స్ అండ్ ది పాపర్' (రాజూ - పేదా) కథని నాటకంగాచేసి మాచేత ఆడిస్తానని మిస్ షెరిడాన్ అంది. ఎవరి పోర్షన్లు వారి కిచ్చింది. హాలులో మధ్యగా పోర్షన్ల కట్టచేత పుచ్చుకునుంచున్న మిస్ షెరిడాన్ అమృతం పంచనున్న దేవతలా కనపడింది మాకు.

'ఇది నీకు' అని ఒక చిన్నమ్మాయికిచ్చింది. 'ఈ పాత్రనీది' అంటూ మరో అమ్మాయికి, యింకాసినికాయితాలిచ్చింది. 'జాన్, నువ్వు రాజువేషం వేస్తున్నావ్' అంటూ జాన్‌కి కాయితాలిచ్చింది. 'పేదవానివేషం ఎవరువేస్తే బాగుంటుంది' అని పైకి ఆలోచిస్తున్నట్లుగా అని, మాలోని ఒక కుర్రవానిని ఆ పాత్రకని వుద్దేశించింది. నేను నిలబడిచూస్తున్నాను. ఒకరి తరవాత ఒకరు కాయితాలు పుచ్చుకోడం చూస్తున్నాను. నా వంతు ఎప్పుడొస్తుందా అని, ఎదురు చూస్తున్నాను. మిస్ షెరిడాన్ చేతిలోని కాయితం బొత్తి అందరికీ పంచడం అయిపోయింది. నేను భయపడుతున్నట్లే అందరికీ అన్ని పాత్రలూ పంచారు - నాకు తప్ప.

దూరంగా దిగులుతో నిలబడ్డ నా వంకచూసి మిస్ షెరిడాన్, కొంచెం ఖంగారుపడుతూ అంది : "ఓ, నువ్విక్కడున్నావా? నువ్వు ఏమైపోయావోనని నీ కోసం ఎదురుచూస్తున్నాను. నీకని ఒకపోర్షను అట్టేపెట్టాను. అన్నిటికంటే అది చాలా ముఖ్యమైనదని మర్చిపోకుసుమా. దుర్మార్గులచేత బంధింపబడ్డ రాజుని రక్షించవలసిన

మూకకి నువ్వు నాయకుడివి. నీ చేతిలో ఓ అయుధంకూడా వుంటుంది."

నా విచారం పటాపంచలైపోయింది. తెలియకుండానే నా ముఖంమీదకి చిరుహాసచంద్రికవచ్చింది. నాకు యీ నాటకంలో ఒకపాత్ర వుండటమేకాకుండా, నేను ఒక అయుధాన్నికూడా ధరిస్తున్నాను. ఆయుధం వెండిదికావచ్చు, బంగారందికావచ్చు, నవరత్నఖచితమైనదికావచ్చు; ఆ ఆయుధం ఒక దుడ్డుకర్ర అని చివరిదాకా నాకు తెలియదు.

ఏమైనా అందరితోపాటు నాకూ ఒకపాత్ర లభించినందుకు సంతోషపడ్డాను. నా పోర్షన్ కాగితాలు యింకా యివ్వరేం అన్నట్లు మొహం పెట్టడంచూసి, మిస్ షెరిడాన్ అంది: "నీకు ప్రత్యేకంగా పోర్షనంటూ ఏమీలేదు. నీ పోర్షన్ నువ్వు సృష్టించుకోవచ్చు. అంగవిన్యాసమూ భావప్రదర్శనా ముఖ్యంగాని, నీ పాత్రలో మాటలకి అంతగా అస్కారంలేదు. హృదయవేదన నీ పాత్రపోషణలో కనపడాలి. గుర్రుపెట్టడం నీకు తెలుసా ?"

తడుముకోకుండా - "ఓ తెలుసు" అన్నాను.

"గుర్రు ప్రదర్శించడంలో ఎన్నిరకాల చూపవచ్చో నీకు తెలుసా ?"

"రెండు మూడు రకాలు" అన్నాను.

"రెండు మూడేమిటి - ఎవరుచెప్పారు? అనేకవిధాలుగా గుర్రు పెట్టవచ్చు. ఆ గుర్రు చూపడంలోనేవుంది నీ సమర్థత! రాజుని దొంగలు హింసింపబూనినప్పుడు క్రోధంతోనూ, అయిష్టత తోనూ అరుస్తావు; నువ్వు మూకకి అధిపతివై ప్రజలు నీ వెంటవస్తు న్నపుడు మరొకవిధంగా అరుస్తావు; దౌర్జన్యాన్ని ఎదుర్కొన్నప్పుడు అరుపు మరొకవిధంగా వుంటుంది. రాజు రక్షింపబడ్డాడనే సంతోషం వెలిబుచ్చేటప్పుడు యింకో విధంగావుంటుంది. మొత్తం మీద యీ నాటకంలో నువ్వు సుమారు సలభైవిధాలయిన గుర్రుని ప్రదర్శించాల్సివుంటుంది. అందుకనే యిది చాలా ప్రధానమైన పాత్ర అన్నాను."

ఆ తరువాత నాలుగు వారాలపాటు నేను రకరకాలగుర్రులు ప్రాక్టీసుచేశాను. కొన్నిటిని విశిష్టంగాచెయ్యడం, ప్రదర్శించడం అలవరచుకున్నాను. అంతకిపూర్వం విననివీ, యికముందు విన బోనివీకూడా, ఏ క్షణాన ఏమి అవసరంవస్తుందోనని, ప్రాక్టీసుచేసు కుని సిద్ధంగా కూచున్నాను.

నేను నాయకత్వం వహింపవలసిన ప్రజలమూక మొత్తం మీద వీధిబారుమనుషులు. శిక్షణగరిపేందుకు మాకు యిద్దరు ముగ్గురువారులు మాత్రమే లభించారు. రిహార్సల్సు గడుస్తున్న కొద్దీ మేము యీ వారులకోసం బాలకులతో వారివారి సోదరులనీ బంధుమిత్రాదులనీ, తోడ్కొనిరావలసిందిగా చెప్పాము. చివరికి ఎలాగైతేనేం పాతికమంది పోగయ్యారు. నేను వారందరికి నాయ కుడిని. వారికి యీ గుర్రుచూపడంలో తగు శిక్షణయిచ్చి, నేను

గుర్రు అందుకోగానే వారుకూడా, నేను ఏ స్థాయిలో ప్రదర్శిం చానో, అవేస్థాయిలో ప్రదర్శించేటట్లు ట్రయినింగ్ యిచ్చాను. నా కొక అయుధం అంటూ యివ్వబడటం (దుద్దుకర్ర)చేత, ట్రయి నింగ్ సమయంలో యీ పాతికమంది పౌరులనీ ఒకే తాటిమీద నడి పించడానికి, అది ఎంతగానో పనికివచ్చింది. నా పౌరులని చూసు కుని నేను గర్వపడ్డాను. వారి ప్రదర్శనలో సాటిలేని క్రమతవుంది. కొమ్ములు తిరిగిన యాక్టర్లు, తమ పోర్షనులో ఒకటి రెండుపంక్తులు అమాంత్రం మర్చిపోవచ్చు. కానీ నా పాతికమంది బలగం విష యంలో అటువంటి పొరబాటు జరిగేందుకు వీలులేదు. నా పాతిక మందీ చాలా మంచివాళ్ళు. అందరిముందూ మిస్ షెరిడాన్ నేను నిర్వహించాల్సిన కార్యభారాన్ని ప్రశంసించింది.

ఎట్టకేలకు డ్రస్ రిహార్సల్సు ప్రారంభమయాయి. స్టేజిమీద మేము ఖాళీహాలులో ప్రదర్శనయిస్తున్నాము. అందరికీ రంగు రంగుల బట్టలు తొడిగారు. మీసాలూ గడ్డాలూ పెట్టారు. అందరమూ విగ్గులు ధరించాము. పూంఛి ఎర్రగావున్న విగ్గు నా కిచ్చారు. ఆ విగ్గు ధరించి అద్దంలోకి చూసుకునేసరికి నే నంటే నాకే భయ మేసింది. నా రూపం నా కంతభయం కలిగించడం, ఒకమాదిరి ధైర్యాన్నిచ్చింది. వికృతంగానూ క్రోధంగానూ మొహంపెడుతూ, అరుపులూ పిచ్చికేకల్తో అందరిని హడలకొట్టేశా నా వేళ. డ్రస్ రిహార్సల్సులో కొందరు కుర్రవాళ్లు తమపంక్తులు మర్చిపోయారు. అందువల్ల వారి పంక్తులు పదేపదే చెప్పించాల్సివచ్చేది. కాని పూ మూకవుంది చూశారూ, ఒక్క అడుగుకూడా తప్పువెయ్య కుండా తమ కార్యభారం నిర్వహించింది.

మిస్ షెరిడాన్ మా అందరికీ సలహాలుయిచ్చింది. కొన్ని కొన్ని దృశ్యాలు తిరిగి ప్రదర్శింపచేసింది. అలా ఒకటికి రెండు సార్లు చెయ్యడంవల్ల, ప్రదర్శనకి విశిష్టత ఏర్పడుతుందని ఆమె అన్నది. ఒక మధ్యాహ్నమంతా డ్రస్ రిహార్సల్సుతో గడిపేశాం. శనివారం సాయంత్రం ప్రేక్షకుల ముందు ప్రదర్శన యిచ్చేందుకు అందరం సిద్ధంగావున్నాము.

శనివారంనాడు మే మందరం డ్రస్సులు వేసుకున్నాము. ప్రజల మూకలోని అందరికీ ముఖానికి బూడిదవర్ణంపూశారు. మే మందరం చాలా మొరటుమనుషులమని సూచన కారంగు. ఇంకో అరగంటలో తెర ఎత్తుతారనగా, మిసెస్‌హర్ష్ మాదగ్గిరకొచ్చి, "ఇవ్వాళ కొందరు ప్రఖ్యాత పురుషులువస్తున్నారు. ఈ ప్రదర్శన చాలా చక్కగావుండాలి. మీకు చేతనైనంత బాగాచెయ్యాలి" అంది. ఏదో సందేశ మివ్వడానికొచ్చిన మనిషిలా, ఆ రెండు ముక్కలూమాతోఅనేసి, తనదారిన తను వెళ్ళిపోయింది. తెరల మధ్యనున్న కన్నంలోంచి మాలో వొకరు ప్రేక్షకలోకం వేపు చూశారు. "అదుగో ఆయనే" అంది ఒక చిన్నమ్మాయి.

"ఎవరు? ఎవరేమిటి?" అని అడిగాను.

"మిస్టర్ మార్కుట్వేను. యీ నాటక రచయిత."

"మార్కుట్వేనా? ఏదీ నన్నొకసారి చూడనీ."

"అయిదో వరసలోవున్నాడు. తెల్లటిజుట్టూ, తెల్లటి సూటూ ఆయనే." అంది ఆ అమ్మాయి.

"చలికాలంలో తెల్లబట్ట లెపరూ వేసుకోరే - "అన్నాను.

"కాని మార్కు ట్వైన్ వేసుకుంటాడు" అంది ఆ అమ్మాయి. తెరలోని కన్నంలోనుంచి ఆ మూర్తి పంక చూశాను. తెల్లటిజుట్టూ తెల్లటి సూటుతో ఆ మనిషిని యిట్టే గుర్తు పట్టెయ్యవచ్చు. ది ప్రిన్స్ అండ్ ది పాపర్, టామ్‌సాయిర్, హక్‌ఫిన్ మొదలైన గ్రంథాల రచయిత యీ ప్రదర్శన వీక్షించడానికి వచ్చాడన్న వార్త మా నట నటీవర్గమంతటిలోనూ నిముషాలమీద పాకిపోయింది. మిసెస్ హర్టు ఆయనని ఆహ్వానించిందిట. ఆయన చాలా ప్రఖ్యాత పురుషుడు కాబట్టి టికట్టుకూడా కొనక్కర్లేదుట.

నేనంతకి పూర్వమే టామ్‌సాయిర్, హక్‌ఫిన్, లైఫ్ ఆన్ ది మిసిసిపీ గ్రంథాలు చదివివున్నాను. ఆ గ్రంథకర్త ఈ మనుషు లందరిలోనూ, ఒకనిగా కూచున్నాడనే విషయం నా బుద్ధికి నమ్మ శక్యంగాలేదు. నేను చాలా పుస్తకాలు చూశాను, చాలా పుస్తకాలు చదివాను. కాని రచయితలనే వారు మన అందరికి మల్లే వుండరని నా భావన. వారెక్కడో దూరంగా యీ లోకపు వాతావరణానికి అతీతంగా ఎక్కడో ఎక్కడెక్కడో వుంటారని అనుకునేవాణ్ణి.

మళ్ళీ మరొకసారి చూశాను, ఆ కన్నంలోనించి మార్కు ట్వైన్ వేపు. ఆయనే అందుకు సంశయం లేదు.

నేను నా పోరులవద్దకి వెళ్ళాను. "అబ్బాయిలూ, యీనాడు మీరు చాలా జాగ్రత్తగావుండాలి. నా చేతులోవున్న ఆయుధం

చూస్తున్నారు కదూ!" వాళ్ళని భయపెడుతున్నట్లుగా, నా దుష్టు కర్ర ఒక్కసారి ఝుళిపించాను. నాకు క్షణకాలం క్రితం తెలిసిన గొప్ప సంగతి మటుకు వాళ్లకి చెప్పలేదు.

నాటకశాలలోని దీపాలవెలుతురు తగ్గించబడింది. రంగస్థలం కాంతులతో జిగేలుమంటోంది. ప్రదర్శన ప్రారంభమయింది. తెర ఎత్తేటైముకి మిస్ షెరిడాన్, స్టేజి కర్టెనులలో కుర్చీలమీద, నాటకప్రతి ఒకటి చేతపుచ్చుకు కూచుంది. ఏ ఒక్కరూ పంక్తులు మర్చిపోలేదు. అందరూ చకచక తమ పోర్షన్లు చెప్తున్నారు. మిస్ షెరిడాన్ చిరునవ్వునిబట్టి అంతా సవ్యంగా సాగిపోతున్నదని గ్రహించవచ్చు. అంతా సవ్యంగా సాగిపోయినట్టే. మా మూకకూడా తమ విధ్యుక్తాన్ని, యథావిధిగా నెరవేర్చారు. భయపెట్టే అరుపులతో, రంగస్థలంమీద ప్రవేశించాము. మేము చూపే క్రోధావేశాన్ని చూసి, ప్రేక్షకులు హడలిపోయారు. ముందు వరుసలో కూచున్న పిల్లల మొహాల్లోని భయోత్పాతం చెప్పనలవికాదు. వాళ్ల మొహాల్లోని భయంచూస్తున్న కొద్దీ మాకు ఉత్తేజం ఎక్కువయిపోయింది. అందరూ హడలిపోయే అద్భుతమైన అరుపులతో గురకలతో, మా పని మేము సక్రమంగా నిర్వహించాము.

నాటకం విజయవంతంగా పూర్తి అయింది. ప్రదర్శనానంతరం, ఒక్కరొక్కరే స్టేజిమీదకువచ్చి, ప్రేక్షకులకి కనపడేవారు. అనగా నాటకం కంపెనీ, యీ బాల నటీనటులని, ప్రేక్షకులకి పరిచయం చేయడమన్నమాట. మూగదెయ్యాలలో నేనూ నా వారులూ, రంగస్థలంమీదకి అతి వినయంగా ప్రవేశించాము. మా

మొహాలన్నీ నల్లగావున్నప్పటికీ, పెదవులమీదమాత్రం చిరునవ్వులు వికసిస్తున్నాయి. మమ్మల్ని చూడగానే ప్రేక్షకులు గబగబ చప్పట్లు కొట్టారు.

పరిచయానంతరం మేము రంగుల గదిలోకి వెళ్ళాము. విగ్గులు తీసేసి రంగులు తుడుచుకునే ప్రయత్నంలో వుండగా, మిసెస్ హర్ష్ వచ్చి, "రండి రండి తొందరగా రండి; మీ విగ్గులు పెట్టుకొని, మీ పోర్షన్ కాయితాలు పుచ్చుకురండి. మిస్టర్ మార్క్ ట్వైన్, మీ పోర్షన్ కాగితంమీద ఆటోగ్రాఫ్ (చేవ్రాలు) చేస్తారు," అంది.

నేను నా ఎర్ర విగ్గు పెట్టుకుని నా ప్రోగ్రామ్ కాయితం చేతబుచ్చుకు, తలుపు వైపుగా పరుగెత్తాను. ఆయుధం మర్చి పోయిన సంగతి చటుక్కున జ్ఞాపకం వచ్చి, ఎందుకైనా మంచి దని ఆయుధంకూడా పుచ్చుకు వెళ్ళాను. అప్పటికప్పుడే కొందరు బాలురూ, బాలికలూ ఒకలైనులో నుంచునివున్నారు. మార్క్ ట్వైన్ వారి ప్రోగ్రామ్ కాయితాలమీద ఆటోగ్రాఫ్ పెడ్తున్నాడు. నేను ఆయనని రెప్పవాల్చకుండా పరిశీలిస్తున్నాను. ఆయన కళ్లలో ఎంతో కరుణ కనిపించింది. ఆ తెల్లటి జుట్టు ఆయన ముఖానికి అపురూపమైన అందాన్ని యిచ్చింది. ఎటొచ్చీ, ఆయన మీసాలు నాకు నచ్చలేదు. పంక్తిలో నిలబడ్డ నా వంతువచ్చింది. ఆయన నా ప్రోగ్రామ్ కాయితం పుచ్చుకున్నారు. జడుసుకున్నట్లు ఒక అడుగు వెనక్కి వేసి, కళ్లలో హాస్యం కనబరుస్తూ, "నన్ను హడల కొట్టేశావ్! నిన్ను చూస్తే భయంవేస్తోంది" అన్నాడాయన.

అని నవ్వుతూ, నా ప్రోగ్రామ్ కాయితం మార్జిన్‌లో చేవ్రాలు పెట్టాడు. వెంటనే ఆ కాయితం నా కిచ్చెయ్యలేదు - తన కాంప్లిమెంటుకు - నేను ఏమి సమాధానంచెబుతానా అని ఎదురు చూస్తున్నట్లు. కాని నా పెదవులు వెంటకే తాళంబడింది. నాకు నత్తి వున్నట్లు మార్క్ట్వైన్‌కి తెలియనివ్వడం నా కిష్టంలేదు. అది చాలా యిబ్బందికరమైన క్షణం. నేను నా చేతివేళ్లను విగ్గులోకి పోనిచ్చి జుట్టు తడుముకున్నాను. "నువ్వు చాలా బాగాచేశావ్" అన్నాడు మార్క్ట్వైన్. అని మరొకసారి నవ్వి నాకు షేక్‌హాండ్ యిచ్చాడు.

అయనా నవ్వాడు, నేనూ నవ్వాను. ఇద్దరమూ నవ్వాము. ధరసలోంచి బయటకొచ్చేశాక, ప్రపంచంలోవున్న మనుషులందరిలోకీ మార్క్ట్వైన్ అంత మంచివాడు మరొకడులేడనిపించింది. చలికాలం అయినప్పటికీ ఆయన తెల్లబట్టలు వేసుకోడం, సబబే అనిపించింది. ఎందుచేతననగా ఆయన అందరిలాటివాడు కాదు. ప్రత్యేకమయిన వ్యక్తి. చాలా చాలా ప్రత్యేకమైన వ్యక్తి.

థియేటరూ, రన్నింగ్‌రేసులో ప్రావీణ్యత, వీటితోపాటు సంగీతం మీదకూడా దృష్టిపోయింది. చిన్నపుడు నాకు బాండ్ మ్యూజిక్ అంటే యిష్టం అనిచెప్పానా; ఆ తరువాత కొన్నాళ్ళపాటు, ఆర్గన్ మ్యూజిక్ (వాద్యసంగీతం) అంటే యిష్టపడ్డాను. పెద్దయిన పిమ్మట పియానోమీద గౌరవం ఏర్పడింది. నా వయసు కుర్రవాళ్ళతోపాటు, పియానోపాఠాలు చాలాకాలంబట్టీ ఒక లేడీటీచరుదగ్గిర నేర్చుకుం

టున్నాను. మా టీచరు పియానో వాయించడం, నా నత్తి రెండూ ఒకే విధంగావుండేవి. అప్పుడప్పుడు అమ్మ నన్ను గానకచేరీలకి (Concerts) తీసుకెళ్తూండేది. వీటి టికట్లు చాలాప్రియం. ఒకసారి నేను పేడరెవిస్కీ (Pederewski) పాట విన్నాను. చోపిన్ (Chopin) వాయించగాకూడా విన్నాను. ఒకరోజు సాయంత్రం పధ్నాలుగో వీధమ్మట వస్తూండగా, దూరంనుంచి అద్భుతమైన పియానో సంగీతం వినపడింది. ఆ సంగీతం వింటూ నే నక్కడివాడి నక్కడ నిలబడిపోయాను. ఆ గానమాధురి నా కాళ్లనికట్టేసింది. రోడ్డుమీది రణగొణధ్వనులని చీల్చుకుంటూవచ్చి ఆ సంగీతం నా చెవిలో పడింది.

'స్టీన్‌వే భవంతి'పై నుంచి ఆగానం వస్తోందని నాకుతెలుసు. మెట్లెక్కి, అక్కడికెళ్ళి తలుపు వెలపలనుల్చుని, విందామని అనుకున్నాను. ఇంకోరి యింటిమెట్లు అలా ఎక్కడం తప్పే. ఆ సంగతి నాకుతెలుసు. కాని ఆ పాట వినాలని ఎంతో కోరికగా వుంది. నా మనసుని కట్టేసుకోలేక, క్రమెట్లన్నీ ఎక్కి ఏ హాలు నుంచయితే పియానో సంగీతం వెలువడుతోందో, ఆ హాలువద్దకి వెళ్ళి గుమ్మంబయట నిలబడ్డాను. నేనలా నిలబడి వినడం నాకే ఏదో దొంగతనం చేస్తున్నట్లుగాతోచింది. పెద్ద వాళ్ళెవరేనా నన్ను పొమ్మంటారనే భయం ఒకపక్క; అంతకీ మొండికెత్తి, తలుపు పక్కగావొదిగి, నిలబడివిన్నాను. మధ్యమధ్య సంగీతం కాసేపు ఆగుతూండేది. సంగీతం ఆగేసరికి, మళ్లీ యింకా ఎంతసేపటికి ప్రారంభంఅవుతుందా అని, ఎదురుచూసేవాడిని. మళ్ళీ దానంతట అదే ప్రారంభమయేది. యిలా నాలుగైదుసార్లు అయినమీదట,

చటుక్కున ఎవరో తలుపుతెరిచారు. నేను ఖంగారుపడిపోయాను. ఆయన గుమ్మంవద్ద నిలబడి, "ఏమదుకావాలి" అని అడిగాడు. నోట మాటరాలేదు. పారిపోదామనుకున్నాను. కాని పారిపోయేందుకు కాళ్ళురాలేదు. నేనక్కడ ఎందుకున్నదీ చెప్పవలసిన భారం నాది. కాని ఆయనే ఎంతో మృదువుగా "నువ్వు నాకోసమొచ్చావా? నా పేరు రాఫెల్ జోసఫ్" అన్నాడు హంగేరియన్ ఉచ్చారణతో.

"నేను మీ కోసం రాలేదు" - అని తలతిప్పాను.

"మరి నీకేం కావాలి?"

"ఏమీ అక్కర్లేదు. పాట వింటున్నాను. మీకుకష్టం కలిగించివుంటే క్షమించండి" అన్నాను భయపడిపోతూ.

"వింటున్నావా!" అన్నాడతను. అతని కెంతమాత్రం కోపం రాలేదు. నేను యిలా పొంచి నిలబడివినడం, అతనికి తప్పుగా తోచలేదు. "నేను వాయించడం వింటున్నావా? నాకంత బాగా వాయించడం చేతకాదే!"

అతను గుమ్మంలోనూ, నేను గుమ్మం బయట నిలబడ్డాం.

"నీకు పియానో అంటే యిష్టమా?" అని అడిగాడు.

"అవును, సార్. చాలా చాలా యిష్టం!" అతను నన్నప్పుడు తన స్టుడియోలోకి తీసుకెళ్ళాడు.

"ప్రేక్షకులెవరూ లేనప్పుడు నేను పిచ్చి పిచ్చిగా వాయిస్తాను. నాకు తెలియని నిర్లక్ష్యం నాలో ప్రవేశిస్తుంది. వెనక వాయించింది

మళ్ళీ వాయించనా? వినువుగాని!" అని నన్ను ఒక కుర్చీలో కూచోపెట్టాడు.

అది చాలా పెద్ద స్టుడియో. అక్కడ రెండు పెద్ద పెద్ద పియానోలున్నాయి. అన్ని సంగీతగ్రంథాలని చూడటం నాకదే మొదటిసారి. ఎన్నిగ్రంథాలో చెప్పలేను. ఎన్ని అపురూపమైన వస్తువులున్నాయో చెప్పలేను. "తలుపుల వెనకనుంచి వింటున్నపుడు 'నాదం' నీకు సరిగా వినిపించివుండదు. ఇప్పుడు విను," అంటూ అతను కళ్ళు మూసుకుని వాయించడం ప్రారంభించాడు. కీబోర్డుమీద అతని వేళ్ళు గబగబా పరువులెడుతున్నాయి. తల యిటూ అటూ అప్పుడప్పుడు వూగుతోంది. అతను మనలోకాన్ని పూర్తిగా మర్చిపోయాడు. మరొక లోకపు మనిషిలా కనిపించాడు. ఆశ్చర్యంతో ఆనందంతో ఆ కమనీయగానం వింటున్నాను. అతని ముఖంలో విషాదచ్ఛాయలతోపాటు ఆనందపు కిరణాలు కూడా వున్నాయి. నేనటువంటి సంగీతం అంత దాకా ఎప్పుడూ వినలేదు. ఆ రోజున జోసఫ్ నాకోసం ఎన్నో పాటలు వాయించాడు. ఇంతలో అతని దగ్గిర పాఠాలు నేర్చుకునేందుకుగాను ఒక అమ్మాయి వచ్చింది. ఆమె వచ్చిన తరువాత నేను నా సీట్లోంచి లేచాను. "అప్పుడే వెళ్లిపోతున్నావా? రేపు మళ్లీ రా" అన్నాడు జోసఫ్.

"నేను రేపు రావడానికి వీలువుండదు, సార్. రన్నింగ్ వుంది" అన్నాను.

అతను ఆశ్చర్యపోతూ "రన్నింగా? అదేమిటి?" అని అడిగాడు.

"నేను మా స్కూల్ టీమ్‌లోని రన్నింగ్‌రేసులోవున్నాను."

"ఓ - ఆ మాదిరి రన్నింగా. అయితే ఎల్లుండిరా?"

"ఇదే టైముకా, సార్?"

"అవును.

నేను గబగబ గుమ్మందగ్గిర కొచ్చాను. అతను ఆ యువతితో యీ మాటలు అనటం వినపడింది. "పరుగెట్టడంవల్ల ప్రయోజనమేమిటి, పియానో వినడం మంచిదిగాని!"

ఆ తరువాత నేను అనేకసార్లు జోసఫీ స్టుడియోకి వెళ్లాను. అంత గొప్పగా పియానో సంగీతం వినడం నాకు సంతోషంగా వుండేది. అతని స్టుడియోలో కూచుని, సంగీతం వింటున్న కొద్దీ ఒక నూతనప్రపంచం కళ్ల ముందు ఉదయించేది. అంతవరకూ సంగీతమనగా రాగయుక్తమైన కమ్మనిపాటఅనుకునేవాణ్ణి. కాని జోషఫీ నాకు పరిచయంచేసిన నాదప్రపంచంలో మాటలకి అందని మధురానుభూతులు ఎన్నోవున్నాయి. మొదటిరోజున అతనెవరో నాకు తెలియలేదు. కాని లోకపూజ్యుడైన ఆ సంగీతవిద్వాంసుడు యీ చిన్నబాలునిపట్ల చూపిన ఆదరాభిమానాలు, ఎన్నటికీ మరపురానివి. అతను నాకు శబ్దప్రపంచంలోని సౌందర్యాలూ, అందలి వింతకాంతులూ, నా చిన్నమనసుకి తెలిసే విధంగా ధ్వనిరూపాన పరిచయం చేశాడు.

అతను పియానో వాయిస్తున్నపుడు శబ్దాలతో ఒక కట్టడం కడుతున్నాడా అనిపించేది. అది శబ్దశిల్పమే అనాలి. పర్వతశిఖరాలూ, జలజలపారే కొండవాగులూ, చీమలు దూరని కారడవులూ, రాజాంతఃపురాలూ, విజయచిహ్నంగా కట్టబడిన కోటలూ ఎన్నో ఎన్నెన్నో మానవుని ఆశలూ, కోర్కెలూ, సమస్తమూ ఏదో దీనాలాపంతో, ఆ పియానోనించి వెలువడేవి. ఆ శబ్దప్రపంచం మన చుట్టూ కొన్ని నీడలూ, కొన్ని దృశ్యాలూ సృష్టించేది.

ఒక్కొక్కసారి జోసఫ్, పియానో వాయించడానికి బదులు నాతో మాటలు పెట్టుకునేవాడు. ఆ మాటలు ఎంతకీ మ్యూజిక్ గురించే. అతను మాట్లాడుతున్నపుడు నాకు తోచింది నేనూ చెబుదామనుకునేవాడినిగాని, ఆ మహనీయుని పలుకుల ముందు, నా మాటలు వొట్టి పేలవంగా అవుపడతాయని, నోరు కట్టేసుకుని అతను చెప్పింది శ్రద్ధగా వినేవాడిని.

చిన్నప్పుడు పార్కులలో బాండ్ మ్యూజిక్ వినేవాడిని. ఆ తరువాత ఒకనాడు చర్చి పక్కగా వెళ్తున్నపుడు వినపడ్డ సంగీతం బాండ్ మ్యూజిక్ ఎంత చవుకబారుదో తెలియజెప్పింది. అప్పటినుంచీ బాండ్ మ్యూజిక్ వినడం మానేసి, చర్చి సంగీతమే వినడం ఆరంభించాను. ఆ తరువాత ఒకసారి వాద్యసంగీతం వినడం తటస్థించింది. ఆర్గన్ మ్యూజిక్ ముందు చర్చి సంగీతం కూడా పేలవంగా తోచింది. ఆర్గన్ మ్యూజిక్ తరువాత పియానో పాఠాలు. పియానో ఒక రకంగా శబ్దప్రపంచపు సింహద్వారాన్ని తెరువగలదు.

కుర్రవాడినయిన నేను స్టుడియోలో కూచునివుండగా, ఎంత రెందరో ప్రఖ్యాతపురుషులు అతనితో మాట్లాడేందుకు వస్తూండే వారు. నాకు ఆఖరికి వాళ్ల పేర్లు కూడా తెలియవు. ఆనాటి పియానిస్టులలో జోసెఫ పరిచయం చేసుకోనివారు ఒక్కరు కూడా లేరేమో!

నాకు అప్పుడప్పుడు ఆశ్చర్యకరంగా వుండేది - యింత గొప్పవాడైన జోసెఫ నన్ను స్టుడియోలోకి ఎందుకు రానిస్తున్నాడా అని. గంటల తరబడి నాతో ఎందుకు మాట్లాడుతాడు? అతని స్నేహితులందరూ విఖ్యాతపురుషులైతే, నేను ఏమీ తెలియని సర్వసామాన్య బాలుణ్ణి.

ఈ రహస్యం నాలో దాచుకోలేక జోసెఫ విద్యార్థులలో ఒకరిని అడిగాను. నాకంటె నాలుగు సూరేళ్లు పెద్ద అయిన ఆ యువకుడు యిల్లా చెప్పాడు :

“నీ కర్థం కాకపోవచ్చు, నా కర్థమవుతోంది. జోసెఫ మిత భాషి. అతనికి ప్రజలంటేనూ ప్రేక్షకులంటేనూ మహా సిగ్గు. నువ్వూ మితభాషివే, అతనూ మితభాషే. మీ యిద్దరికీ ప్రజాబాహుళ్యాన్ని చూస్తే సిగ్గూ మొహమాటమూను. ఒకసారి అతనే అన్నాడా విషయం నాతో. ఆ కుర్రవాడూ నేనూ యిద్దరమూ బెదురు గొట్టు మనుషులం అని. నువ్వు తలుపు వెనక నక్కి సంగీతం విన్ననాడే, అతనికి నీ మనసు తెలిసిపోయింది. తనుపడ్డ అవస్థ నువ్వు పడకూడదనుకున్నాడు. అందుకనే నిన్ను ఒకటికి రెండు సార్లు పలక్కరించి స్నేహం చేసుకున్నాడు.”

జోసఫ్‌వంటి సంగీతవిద్వాంసుడు చూపిన కరుణ, చిన్న తనంలో నాపట్ల కురిపించిన అభిమానం జీవితమంతకీ కాంతిరేఖ అయి వెన్నంటింది.

హైస్కూల్లోవున్న చివర సంవత్సరంలో అబ్రహిమ్ లింకన్‌మీద నేనొక వ్యాసం రాయడం జరిగింది. ఆ పదిపేజీల వ్యాసంతో నా భవిష్యత్ నిర్ణయమయిపోయింది. ఆ వ్యాసం రాసేందుకు నేను తీసుకున్నది కొన్ని గంటలు మాత్రమే అయినా, ఆ కొద్ది గంటలూ నా జీవనభవిష్యత్‌ని నిర్ణయించాయి.

నేను కొన్నాళ్లబట్టీ రన్నింగ్‌రేసూ, యాక్టింగ్, జోసఫ్ స్టుడియోకివెళ్లడమూ మానుకోవలసివచ్చింది. అది ఎలాగూ అంటే, యీ కుర్రవాడు ఎంతబాగా పరుగెట్టదలచుకున్నా, "యింతకంటే బాగా పరిగెత్తేవాళ్ళు చాలామందివుంటారు" అని జోసఫ్ అనడం విన్నాక, యిటువంటి పరుగులు నిరర్థకమన్న అతని అభిప్రాయ ప్రభావం నామీద కొద్దిగా పనిచేసింది. ఇక నాటకాలసంగతి అంటారూ, నేను ఎన్ని అరుపులు అరిచినా, ఎన్ని వింతధ్వనులు చెయ్యడం నేర్చుకున్నా, నాకున్న నత్తిమాత్రం తగ్గలేదు. నాటకాల లోని పోర్షన్లవల్ల, నా నత్తితగ్గదనే నిశ్చితాభిప్రాయానికివచ్చేశాను. జోసఫ్ స్టుడియోకి నేను వెళ్లలేకపోడానికి కారణం, ఆయన న్యూయార్కు వదిలి మరోచోటికి వెళ్ళడమే. లేకపోతే రోజూ వెళ్ళి వుండేవాడిని.

హైస్కూలు చదువులో అది నాలుగోసంవత్సరం. రన్నింగూ లేదు, నాటకాలూలేవు, పియానో సంగీతమూలేదు; పోలెడంత విశ్రాంతిసమయం నాకు కనిపించసాగింది. ఆ విశ్రాంతి సమయంలో నే నొక వ్యాసంరాశాను. అంత విశ్రాంతిలేకపోతే నేను రాసివుండేవాడిని కాదేమోకూడా. న్యూయార్కు హెరాల్డుపత్రిక అబ్రహిమ్ లింకన్ శతవార్షిక జన్మదినసంవత్సరంలో స్కూలువిద్యార్థులకని, వ్యాసాలపోటీ పెట్టింది. నాకు యీ పోటిలో పాల్గొనాలని అంతగా అనిపించలేదు. కాని మా యింగ్లీషు టీచరున్నారే, ఆయన యీ పోటీవార్తరాగానే, నా మీదకూడా ఒక కన్నువేసివుంచారు. ఇంత పెద్దపెద్దపోటీలలో, అందులో సాహిత్యసంబంధమైన పోటీలలో, పాల్గొనగలసమర్థత నాకు ఎంతమాత్రంలేదని, ఆయన గారితో ఎన్నోసార్లు మనవిచేశాను. కాని ఆయన వినలేదు.

మా టీచరు నాకు ఎంత ధైర్యంచెప్పినా, యిటువంటి పోటీ విషయంలో నాకు మొదటినుంచీ దడుపుకే. అబ్రహిమ్ లింకన్ అంటే నాకు చాలాయిష్టం. ఆయన గొప్పవాడని, అంతమంచివాడూ, అంత వుత్తముడూ మరెవరూలేరని నా అభిప్రాయం. నాకు తోచినది ఒక పది పేజీలురాసి, ఆ కాగితాలు మా టీచరు గారికి యిస్తే, అది ఆయన న్యూయార్కు హెరాల్డుకి పంపించేశారు.

వ్యాసం రాయడమయిపోయి, అది నా చేతుల్లోంచి వెళ్ళిపోయాక, అమ్మయ్యా, అని వూపిరిపీల్చుకున్నాను. ఆ తరువాత దానివిషయం హాయిగా మర్చిపోయి, నా వైనందిన కార్యక్రమంలో పడిపోయాను. కాని ఒక నెల్లాళ్ళు గడిచేసరికి, నా ప్రశాంతతకి

భంగంకలిగించి. న్యూయార్కుటైమ్సు నా కొక సిల్వర్ మెడల్ బహూకరించినట్లుగా ప్రచురించింది. అది అచ్చులోపడ్డప్పటికీ నమ్మలేకపోయాను. మా టీచరుగారు తన పేరవచ్చిన వుత్తరం చూపేదాకా, యీ బహుమతి విషయం నేను నమ్మలేదు. ఆ తరువాత మా స్కూల్ ప్రిన్సిపాల్, ఒక చిన్న సభ జరిపించారు. ఆ సభలో నన్ను స్టేజిమీదకి రప్పించి న్యూయార్కు టైమ్సుపత్రిక వారు రాసినవుత్తరాన్ని, సభలో చదివారు.

ఈ బహుమతి ప్రదానం, నా జీవితంలో ఒకసువర్ణ ఘడియ వంటిది. ఆ సభా, ఆ మెడలూ నా జీవితానికి కొత్త మెరుగునితీసుకొచ్చాయి. నా కిచ్చిన మెడల్‌కి ఒకవైపున అబ్రహిమ్ లింకన్ బొమ్మవుంది. బొమ్మవున్నవైపునే, **(With Malice towards none-With Charity for all)** అందరిపట్లా దయతో, ఎవరిపట్ల ద్వేషం లేకుండా! - అనివుంది. మెడల్‌కి రెండో వైపున - నా పేరూ, న్యూయార్కుటైమ్సుపత్రిక బహుమానం - అని చెక్కివుంది.

ఇంటికి వెళ్ళగానే తాతయ్య మెడల్ నా దగ్గిరనుంచి పుచ్చుకుని, చుట్టల షాపుకొచ్చే కొందరికి తన మనుమడి ప్రతిభకి తార్కాణంగా అది చూపించాలన్నాడు. ఆయన యింత ఆర్భాటం చెయ్యడం, నా కంత యిష్టం లేదు. కాని తాతయ్యతో వాదించి లాభం లేదుగా!

మా షాపులోకి కాతాదారులు రావడం తరవాయి, వారు మా తాతయ్య వుపన్యాసం వినవలసివచ్చేది. మా స్కూలు

టీచరూ, ప్రిన్సిపాలూ, న్యూయార్కు టైమ్సు పత్రికవారూ, తన మనుమని యీ ఘనబహుమానానికి ఎలా ఎన్నుకున్నది. నేను ముందు ముందు ఎంత గొప్పవాడినయేదీ, అపతలవారికి బోధించే వాడు. నాకు మెడలొచ్చిన రెండు మూడు రోజుల్లో మా చుట్టు పక్కలవారందరికీ యీవిషయం తెలిసిపోయింది. యాభైరెండో వీధి లోని ఒక సామాన్యబాలుడు యింత గొప్పవాడైన సంగతి నలుగురూ మాట్లాడుకోడం ప్రారంభించారు. మా షాపుకివచ్చే ఫైర్‌మెనూ, పోలీసుమెనూ, అభినందనసూచకంగా, నన్ను చిరునవ్వుతో పల్క రిస్తూండేవారు. మిస్టర్ ముల్జ్ నాకు షేక్‌హేండ్‌యిచ్చి "ముందు ముందు నువ్వు చాలా గొప్పవాడివవుతావు," అంటూ నన్ను దీవిం చాడు. అమెరికనులందరిలోకి అబ్రహిమ్ లింకన్ చాలా ఉత్తము డనీ, అటువంటి మహాపురుషునిపట్ల నాకు గురివుండటం మంచి విషయమనీ - అన్నాడు మిస్టర్ హాడ్లీ. మిసెస్ లియరీ అంది: "నాకు చిన్నప్పటినుంచీతెలుసు. తళతళలాడే బొత్తాముకి మల్లే వుండే యీ కుర్రవాడు, ఒకనాడు వృద్ధిలోకివస్తాడని, అందరు డిప్పకాయపిల్లలకి మల్లేకాక ప్రత్యేకంగా తయారవుతాడనీ నాకు చిన్నప్పటినుంచీ తెలుసు."

మిస్టర్ క్వాఫ్ అన్నాడు: "రచనా వ్యాసంగంకూడా చాలా మంచివృత్తే. యాక్టింగ్‌వంటిదే అది కూడాను. ఈ వృత్తికిగాను ఖరీదుగల పరికరాలు అక్కర్లేదు. ఫిడేళ్లూ, పియానోలూ, సంగీత విద్వాంసులకి మల్లే అక్కర్లేదు. మందులూ మాకులూ, ఇతర పరికరాలూ, డాక్టర్లకి మల్లే అక్కర్లేదు. రచయితను కావలసిన దల్లా, ఒక సిరాబుడ్డీ, కాసిని తెల్లకాయితాలూను. ఆ పాట మూత

ధనంతో అతను వ్యాపారం ప్రారంభించవచ్చు. యాక్టర్లూ రచయి తలూ వున్నారే వీరు విశ్వవిద్యాలయాల్లో ఏళ్ళకు ఏళ్లు చదువు కుని, వేలకు వేలు ఖర్చు చెయ్యక్కర్లేదు. జీవితమే వారి విద్యాలయము. మానవత్వమే వారి విద్య. పొందే అన్ని అనుభవాలూ, సంపాయించే సమస్తవిజ్ఞానమూ, వారికి తమ వృత్తి వ్యాపకంలో మూలపదార్థంగా వుపయోగపడుతుంది. జీవితమే వారికి కావలసిన సమస్తమూ రెండుచేతులా సమకూరుస్తుంది."

మిస్టర్ క్వాఫ్ చెప్పిన దానిలో రచయితలు యూనివర్సిటీలకి వెళ్ళక్కర్లేదనే భాగం మటుకు నాకు, చాలా నచ్చింది. మా అమ్మా, తాతయ్యా, నన్ను 'ఏల్' యూనివర్సిటీలో చేర్పించేందుకు ప్రయత్నం చేస్తున్నారు. నాపేరు అప్పటికప్పుడే నమోదు చేయించారా విశ్వవిద్యాలయంలో. మిస్టర్ క్వాఫ్ పలుకులు నేను తాతయ్యదగ్గిర నాలుగైదుసార్లు నొక్కి నొక్కి అన్నాను. రచయితలు విశ్వవిద్యాలయాలకి వెళ్ళక్కర్లేదని, అనుభవజ్ఞుడైన మిస్టర్ క్వాఫ్ అంటున్నాడు - అని తాతయ్యతో చాలాసార్లు చెప్పి చూశాను - నన్ను యూనివర్సిటీకి పంపించడమనే ప్రయత్నం విరమించుకుంటారనే ఆశతో. కాని మా తాతయ్యవున్నాడే, వొట్టి మొండిఘటం. తనుపట్టిన కుందేలుకి మూడేకాళ్ళు అనే బాపతు. "మిస్టర్ క్వాఫ్ అభిప్రాయాలు నాకు అనవసరం. నువ్వు ముందు కాలేజీకివెళ్ళాలి. ఆ పైన నీకు రాయాలనివుంటే రాయవచ్చు. చరిత్రా, జీవశాస్త్రమూ, తత్వశాస్త్రమూ, యివన్నీ అర్థరహితము లనుకుంటున్నావా? అవి న్యూయార్కు వీధుల్లో కనబడుతాయనుకుంటున్నావా?" అని నామీద అరిచాడు తాతయ్య కోపంతో.

నేను ఎదురుచూస్తున్న స్వాతంత్ర్యానికి ప్రతి బంధకంగా వో పెద్ద రాతిగోడకట్టేశాడు తాతయ్య. నేను సెప్టెంబరులో కాలే జీలో ప్రవేశించకతప్పదు. నా వాయసవల్ల ప్రయోజనముండదని తెలిసినమీదట, వాయించడంకూడా ఎందుకని, ఆ ప్రయత్నం మాను కున్నాను.

"రచన వృత్తిగా స్వీకరించడం దుఃఖాన్ని పంచడమే" అని కొందరు అనేవారు. "చాలా గొప్పగ్రంథాలు జైలు గోడల మధ్యా గర్భదారిద్ర్యంలోనూ నిర్మితమయాయిట. కొందరు రచ యితలు తమకష్టాలు భరించలేక తాగుబోతులై ఆ తాగుడులో మరణించారు." ఏమైతేనేం - చాలామంది అనడం, రచయిత అవాలనుకోడం మంచిపనికాదని.

ఎవరు ఎన్ని చెప్పినా ఈ కథలు నన్ను భయపెట్టలేక పోయాయి. న్యూయార్కు నగరంలో పుట్టిపెరిగిన నాకు, కష్టాల మధ్య నుంచి మనిషి ఎలా నేర్పుగా అడుగులువేసుకుంటూ ముందుకుసాగాలో, చిన్నప్పటినుంచీ అనుభవ పూర్వకంగా తెలుసు. మా అందాలదీవి ఒక చిన్నప్రపంచం. ఆ చిన్న ప్రపం చంలో, వేరువేరుజాతుల మనుషులూ, విభిన్న జీవితమార్గాల నడిచేవారూవున్నారు. ఇంత విచిత్రానుభవంపున్న దీవిలోని మని షిని నేను. రచయితను ఎందుకు కాలేను ? సామాన్యులు చెప్పే కష్టాలు నన్ను ఏ విధంగా బాధించగలవు ? - అని నాలో నేను ప్రశ్నించుకోసాగాను.

అదిగాక, లింకన్‌మీద పదిపేజీలు రాసినపుడు నే నొక మహత్తరవిషయం తెలుసుకున్నాను. నేను చెప్పదలచుకున్నది మాటల్లోగాక, వ్రాతల్లో బాగాచెప్పగలను. ఆ వ్రాసిన మాటలే నేను నోటితో చెప్పవలసివస్తే, నా నత్తి నన్ను అంతబాగా చెప్పనిచ్చేదా? రచయిత నవడంద్వారా నేను, నా నత్తిని జయించగలను. కలమూ కాయితంద్వారా సంభాషణ జరపడంతో, నా నత్తిని నేను దాచుకో గలను. బయటకి తెలియకుండా చేయగలను. నేను చెప్పదలచు కున్న యావత్తూ, నదురూబెదురులేకుండా చెప్పడానికి యిదొక్కటే మార్గం. మిస్టర్ క్వాఫ్ అభిప్రాయాలలో నిజం లేకపోలేదు. రచ యిత కాదగినవాడు, జీవితంలోని ముడిపదార్థాన్ని చూడాలి. మా చుట్టలషాపు, నాకు యీ ముడిపదార్థానుభవాన్ని యివ్వడంలో ఎంతో సహాయకారి అయింది.

నేను చుట్టలషాపూ, పత్రికాప్రకటనల ఏజెన్సీ నిర్వహించడ మెలాగో తెలుసుకున్నాను: పత్రికా ప్రపంచంతోపాటు జోళ్ళ తయారీ, వస్త్రంగం, వ్యవసాయపుపనీ, రాజకీయలూ, కార్మిక సమస్యలూ, పియానో సంగీతం మొదలైనవికూడా కొంచెం కొంచెంగా నేర్చుకున్నాను. కత్రతోచేసిన రెడ్‌యిండియన్‌ని, ఎలా పెయింట్‌చేస్తారో నాకుతెలుసు. తాగి తందనాలుఅడుతూ, నడి రోడ్డుమీద రెండువర్గాలవారు, ఎంత అమానుషంగా పోరాడేదీ నాకుతెలుసు. ఎలక్ట్రిక్ బెల్ సమకూర్చడం, మంచి గుర్రమేదో పోల్చడం, పగ్గె రాపనులు నాకుతెలుసు. ఇవన్నీ ఒకదానితో ఒకటి సంబంధంలేనివే అనుకోండి. కాని నేను రచయితను అవదలచు కున్నపుడు యీ అర్థంలేని ముక్క చెక్కలన్నీ, ఒకటిగా సమ

కూడి, మొత్తంమీద వుపయోగపడగల విలువని, ఏ నాడో ప్రసా దించి తీరుతాయి. అనుభవజ్ఞానమనునది డబ్బుపెట్టికొనలేము. జీవనవిధానంతోబాటు అది లభ్యమవుతుంది. ఆ ఏటికాయేడు గడుస్తున్నకొద్దీ, మనకి తెలిసిన ప్రపంచమూ మనచుట్టూ ప్రపం చమూ, విశాలమై, సువిశాలమై, సంఘటనలనే కళామందిర ములో, వ్యక్తుల మొహాలు చిత్తరువులవలె కనపడుతాయి. దేని కైనా అనుభవంవుండటం మంచిది. రచయిత నవాలని నిశ్చ యించుకున్నమీదట, ప్రతికొత్త అనుభవమూ, నాకొక వినూతన అర్థాన్నియివ్వసాగింది. ఈ అనుభవాలకి, ఒక క్రమతా ఒక పద్ధతీ ఏర్పడ్డాయి. అవి ఏర్పడటంతో నేను పెద్దవాడి నయాను.